శ్రీః

# ఒక తేజోమయజ్వాల

## శ్రీ అరవిందుల సావిత్రి

డా॥ ప్రేమనందకుమార్ గారి ఆంగ్లమూలానికి

తెనుగుసేత : చింతగుంట సుబ్బారావు.



*1872 - 1950*

-- ప్రకాశకులు --

**రావి మోహనరావు**

*Dandy House,* **404,** జంజనం కాంప్లెక్స్,

చీరాల - **523155.**

శ్రీః

# ఒక తేజోమయజ్వాల

**శ్రీ అరవిందుల సావిత్రి**

**డా॥ ప్రేమనందకుమార్ గారి ఆంగ్లమూలానికి**
**తెనుగుసేత : చింతగుంట సుబ్బారావు.**


| | | |
|---|---|---|
| ముద్రణ | : | *05-12-2015* |
| ప్రతులు | : | *300* |
| పేజీలు | : | *205* |
| వెల రూ. | : | *60-00* |



**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411

***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**



The Book **'A luminious Flame : Sri Aurobindo's Savitri'** of Dr. **Prema Nandakumar** is translated into Telugu Language by Sri **Chintagunta Subbarao** recently. I extend my Thankfulness to both of them.

**- Ramora.**



# - విషయ సూచిక -

శ్రీః

# ఒక తేజోమయజ్వాల - శ్రీ అరవిందుల **సావిత్రి**

## 1వ కాండ - నిసర్గకాండం

## 1వ సర్గ - లక్షణప్రత్యూషం

శ్రీ అరవిందులు (1872–1950) ఒక దేశభక్తుడు, కవి, అనువాదకుడు, నాటకకర్త, యోగి. వేదాంతము, సంస్కృతి, సాహిత్యము, ఆధ్యాత్మికత, ఈ యీ ప్రపంచాలలో వారి బహుముఖప్రతిభాయుత ప్రతిపాదనలు లెక్కకు మిక్కిలి. అమూల్యమైన ఈ నిధినుండి సర్వోత్తమమైనదానిని ఎన్నిక చేయటం చాలా కష్టం. అయినప్పటికి, వారి మహాకావ్యం సావిత్రి మహామహితవైభవంతో ప్రకాశిస్తూ భవిష్యత్తులోనికి మనం సాగించే ప్రయాణంలోని ప్రయాసలన్నిటికి మార్గదర్శకం కాగలదు. ఒక అద్భుతాంశం వస్తువుగా గల ఒక అద్భుతమైన కావ్యం. అది మహాభారతంలోని అరణ్యపర్వంలో వ్యాసుడు చెప్పిన సావిత్రి కథ ఆధారంగా నిర్మితమైనది.

బ్లాంక్ వర్స్ (Blank Verse) అనబడే ఛందోరీతిలో ఆంగ్లంలో రచింపబడిన ఆ 24000 పైగల పంక్తులు మహాయోగి శ్రీ అరవిందుల దర్శనాల యొక్కయు, వారి ఆధ్యాత్మిక సహయోగియైన శ్రీమాత యొక్క యోగానుభవాల ఫలస్వరూపమైనవి. నేడు ఈ మహాకావ్యమొక పవిత్రగ్రంథంగా ప్రపంచవ్యాప్తంగా అసంఖ్యాకులచే 'పారాయణగ్రంథం' గా నిత్యమూ అధ్యయనం భక్తితో చేయబడుతూన్నది.

ఈ మహాకావ్యం పండ్రెండు కాండలలో నలుబది తొమ్మిది సర్గలతో పరివ్యాప్తమై యున్నది. ఈ కథ మధ్యేమార్గంలో, సావిత్రీ సత్యవంతుల పరిణయమైన సంవత్సరం తరువాత సావిత్రి మృత్యువు నెదుర్కోటానికి వ్రతయోగదీక్షకుపక్రమించిన సందర్భంలో, మొదలవుతుంది. మొదటి సర్గ, లక్షణ ప్రత్యూషము, అరణ్యాశ్రమంలో, సత్యవంతుని ఆయువు తీరిపోవురోజుగా నారదుడు నిర్దేశించిన రోజున సంఘటిల్లుతుంది.

'లక్షణప్రత్యూషము' రాత్రి వర్ణనతో, వైదికమైన 'రాత్రిసూక్తా'న్ని జ్ఞప్తికి దెచ్చే విధంగా, మొదలవుతుంది. ఆది తన గర్భంలో తాను ప్రసవించబోయే ఉజ్వల ప్రత్యూషాన్ని పొదువుకొన్న రాత్రి. ఈ రోజు మానవ జాతికి ప్రసాదించనున్న ఘనవిజయాన్ని గూర్చి పుడమి కే మాత్రము భావనలేదు:

*Athwart the vain enormous trance of space,*
*Its formless stupor without mind or life,*
*A shadow spinning through a soulless Viod,*
*Thrown back once more into unthinking dreams,*
*Earth wheeled abandoned in the hollow gulfs*
*Forgetful of her spirit and her fate.*

**యోచనాశూన్య స్వప్నంలోకి విసరివేయబడిన**
**ఛాయామాత్రభూతలం తన భవితను మరచి,**
**తన చేతనను మరచి, ఆ శూన్యాఖాతంలో,**
**దంభీభూతాంతరిక్ష మహాసమాధిలో,**
**మేధస్సూ జీవమూ లేని అరూపజడత్వంలో**
**ఆత్మరహితశూన్యంలో పారవేయబడి సుడిబడింది.**

ఇప్పుడు ప్రత్యూషమింక మెల్లమెల్లగా, ఒక చిన్న కదలికగా, పొడసూపుతుంది, "ఒక అనాఖ్యాత చైతన్యం, ఒక అసంభావిత భావం". క్రమక్రమంగా గగనతలం వెలుగు సంతరించికొంటుంది, తూర్పునొక అరుణిమ అలముకొంటుంది, అది స్వప్నాల వాకిలికి ఒక బంగారు పూతయన్నట్లు. అంత హఠాత్తుగా అంతటా వెలుగునిండి, ప్రకృతియే స్వయంగా దివ్యత్వాన్ని అర్చిస్తూన్నట్లు తోస్తుంది. శ్రీ అరవిందులు దానినొక ఉపమలో దర్శించారు :

*All grew a consecration and a rite.*
*Air was a vibrant link between earth and heaven;*
*The wide-winged hymn of a great priestly wind*
*Arose and failed upon the alter hills;*
*The high boughs prayed in a revealing sky.*

**సమస్తమొక ప్రతిష్ఠాపనము, ఒక కల్పమునైనది.**
**భూనభోంతరమున వాయువొక శ్వసితసూత్రము;**
**దేవపీఠముపైనొక మహాపురోహితవాయువు**
**వివృతగరుత్స్తోత్రమై విక్రమించి సడలినది;**
**ఉన్నతతరుశాఖ లా వ్యంజకాకాశమున ప్రార్థించినవి.**

ఈ రీతిగా దివ్యశక్తిస్పర్శ ఉషాదేవి రూపంలో కొద్దిసేపు కలిగి, అంతలో, భూమిపుత్రులు క్రొత్తరోజున మేల్కొను నంతలో, నిష్క్రమించింది. "మానవుడు తన విధిభారమును తలకెత్తుకొనియె."

ఋషి నారదుడు సావిత్రికి రానున్న గండమును గూర్చి ముందే తెలిపిన రోజు వచ్చినప్పుడు, ఆమె తన ఆశ్రమంలో నిద్రిస్తూన్న సత్యవంతుని ప్రక్కన కూర్చుని ఉండటం గమనించగలము. శ్రీ అరవిందులామెను, మానవజాతిని అధోముఖంగా శూన్యం లోని కీడ్చుకొనిపోవు మృత్యువు నుండి కాపాడి, పరిణామ నిశ్రయణిపై పురోగమించుటలో చేయూతనివ్వటానికి మానవరూపంలో ఐచ్ఛికంగా అవతరించినదానినిగా దర్శిస్తారు. ఆమె కూడా, ఇతర అవతారములవలె, మానవజాతి పరివర్తనాన్ని సులభంగా సాధించలేదు. దేవుని అవతారాలను, వారు మన మధ్య తిరుగుతూన్నప్పటికీ, మనమెప్పుడూ గుర్తించటం లేదు. అందుకు విరుద్ధంగా, అవాస్తవికమైన స్వాప్నికులని, పిచ్చివారని, కాలం చేతిలో నిస్సహాయ, నిరాశాయుతమైన బందీలనీ వారిని మనం అవహేళన చేస్తాం. వారు చేసిన మంచి పనులను సైతం నిజానికి మనం ధ్వంసం చేస్తాం. కనుక ఈ అవతారాలు తాము వచ్చిన పనిని సాధించకుండానే నిష్క్రమిస్తారు. "వారి వెనుక ఒక దివ్యనామాన్ని మాత్రమే మిగిల్చి పోతారు."

సావిత్రి అట్లా కాదు. ఆమె బాధను సహించటానికీ, మృత్యువు నెదిరించటానికీ, నివారణలేని యీ వ్యాధినుండి మానవ జాతిని విముక్తులను చేయటానికీ సిద్ధమై వచ్చింది. విజయాన్ని సాధించటానికి ఆమె మానవజీవితాన్ని అంగీకరించి, బాధలను సహించి, మృత్యుచ్ఛాయలో జీవించటంలోని మహాభయాన్ని అనుభవించ వలసివచ్చింది. సత్యవంతుని మరణసమయం ఆమెకు ముందే తెలియటం వలన ఆమె యాతన గాఢతరమైనది. దాని నంగీకరించి నిర్వికారంగా నిలువబడటానికి తాను సిద్ధం కావలెనా, లేక దానితో పోరాడి ఈ భయంకర విధినుండి మానవజాతికి శాశ్వతముక్తిని సంపాదించవలెనా?

సావిత్రి నిర్ణయం చేసికొన్నది. ఆమె తానొక ప్రయోజనసాధన కోసం వచ్చింది, వెనుకడుగు వేయదు. ఈ మహాయుద్ధంలో యే మానుషశక్తీ ఆమెకు తోడ్పడలేదు : "అసహాయయై ఆమె ముందు చూపుతో భయంతో సహించవలె." సావిత్రి హృదయం భయభ్రాంతమయిందనటం సత్యం, కాని ఆమె తన అంతరంగమథనాన్ని బహిర్గతం కానివ్వలేదు. ఆమె తన దుఃఖాన్ని "ఒక గూఢమైన, తీక్ష్ణమైన ఖడ్గం"గా మార్చుకున్నది. పరిస్థితిని సమీక్షించికొని, అజేయమైన అవతారం, సావిత్రి, అడవిలో ఆశ్రమంలో నివసిస్తూన్న సత్యవంతుని యౌవనవతియైన భార్యగా లేచి నిలిచింది. తన జీవితం, తన పుట్టుక, వృద్ధి, ఋషి నారదుని భవిష్యవాణి, సత్యవంతునితో వివాహం, ఒక్క సంవత్సర కాలపు వేదన, ఆనందం, అన్నీ ఆమె ముందు, టెలివిజన్ తెరమీదవలె, ప్రత్యక్షమైనాయి. వేదన ఎందుకంటే, సత్యవంతుని మరణం సంగతి ముందే తెలిసినందువలన; మరి ఆనందం ఎందుకంటే, తమది యే దోషమూ లేని వివాహం కావటం వలన :

*All came back to her : Earth and Love and Doom,*
*The ancient disputants, encircled her*
*Like giant figures wrestling in the night.*

**సర్వమామె స్మృతికి వచ్చినది : భూమి, ప్రేమ, విధి,**
**పురాతన ప్రతివాదులు, ఆ నిశీథిలో మల్లయుద్ధం చేసే**
**భయంకరాకారులుగా ఆమెను చుట్టుముట్టినారు.**

శ్రీ అరవిందులు యోగం ద్వారా పరిష్కరించటానికి ప్రయత్నించిన సమస్య కూడా ఇదే. వారి తాత్త్వికరచనలు ఈ అనంతమైన పోరాటం మూలానికి చేరి, దానికి పరిష్కారమార్గాలను అన్వేషించగా, వారి కవితలు మరల మరల అదే ఇతివృత్తాన్ని ఆవిష్కరించినవి. ఉదాహరణకు, వారి కవిత, ప్రేమ – మరణము, మహాభారతం లోని ఆదిపర్వంలో రురు – ప్రమద్వరల కథపై ఆధారితం. వారు సావిత్రిలో, విధితో మానవుని పోరాటాన్నీ, మృత్యువుపై వానికి గల విజయావకాశాన్నీ ప్రస్తావించటానికి, సరియైన మూర్తిని కనుగొన్నారు. అందుచేతనే 'లక్షణ ప్రత్యూషము', ఈ సమస్యను కఠినమైన నిష్కర్షతో ఇలా పలుకుతూ ముగింపునిస్తుంది :

*Amid the trivial sounds, the unchanging scene*
*Her soul arose confronting Time and Fate.*
*Immobile in herself, she gathered force.*
*This was the day when Satyavan must die.*

**ఈ అల్పిష్ఠధ్వనుల మధ్య, మారని ఈ దృశ్యం నడుమ**
**కాలాన్నీ విధినీ విరోధిస్తూ ఆమె ఆత్మ ఉద్బుద్ధమయింది.**
**స్థాణువైన ఆమె తన శక్తిని సమీకరించింది.**
**ఇది సత్యవంతుడు మరణించవలసిన రోజు.**

కాని సావిత్రీవిజయం తథ్యమైన రోజు కూడా ఇదే. ఆమె బలమే "విజయఖడ్గం". దివ్యమాత అశ్వపతి కనుగ్రహించిన వరప్రసాదం అది.

✻ ✻ ✻

## 2వ సర్గ – నిర్ధారణం

వనాశ్రమంలో సావిత్రి నిద్రనుండి మేల్కొని, మరి కొన్ని గంటల వ్యవధిలో తనకూ మృత్యువుకూ మధ్య పోరాటం కానున్నదని గ్రహిస్తుంది. ఇది నిజంగానే పరీక్షా

సమయం. ఆమె మనస్సు సంవత్సరం వెనక్కి వెళ్ళుతుంది. గాఢానురాగంతో నిండిన పండ్రెండు నెలలు ఎంత వేగంగా పరుగెత్తినవి! సావిత్రీసత్యవంతుల ప్రేమ అంతింత అనరానిది. అందమైన అరణ్యనేపథ్యం వారు జీవన మాధుర్యాన్ని ఆస్వాదించటానికి సరియైన తావు. ఆ పన్నెండు నెలలు సావిత్రికి ఉద్వేగభరితమైనవి వేరొక కారణం వలన కూడా : దుర్విధిని తెలిసి కూడ ఆమె దానిని మరెవ్వరితోనూ పంచుకోవటానికి ఇచ్ఛగించక తనలోనే దాచికొని తన ఉద్విగ్నహృదయాన్ని తానే సముదాయించికొనవలసినందున. సత్యవంతుని కోల్పోయి భరించలేని తన అత్తమామలతోనా, లేక తన విరహంతో ఏకాంతంగా సావిత్రి జీవితం గడుపవలసివస్తుందని బాధపడే సత్యవంతునితోనా, ఎవరితో పంచుకోగలదు!

అయినప్పటికి, సావిత్రి శాంతంగా ఉన్నది. ఎందుకంటే ఆమె యోగసాధనతో అరణ్యంలో మృత్యువును ముఖాముఖి కలుసుకోవటానికి తగిన శక్తిని సంపాదించికొన్నది. నేటి వరకు పరాత్పరుని నుండి ఆమె మహత్తరమూ ప్రశస్తమూ అయిన వన్నీ పొందింది; ఇప్పుడింక భగవద్దత్తంగా తనపై బడనున్న శోధనను నిశ్చలంగా స్వీకరించ దలచింది. ఆమె నుండి నిర్మాణాత్మక చర్యను కాలం భావిస్తూన్నది. తానా సవాలును స్వీకరించి తన మార్గంలో ఎదురైన సత్యవంతుని భౌతిక పంచత్వమనే ఆటంకాన్ని నిశ్చలంగా తొలగిస్తుంది. తాను విధికెదురు నిలుస్తుంది :

The fixity of the cosmic sequences
Fastened with hidden inevitable links
She must disrupt, dislodge by her soul's force
Her past, a block on the Immortal's road,
Make a rased ground and shape a new her fate.

**అనివార్యగూఢసంబద్ధ విశ్వాంతః పరంపరల**
**ధృవత్వముం దానె సడలించవలయు,**
**తన ఆత్మశక్తిచే గతము నవ్యవస్థీకరించవలె,**
**అదియె అమరమార్గావరోధకము;**
**ప్రమృష్టభూమిపై నూత్నవిధిని నిర్మించికొనవలె.**

ఈ పోరాటంలో తాను అశ్వపతినుండి గాని, ద్యుమత్సేను నుండిగాని, సత్యవంతుని నుండిగాని సాయము నపేక్షించరాదు. లౌకికులెవ్వరును తనకు తోడ్పాటు కాలేరు, నిజము. తానిప్పుడు స్వాభావిక శక్తిసంపన్నయైన యోగేశ్వరి. ఒంటిగానే యుద్ధము చేయవలసియున్నది :

*On the bare peak where self is alone with Nought*
*And life has no sense and love no place to stand,*
*She must plead her case upon extinction's verge,*
*In the world's death - cave uphold life's helpless claim*
*And vindicate her right to be and love.*

**జీవము నిరర్థకమై ప్రేమ కాలూనలేని చోట**
**అనాచ్ఛాదిత శిఖరాగ్రమున ఆత్మ ఏకాకియై**
**ప్రపంచపు మృత్యుగహ్వరమున, నిర్బీజాంచలమున,**
**శూన్యముతో నామె గళమెత్తి జీవపు నిస్సహాయ**
**స్వామ్యాధికారమునకై, సత్తకై, ప్రేమకై**
**న్యాయవిస్ఫోటనము చేయవలె.**

కాని ఆమె జయించగలదా? సావిత్రి యే రీతి మూర్తి? ఈ కావ్యం పూర్తిగా ఆమె వ్యక్తిత్వాన్ని గురించినదే. మొదట, మానవజాతి పరిణామక్రమంలో పైపైకి నిచ్చెనమెట్లెక్కి ఉపక్రమించే విధానంలో సహాయంగా ఆమె అవతరించే వరప్రసాదాన్ని దివ్యమాతనుండి పొందే దిశగా అశ్వపతి యోగం పరిక్రమించటం కనబడుతుంది. సావిత్రి జన్మించగా, ఆ మద్ర రాజకుమారి బాల్యమును పెంపును శ్రీ అరవిందుల కావ్యం దీప్తిమంతంగా ప్రదర్శిస్తుంది; సత్యవంతునితో ఆమె వివాహాన్ని "నిత్యప్రభువధువుల" వివాహంగా భూమిపై మానుషంగా జరుగుతూన్నట్లు ప్రదర్శిస్తుంది; ఋషి నారదుని భయంకర భవిష్యవాణిని విన్న తరువాత గూడ ఆమె తన మనోనిశ్చయంలో దృఢంగా ఉండటాన్ని చూచినప్పుడు సావిత్రి సామాన్యబాలిక కాదని అర్థమవుతుంది. ఆపై యోగకాండలో వివిధానుభవాలు కలుగుతూన్నప్పుడామె ధ్యానయోగంలో విశ్వచేతనను సాధించటం గమనిస్తాము.

అదెట్లాగైనా, ప్రస్తుతం మనం ఈ మహాకావ్యం మొదటే ఉన్నాం. ఆమె వ్యక్తిత్వాన్ని గురించి మనకింకా యేమీ తెలియదు. ఆలయంలోని దేవతామూర్తిని ప్రతిష్ఠించే విధివిధానాలెంత సుదీర్ఘమైనవో మనకు తెలియకపోవచ్చు, కాని మనమామెను గమనిస్తూ కొంత ఆమె శక్తితరంగాల స్పర్శను పొందవచ్చు. శ్రీ అరవిందులు సావిత్రిపాత్రలో అంతటి అనన్యవ్యక్తిత్వాన్ని దర్శింపజేస్తారు. మనల్ని రక్షింప వచ్చిన ఆమె, పంచాగ్నిమధ్యంలో తపోదీక్షితయైన ఉమాహైమావతివలె భాసిస్తుంది :

*The world unknowing, for the world she stood;*
*No helper had she save the strength within;*
*There was no witness of terrestrial eyes.*

*The Gods above and Nature below*
*Were the spectators of that mighty strife.*

**లోకమునకు సంజ్ఞలేకయే లోకమునకై నిల్చెనామె;**
**అంతశ్శక్తిగాక చేయూత వేరొండులేదు;**
**పుడమి కన్నులు సాక్షియై యున్నదే లేదు.**
**నింగి దేవతల్ ప్రకృతి మాత్రమె నేలపై**
**ఆమె బలవద్యుద్ధమునకైరి ప్రేక్షకుల్.**

గంభీరపర్వతనిశ్శబ్దమున పెరిగిన శక్తియామె. గడచిన పండ్రెండు నెలలలో ప్రగాఢధ్యానంతో దైవచేతనను ఆమె పొందియున్నది. ఇక్కడే ఆమె సత్యవంతుని కలిసికొన్నది, ఇక్కడే "ప్రేమ, మృత్యుచ్ఛాయను దాచి, ఆమెను చేరవచ్చినది" ప్రేమబాణము తాకి ఆమెను సత్యవంతుని దరికి జేర్చినది. ప్రేమ దేవత తానొక అసమానయువతిని వశీకరించికొన్నందుకు అమితానందము పొందియుంటాడు. మృత్యుదేవత కూడా అమితానందము పొందియే యుండును, కాని సావిత్రి ఒక సాధారణ మానవి కాదు, ఆమె జన్మ అపజయం పొందేందుకు కాదు!

*All in her pointed a nobler kind.*
*Near to earth's wideness, intimate with heaven,*
*Exalted and swift her young large-visioned spirit*
*Voyaging through worlds of splendour and of calm*
*Overflow the ways of thought to unborn things.*
*Ardent was her self-poised unstumbling will;*
*Her mind a sea of white sincerity,*
*Passionate in flow had not one turbid wave.*

**ఆమెలోని గుణసూచి అత్యుత్తమంబు.**
**పరివ్యాప్తధారుణికి చేరువై, దివికి గాఢానుబంధమై,**
**ఉద్దీప్తత్వరమైన విశాలదృగ్యుత యువచైతన్యము**
**ప్రశాంతవైభవోపేతమగు లోకాలనధిగమించి**
**అమూర్తభావవీథుల నుద్గమించినది.**
**అస్ఖలిత సంకల్పమామెది, ఆత్మసంతులితప్రచండము;**
**ఆమె మనస్సొక స్వచ్ఛనిష్కాపట్య సాగరము,**
**అనావిలోర్మికాసరిత్సంరంభి.**

సావిత్రిని వర్ణించే ఈ పంక్తులు యోచనలో, భాషలో పదచిత్రములలో, ఛందో నిర్మితిలో పరస్పర సంయోగం వలన అత్యుత్తమమైనవి. సావిత్రి అంతరంగంలోను, బహిరంగంలోను సుందరము. ఆమె శరీరము "అధిలౌకికములకొక హైమాలయద్వారము" ఆమె చూపు అన్యులలోని సర్వోత్తమత్వమును బహిర్గితము చేయునది. తనతో సాంగత్యము గలవారిపట్ల నామె వ్యక్తిగతశ్రద్ధ చూపించునట్లు తోచును. ఖండితాంగులకును వ్యధాభరితులకును ఆమె రక్షణ తప్పక లభించగలదు.

A deep of compassion, a hushed sanctuary,
Her inward help unbarred a gate in heaven;
Love in her was wider than the universe,
The whole world could take refuge in her single heart.

**ఒక అనుకంపావాహిని, ఒక గూఢదేవాలయము,**
**ఆమె అంతశ్శక్తి స్వర్గద్వారకవాట పాటకము;**
**ఆమెలోని ప్రేమ విశ్వాతీతవిశాలము,**
**ఆమె హృదయమొక్కటె ఎల్లలోకమునకాశ్రయ మివ్వగలదు.**

"ఒక అచంచలాక్షతాగ్నిసముద్ర"మైన సావిత్రి బాధను స్వీకరించినది : ఆమె యొక్క కార్యమును నిర్వహింపవలసియున్నది, ఆమె ఒక నియతీచక్రములను నిలువరించ వలసియున్నది. ఆమె నిర్వహించగల్గునా? ఆమెకా శక్తి యున్నదని శ్రీ అరవిందులందురు:

A prayer, a master-act, a king idea
Can link men's strength to a transcendent Force.

**"ఒక ప్రార్థన, ఒక సమర్థచర్య, ఒక రాజభావన**
**మానుషశక్తిని అతీతశక్తికి సంఘటింపగలదు"**

సావిత్రి సరిగా ఇదే పని చేసినది. ఈ సర్గ అట్టి రోజునకు సముఖమగుటకు సావిత్రి నిశ్చయముతో సమాప్తమగును :

The great world - Mother now in her arose...
A flaming warrior from the eternal peaks
Empowered to force the door denied and closed
Smote from Death's visage its dumb absolute
And burst the bounds of consciousness and Time.

**ఆమెలోనిపుడు మహాజగన్మాత ఉద్భవించినది...**
**అనంతత్వశిఖరాగ్రమునుండి ఒక ఉజ్జ్వలయోద్ధ**

**నిర్వచన కేవలమైన మృత్యుముఖము నుండి**
**ఆ నిరాకృతిబద్ధకవాట బలవత్పాటనకధికృతయై**
**చేతనాకాలావధుల నొక్క పోటున బ్రక్కలించినది.**

* * *

## 3వ సర్గ - రాజయోగం : ఆత్మమోచకయోగం

ఈ సర్గ కాలాన్ని వెనక్కి త్రిప్పి మద్రభూపతి అశ్వపతి తన వంశాన్ని నిల్పగల సంతానం కోసం తపస్సులో ఉండటాన్ని ప్రదర్శిస్తుంది. గమనార్హంగా, శ్రీ అరవిందులు ఈ సర్గారంభాన్ని, ఆలోచింపజేసే యీ వాక్యంతో చేసినారు : "ఒక ప్రపంచపు కోర్కె ఆమె మానుష జన్మకు బలవత్కారణమయింది." "A world's desire compelled her mortal birth" కనుక ఆ తపస్సు చేస్తూన్న వారొక్క వ్యక్తి మాత్రమే కాక సావిత్రిలో వర్ణింపబడినట్లు ఒక మానవజాతి ప్రతినిధి పూనిన యోగమని తెలుస్తుంది. ఈ పెను కార్యభారాన్ని మోయగల వ్యక్తి అశ్వపతియే. ఎందుకంటే ఆతడు మేధావి, దార్శనికుడు, ఆధ్యాత్మిక వ్యక్తి.

ఈ భౌతికశరీరమే సమస్తం కాదన్న అవగాహనతో అశ్వపతి యోగం ప్రారంభమవుతుంది. ఈ శరీరాన్ని "ఒక నిశ్చల ఏకత్వం, ఒక చైతన్యశక్తి" "a static Oneness and dynamic Power" రూపంలో నిగూఢంగా అధివసించి దైవం ఉన్నది. తనలోని దైవాన్ని గుర్తించటం వలన, అశ్వపతి తనను గురించి, తన వంశాన్ని గురించి యోచించటం మాని, మానవ జాతినుద్ధరించగల శక్తికోసం అన్వేషణనారంభిస్తాడు.

The landmarks of the little person fell,
The island ego joined its continent,
Overpassed was this world of rigid limiting forms:
Life's barriers opened into the Unknown.

**ఇహలోక కఠిన పరిమితాకృతుల నతిచరించి,**
**అల్పవ్యక్తిత్వపు సీమాంకములు రాలి పడియె,**
**అహంకారద్వీపము జేరె స్వీయవర్షమున్;**
**జీవనప్రాకారములవ్యక్తాంతర్వికసనము గాంచె.**

అశ్వపతి తన యోగంలో వేగంగా పురోగమించగలిగాడు. అలవోకగా సిద్ధులాతనికి వశమైనవి :

*He caught up lightly like a giant's bow*
*Left slumbering in a sealed and secret cave*
*The powers that sleep unused in man within.*
*He made of miracle a common act...*

**ఒక నిగూఢ బద్ధకవాటగుహాంతరాన**
**నిద్రింపవిడచిన మహాకాయుని ధనుర్విధాన**
**అనుపయుక్తమై మానవాంతరాళమున**
**నిద్రించు శక్తుల నలవోకనాతడు పట్టినాడు.**
**అద్భుతంబునతడొక సామాన్యచర్యయనగజేసె...**

కాని అశ్వపతి తన లక్ష్యమునుండి దృష్టిమరల్చక యోగాన్ని కొనసాగిస్తూ అగాధంలోకి చొచ్చుకుపోతూ, తర్కానికీ మనస్సుకూ ఆవలి తీరాన్ని చేరి, తన అంతరాంతరాలలో గల లోకాలను కనుగొని అరుదైన దృశ్యానుభవాలను పొందుతాడు. అట్టివానిలో ఒకటి, మానవుని పరిణామ నియతి వానిని ఒక అనతిక్రమ్యమైన విశ్వజనీన, అవిరోధసమైక్యతాప్రపంచమునావిష్కరించగలదన్న సూచననిచ్చే దృశ్యం:

*It voiced the unfulfilled demand of earth*
*And the song of promise of unreached heavens*
*And all that hides in an omnipotent sleep.*

**ధారుణి అసఫలీకృతాధికారమును,**
**అనావిష్కృతస్వర్లోక ప్రతిజ్ఞాగీతమును,**
**సర్వశక్తిమత్సుషుప్తిలో దాగిన దానినెల్ల**
**అది గళమెత్తి చాటినది.**

ఈ ప్రాణితదృశ్యాలను చూస్తూనే అతడు యోగంలో ముందుకు సాగి, "అనామికానంతము" "*nameless vast*"లో మునిగిపోయినాడు. ఇది మూలప్రకృతియొక్క ప్రధాన వస్తువు. దానిపై దృష్టి సారించునంతలో వానికి త్రికాలదృష్టి కలిగినది :

*As if a story long written but acted now*
*In his present he held his future and his past.*

**ఎప్పుడో రచింపబడిన కథనిపుడు నర్తించునట్లు**
**తన భూతభవిష్యముల నతడు వర్తమానమున గాంచె.**

మానసదృశ్యస్థితులు ఎప్పటికీ కొనసాగేవి కావు కనుక అశ్వపతి మరల ఈ ఇంద్రియజ్ఞాత ప్రపంచానికి, సాహసికయోగదర్శనానుభవాల జ్ఞానంతో శక్తివంతుడై తిరిగివచ్చినాడు. ఈ మానుషవ్యవహార ప్రపంచం మాటిమాటికి వానిని క్రిందకు లాగుతూన్నప్పటికిన్ని, అశ్వపతి ఏకమనస్కనిశ్చితితో యోగాన్ని కొనసాగించినాడు. కనుక వాని జీవములోని న్యూనతరస్థరములు గూడ, పరివర్తనకై ఆతడు చేసే ప్రజ్ఞాపూర్వక ప్రయత్నాల వలన, సంస్కరింపబడినాయి :

*As a sculptor chisels a deity out of stone*
*He slowly chipped off the dark envelope,*
*Line of defence of Nature's ignorance,*
*The illusion and mystery of the Inconscient*
*In whose black pall the Eternal wraps his head*
*That he may act unknown in cosmic Time.*

**అజ్ఞాన ప్రకృతికి రక్షణరేఖయైన**
**అచేతనభ్రమాద్భుతంబులను,**
**ఉలిగొట్టి శిలనుండి దేవతామూర్తిని శిల్పివలె,**
**ఆ తమోవలయంబునాతడు మెల్లగా చెక్కివేసె.**
**నిత్యుండు తన ఉత్తమాంగమున**
**ఆ తమోవేష్ఠనమును చుట్టికొని**
**విశ్వకాలగతుడై అజ్ఞాతక్రియాదక్షుడగును.**

యోగం సహాయంతో నిర్దోషత్వాని కాతడు అంతకంతకు చేరువయైన కొలది, సృష్టిని గూర్చిన అనేక మానస దృశ్యానుభవాలనాతడు పొందుతాడు. వానిలో నొకటి, భగవద్గీతలో వర్ణింపబడిన అశ్వత్థవృక్షాన్ని తలపించే విశ్వవృక్షము. మరియొకటి పరమ సృష్టికర్త యోగనిద్రలో నుండటం. అశ్వపతి సృష్టికారణమును, మనికిని, దానిని బాధించు వ్యధలను, వాని నివారణోపాయములను, సృష్టిని నిర్దోషము చేయు అవకాశములను గురించి, అశ్వపతి ఆలోచించనారంభిస్తాడు. సృష్టి ప్రభుని లీలామాత్రమేనా? ఏది యేమైనగాని, అశ్వపతి సృష్టి క్రమరహితక్రీడ కాదని, "ప్రభుని శరీరపు ప్రాణ ప్రచలనము" *a living movement of the body of God* అని గ్రహిస్తాడు.

*A glory and a rapture and a charm,*
*The All-Blissful sat unknown within the heart;*
*Earth's pains were the ransom of its prisoned delight.*

**ఒక వైభవమొక ఆనంద మొక సమ్మోహనముగ**
**ఆనందకేవలుండజ్ఞాతముగ హృదయమధివసించు;**
**ధాత్రీదుఃఖము లయ్యంతర్నివిష్టసంతోషనిస్తారమూల్యమగును.**

పదార్థములోనికి చేతన ప్రవేశించింది. పూర్వము అవతరణ జరిగినది (involution). ఇప్పుడు ఆరోహణ, పరిణామము (evolution) మొదలైనది. ఈ అవగాహన లభించగానే, అశ్వపతికి మనశ్శాంతి లభించినది :

The world was a conception and a birth
Of spirit in Matter into living forms,
And nature bore the Immortal in her womb,
That she might climb through him to eternal life.

**పదార్థములో చేరిన చేతన ప్రాణిరూపముల**
**నంతర్వర్తియై ప్రసవించుటన ప్రపంచమగున్;**
**ప్రకృతి తన గర్భాన నమృతత్వంబు ధరియించి**
**తానును వానితో నిత్యజీవంబు నందగోరె.**

అశ్వపతి ఆత్మ అజ్ఞానమునుండి ముక్తమైన తీరిది; ఇది అశ్వపతి మనోదేహముల తొలి ఆధ్యాత్మిక పరివర్తనకు గుర్తు. బాహ్యముగ నాతడు ఎప్పటి అశ్వపతియే, మద్రాధిపతియే. కాని ఆతడు దీప్తపురుషుడనునది స్పష్టము. ఎందుకనగా, వాని సాధారణ చర్య సైతము అంతర్దీప్తిచే ప్రేరణపొందియున్నదే. ఇప్పుడాతడు "లోకాల అజ్ఞాత రక్షకులతో" "unknown Guardians of the worlds" చర్చించి మానవజాతి కనేక విధముల సహకరించగలడు. సాధారణదృష్టికి కన్పించని రూపములను గూడ అతడు సుఖముగ చూడగలడు. వాని శరీరపు జీవకణములు సైతమిపుడు కేవలము స్వయంచలద్యంత్రములు (automatons) కావు. అవియొక దివ్యప్రయోజనమునకు సిద్ధము చేయబడినవి. దానికై అశ్వపతి యొక అతిబృహద్యోగయాత్రను చేపట్టనున్నాడు. ఎందుకనగా ఆతడు మృత్యువు, అశక్తతల కారణముగా నింతవరకు బాధింపడిన మానవజాతి నుద్ధరించుటకు నిశ్చయముతో ఉన్నాడు. ఈ నవలోకము సాధ్యమా? మున్ముందు రూపాంతరము జెందిన ధారుణి అధిచేతన దీప్తితో నిండిపోవు నొక కాలము గూర్చి మానవుడు భావింప సాహసించగల్గునా? కాని అశ్వపతి యొక దీక్షిత యోగి, భౌతిక జీవితమును దివ్యజీవనముగా రూపాంతరీకరించుటకు దృఢనిశ్చితి గలవాడు. కనుక ముందుగా తాను అందుకవసరమైన శక్తులతో సన్నద్ధుడగును :

*He drew the energies that transmute an age.*
*Immeasurable by the common look,*
*He made great dreams a mould for coming things*
*And cast his deeds like bronze to front the years.*
*His walk through Time outstripped the human stride.*
*Lonely his days and splendid like the sun's.*

**ఒక యుగమును రూపాంతరీకరించు శక్తుల**
**నతడు పుంజుకొనియె. సాధారణదృష్టి కమేయమై**
**భవితకై మహత్స్వప్నముల మూసలో కంచునట్లు**
**తన చైదముల జేసె కాలమ్ము నెదిరి నిల్వ.**
**కాలాంతరాళమున వాని నడక**
**మానుషవిక్రమంబు నధిగమించె.**
**ఏకాంతముల్ వాని దివంబులు,**
**సూర్యదివంబులట్లు వైభవోపేతముల్.**

※ ※ ※

## 4వ సర్గ – గూఢ జ్ఞానం

అశ్వపతి కాలచేతనచేత మానవజాతికి ప్రతినిధిగా, రాబోవు అవతారానికి మార్గం సుగమం చేయగలందులకై ఎన్నుకొనబడినవాడు. ఆతడీ చర్మచక్షువులకు కన్పించుదాని కావల ఉన్న లోకాల గూర్చి ఆంతరంగిక జ్ఞానమును పొందినాడు. తొలుత ఆతడు ప్రాచీన ఋషుల ద్వారా పొందిన జ్ఞానముతో తనను తాను సన్నద్ధుని జేసికోవలసియున్నదని తెలిసికొని, వేదాధ్యయనము నారంభించినాడు. "వేదముల గూఢ జ్ఞానము వేదాంతముగా పరిణామము చెందిన బీజము" "the secret knowledge of the veda is the seed which is evolved on into the Vedanta." అంటారు శ్రీ అరవిందులు. కనుక తత్త్వశాస్త్ర విధానములన్నియును, ఆధ్యాత్మిక రచనలున్ను నిజమునకు 'వేదము' అనబడే ఈ బీజము నుండి వృద్ధి చెందినవే. అశ్వపతి పూర్ణయోగము శ్రీ అరవిందులు అగ్నిసూక్తముల గూర్చి చెప్పిన వాని దీప్తిలో అర్థము చేసికొనవలసినది :

"మన యజ్ఞము ఒక ప్రయాణము, ఒక తీర్థయాత్ర, ఒక యుద్ధము, – దేవతల దిశగా ఒక ప్రయాణము, మనము అగ్నితో, అంతర్జ్యోతితో, మార్గదర్శిగా, నేతగా, ప్రయాణమున సాగుదుము. మన మానుష లక్షణములు ఈ అద్భుతజ్యోతి వలన

ఉద్ధరింపబడి అమరత్వము నొందును, మహత్ స్వర్గముగా మారును, దివ్యత్వలక్షణములు మనలోనికి దిగివచ్చును. ఋగ్వేదసిద్ధాంతము ఈ వేదాంతబీజమును బోధించుట అయినట్లే, దాని ఆంతరంగిక సాధన, శిక్షణ కూడా అటు తర్వాతి యోగసాధన, యోగశిక్షణలకు బీజము."

"Our sacrifice is a journey, a pilgrimage and a battle, - a travel towards the Gods and we also make the journey with Agni, the inner Flame, as our path-finder and leader. Our human things are raised up by the mystic Fire into the immortal being, into the Great Heaven, and the things divine come down into us. As the doctrine of the Rig-Veda is the seed of the teaching of the Vedanta, so is its inner practice and discipline a seed of the later practice and discipline of yoga."

ఇప్పుడశ్వపతి వేదాలను ప్రగాఢంగా అధ్యయనం చెయ్యటం ప్రారంభించినాడు, అందులోని అపరిమితత్వాన్ని (అనంతత్వాన్ని) గ్రహించే దిశగా మన ప్రారంభిక ప్రయత్నాలకు సంకేతమైన సూర్యోదయవైభవాలను అర్థం చేసికొనే ప్రయత్నం చేయసాగినాడు. "the sunrise splendours" which mark "our early approaches to the infinite." మనం ఆ ఆధ్యాత్మిక మహత్వాలకు క్రమేణ అధికాధికంగా పరాయి వారమైపోయినప్పటికీ, ఇప్పుడు మనం ఆత్మను ఉక్కిరిబిక్కిరి చేసే భౌతికతలో పడిపోయినప్పటికీ మనకు అసలు స్వగృహమైన ఆ అనంతత్వాన్ని అందుకునే ప్రయత్నంగా "ఒక సుదూరపు ఆనందస్వరం, ఒక ప్రార్థన "a faint voice of ecstasy and prayer" ఉండనే ఉన్నాయి. ఎప్పుడైనా మనం అంతర్ముఖులం కాగలిగినప్పుడు, మనం "ఆ నిశ్చలమైన అనంతజ్యోతిర్మయప్రాంతాలను" "still regions of imperishable Light" చూడగలం. అయితే, ఇది బాహ్యావిషయం కాదు. ఆ జ్యోతిర్మయప్రాంతం మనలోనే ఉన్నది, ఆ సర్వప్రభుత లోపలే ఉన్నది, సామాన్య మృత్పిండాన్ని (పుతం పెట్టిన) మేలిమి బంగారంగా రూపాంతరీకరించటానికి కృషి చేస్తూన్న ఆ సమర్థుడు లోన ఉన్నాడు :

Always we bear in us a magic key
Concealed in life's hermetic envelope.
A burning witness in the sanctuary
Regards through Time and the blind walls of Form.

**సదా మనలో నొక అద్భుత కవాటోన్మీలకం**
**జీవితపు ప్రాకారగుప్తిలో దాగియున్నది.**
**కాలాన్నీ, ఆకారాంధభిత్తినీ అతిక్రమించి**
**ఈ ఆలయంలో ఒక ఉజ్జ్వల సాక్షి యున్నది.**

మనకు బాహ్యాకారాన్ని ప్రసాదించే భూదేవతకు మన మేధస్సు, చిత్తము, బలము, సంతోషము అనేవి మంచి స్థితిలో ఉండటం అవసరం; ఎందుకంటే, అవి మనలోపల ఉండి మన అభ్యుదయానికి పనిచేస్తాయి. దురదృష్టవశాత్తు మనం వానిని పట్టించుకొనక, బాహ్యావిషయాలలో మునిగి ఉంటాము. ఈ శక్తులన్నింటినీ మనం మన ప్రగతి కోసం కాక మన భౌతిక సంతోషాలను పెంపొందించుకొనటానికే ఉపయోగిస్తూంటాము. మన భాగ్యవశాన, యోగంలో పరాకాష్టనందిన కొద్దిమంది ఈ సత్యాన్ని గ్రహించి మిగత వారికి ప్రేరణ కలిగించే ప్రయత్నం చేస్తారు :

*A few shall see what none yet understands*
*God shall grow up while the wise men talk and sleep;*
*For man shall not know the coming till its hour*
*And belief shall be not till the work is done.*

**ఇంకా ఎవరూ గ్రహించని దానిని కొందరు దర్శిస్తారు :**
**జ్ఞానులుపన్యసించగా, నిద్రించగా, దేవుడున్మూర్తమవుతాడు;**
**సమయం వచ్చేదాకా మానవుడా ఆగమనాన్ని ఎఱుగడు,**
**కార్యము సంపన్నమయ్యేవరకు విశ్వాసము కలుగదు.**

ఈ మధ్యకాలంలో దేవతలు జరుగుతూన్నదానిని గమనిస్తూంటారు. పరమశక్తి వెనుక నిలిచి, భౌమజీవితాన్ని దివ్యజీవనంగా మార్చే ప్రయత్నంలో మానవునకు సహకారాన్ని అందించటానికి సంసిద్ధంగా ఉంటుంది. మానవుని ఈ ఆరోహణంలో మార్గదర్శి కాగలిగినదీ, యత్నశీలమైన మానవజాతిని కలుసుకునే నిమిత్తం అవతరించటానికి సంకల్పించగలిగినదీ ఈ పరమశక్తి మాత్రమే. గూఢజ్ఞానము, "మన శక్తికి మించిన కార్యనిర్వహణలో" "abandoned to a task beyond our force" మనం పరిత్యక్తులం కాము సుమా! అని ధైర్యమిస్తుంది. విధి, మృత్యువు, బాధ : అవును. కాని దైవహస్తం, "స్పృహణీయ అమరత్వం" "conscious immortality" రూపంలో, మన వంకకెప్పుడూ చాచబడి ఉంటుంది. మన ఆత్మను బాధ, మృత్యువు అంటవన్న స్పృహ, విధివ్యాఘాతాలు అంటవన్న స్పృహ, అది అమరమన్న స్పృహ ఆ అవతారము వచ్చేవరకు, సర్వము సుఖమయమయ్యేంత వరకు మనం మార్గంలో కొనసాగేట్లు చేస్తుంది.

పరమశక్తి పురుషుడు – ప్రకృతిగా ఉంటుంది. ఇది ఒక అనిర్వాచ్యమైన ఒకటిలో రెండుగా ఇమిడినది : పురుషుడు అనేది సతర్కమైన ఆత్మ; ప్రకృతి అనేది సాకారమైన ఆత్మ :

He leaves to her the cosmic management
And watches all, the Witness of her scene.
A supernumerary on her stage,
He speaks no words or hides behind the wings...
He makes the hours pivot around her will,
Makes all reflect her whims; all is their play;
This whole wide world is only he and she.

**ఆతడామెకు సృష్టి నియంత్రణ నొసగెను,**
**సర్వము వీక్షించుచు తత్కార్య సాక్షియగును.**
**ప్రకృతిరంగస్థలాన సంఖ్యాతిరిక్తుడతడు,**
**మాటలాడడు, తెక్కల మాటున దాగియుండు...**
**కాలమామె ఇచ్ఛాకేంద్రపరిభ్రామి,**
**ఆమె మనోవృత్తుల ప్రతిబింబము; సర్వము తత్క్రీడ;**
**సమస్తవిశాల విశ్వమాతడు నామెయే.**

అశ్వపతి సునిశితవేదవేదాంతాధ్యయనం వానికొక దీప్తిని కలిగించినది. అదేమంటే "తారకల నొకట కట్టి యుంచు గ్రంథి యదియే" "this is the knot that ties together the stars." అన్నది. కొంత కాలము పురుషుడైచ్ఛికంగా ప్రకృతిదైన చర్మరజ్జు బంధంలో ఉంటాడు, కాని కాలం పరిపక్వమైనపుడు, ఆతడు మేల్కొంటాడు. వారిద్దరూ నవయుగావిర్భావం చేస్తారు. ఈ సతర్కాత్మయే ప్రాకృతికాత్మను సృష్టికార్యంలో నియమించింది. ఈ సతర్కాత్మ మనలో నిర్వివాదంగా ఉన్నది :

The Absolute, the Perfect, the Immune,
One who is in us as our secret self,
Our mask of imperfection has assumed,
He had made this tenement of flesh his own,
His image in the human measure cast
That to his divine measure we might rise.

**సంపూర్ణుడఖండుడు ముక్తుడు నైనవాడు**
**మనలోపల మన గుప్తాత్మయై యున్నవాడు**
**మనదైన వైకల్యఛద్మధారియై**
**ఈ మాంసస్థావరమును స్వీకరించినాడు,**
**వాని దివ్యప్రమాణమునకు మనమున్మూర్తమగుటకై**
**మానుషప్రమాణమున తన మూర్తి నావిష్కరించె.**

ప్రస్తుతం జీవితం ఒక స్వప్నచ్ఛాయామాత్రంగా కన్పించినప్పటికీ, ఈ సత్యం మనకు 'గూఢజ్ఞానం' నుండి అవగతమవుతుంది. తథైవ, దేవుని నిరాకరించువారు గూడ లేకపోలేదు! ఈ గుప్తాత్మకోసం అశ్వపతి తన అంతరంగంలో అన్వేషించవలసి ఉన్నది. అంటే, తాను తన అహంతనుండి బైటబడి తన మనోంతరాళంలో ప్రయాణించటానికి సాహసించే ధైర్యాన్ని ప్రదర్శించవలసి ఉన్నది. అది జీవం నుండి దూరంగా ప్రయాణం కాదు, జీవాంతరంగంలోకి. ఈ ప్రయాణాన్ని అశ్వపతి మానవుని ఆత్మనావరించియున్న బాధామృత్యువుల తమస్సు అంతరించి దివ్యజీవనోదయం కలిగేంతవరకు కొనసాగించవలసి ఉన్నది. పురుష-ప్రకృతుల సహవర్తనం ఈ నూత్న సృష్టిని, క్రొత్త జీవనాన్ని సూచిస్తుంది. అంటే, పరముడు తానే భవుడు, తానే ఉద్భవుడు, రెండున్నూ, ప్రకృతితో కలిసి ఉన్నప్పుడు ఉద్భవుడుగా పరివర్తనం చెంది, తనకు తానై యున్నప్పుడు అధ్యాత్మసత్యంగా భాసించే భవుడు. ఈ రహస్యాన్ని గ్రహించి, అశ్వపతి ఇప్పుడింక చర్మచక్షువులెఱుగని అజ్ఞాత బహుళప్రపంచాల నతిక్రమించి ఆ పరమాత్మకు మానవజాతి ఆవశ్యకతలను విన్నవించగల అనుభవాన్ని గడించే ప్రయాణానికి సన్నద్ధుడు కాగలడు.

❊ ❊ ❊

## 5వ సర్గ - రాజయోగం : ఆత్మస్వేచ్ఛామాహాత్మ్యతల యోగం

అజ్ఞానం నుండి ముక్తుడై, వేదసంబంధమైన పరిశుద్ధ గ్రంథాల సారాన్ని గ్రహించి, అశ్వపతి క్లిష్టమైన యోగమార్గాన్ని అనుసరించటానికి తనను తాను సిద్ధపరచుకుంటాడు. ప్రాపంచికవిషయాలకు కట్టిపడవేసే పరిమితమైన మనస్సును బంధించి ఉంచే సూత్రాన్ని తెగద్రెంచి, ఆతడు అతీంద్రియ ప్రపంచాలలో, సిద్ధుల ప్రపంచాలలో ప్రవేశిస్తాడు. ఇప్పుడాతడు ప్రకృతిని నడిపించే నియమాలను అర్థంచేసికొనగలుగుతాడు. ప్రపంచ మిప్పుడాతనికి చిక్కుముడిగా కనిపించదు.

*There in a hidden chamber closed and mute*
*Are kept the record graphs of the cosmic scribe,*
*And there the tables of the sacred Law,*
*There is the Book of Being's index page;*
*The text and glossary of the Vedic truth*
*Are there; the rhythms and metres of the stars*
*Significant of the movements of our fate.*

**అక్కడొక ముకుళితమౌనరహస్యమందిరంలో**
**విశ్వరచనారేఖాగణితాలు నిక్షిప్తమై ఉన్నవి,**
**అక్కడే పవిత్రధర్మఫలకాలున్నూ**
**జీవవిషయసూచికాపత్రగ్రంథమున్నూ;**
**వేద సత్య పాఠమున్నూ సమామ్నాయమున్నూ,**
**విధి నడతలను సూచించు నక్షత్రచ్ఛందో గతులున్నవి.**

తిరుమూలర్ వంటి సిద్ధపురుషులు ఈ అతీంద్రియ ప్రపంచాలలో ప్రవేశించి, మానవుడు – ప్రకృతి అను రెండిటిని గూర్చి సంపూర్ణజ్ఞానాన్ని పొందియున్నారు. వారు వేర్వేరు విరుద్ధ అభిప్రాయాల అంతరాలను పరిశీలించి ఒక స్పష్టమైన సత్యమైన దర్శనాన్ని సాధించగలిగినారు. అశ్వపతి గూడ అటువంటి ప్రగతినే సాధించినాడు కాని దానితో నతడు తృప్తిజెందలేదు. భూమి ఇంకనూ నిర్దోషస్థితికి చాల దూరమున ఉన్నది, దుఃఖము నుండి, మృత్యువు నుండి ముక్తిని పొందటానికింకను దూరముననే ఉన్నది. కనుక ఆతడు సంపూర్ణ నీరవమనస్కుడైనాడు. అక్కడకు యే భావముగాని చొరబారలేదు, దివ్యత్వసిద్ధికైన విశుద్ధమైన ఆకాంక్షను భంగపరచలేదు.

*One-pointed to the immaculate Delight,*
*Questing for God as for a splendid prey,*
*He mounted burning like a cone of fire.*
*To a few is given that godlike rare release.*

**అమలినానందము దెస నేకాగ్రమై**
**అతితైజసామిషమునకట్లు భగవదన్వేషియై**
**ఆతడొక అగ్నిశిఖవోలె జ్వలించుచు నారోహించె,**
**అట్టి సురభాజనవిమోచనమేకొందరో పొందగలరు.**

పరిణామంలో ఒక క్రొత్త యుగానికి వైతాళికులు కాగల అవకాశం చాల కొద్ది మందికే కలుగుతుంది. అశ్వపతి అటువంటి వారిలో ఒకడు. ఆతని యోగపరిశ్రమ వ్యర్థం కాలేదు. వాని మహదాశయానికి సమాధానంగా ఒక అనుగ్రహం కదలివచ్చింది:

*.....to meet him bare and pure*
*A strong Descent leaped down. A Might, a Flame,*
*A Beauty half-visible with deathless eyes,*
*A violent Ecstasy, a Sweetness dire,*
*Enveloped him with its stupendous limbs*
*And penetrated nerve and heart and brain*

*That thrilled and fainted with the epiphany :*
*His nature shuddered in the Unknown's grasp.*

**.....అనాచ్ఛాదితపవిత్రంగా వాని జేర**
**నొక బలవదవతరణం క్రింది కురికింది.**
**ఒక శక్తి, ఒక జ్వాల, ఒక సౌందర్యం,**
**అమృతనేత్రాలతో, అర్ధదృగ్గోచరమై,**
**ఒక తీవ్రానందం, ఒక దారుణ మాధుర్యం, తన**
**బృహత్కరములతో చుట్టివేసింది : నరనరాలు,**
**హృదయం, మస్తిష్కం, ఆ దివ్యసంగీతంతో**
**సొక్కి సోలింది : తదజ్ఞాతగ్రాహంలో**
**వాని ప్రకృతి కంపించింది.**

ఒక దివ్యమైన ఆశావాదం “ఆధ్యాత్మికేచ్ఛ” గల అశ్వపతి నిప్పుడావహించినది. మనం ఈ చర్మచక్షువులతో మన చుట్టూ ఉన్న మన అనుభవంలోని పాంచభౌతిక ప్రపంచావధులను మాత్రం చూడగలం. వాని కావలగల అనేక అతీంద్రియ ప్రపంచాలని అశ్వపతి ఇప్పుడు పట్టపగటి వెలుతురులో చూస్తూన్నట్లు చూడ గలిగినాడు. ఇవన్నీ శ్రీవిద్యోపాసనలోని మహామేరువువలెనే ఒక విశ్వసోపానపథం వలె ఆద్యంతములు లేకున్నవి.

*A giant order was discovered here*
*Of which the tassel and extended fringe*
*Are the scant stuff of our material lives...*
*In this drop from consciousness to consciousness*
*Each leaned on the occult Inconscient's power,*
*The fountain of its needed ignorance,*
*Archmason of the limits by which it lives.*
*In this soar from consciousness to consciousness*
*Each lifted tops of That from which it came,*
*Origin of all that it had ever been*
*And home of all that it could still become.*

**ఒక మహామహితక్రమం బిచ్చోట కాంచబడియె.**
**దాని కౌశేయసూత్రగుచ్ఛమున్ విస్తారితాంచలమున్**
**అస్మదీయ భౌతికజీవితపు నల్పద్రవ్యసంఘాతముల్...**
**చేతననుండి చేతనకగు ఈ చ్యుతిలో చేతనలెల్ల**

**తదపేక్షితాజ్ఞానమున కాదిమూలమై**
**తజ్జీవనావధులకగ్రణ్యనిర్మాతయైన**
**అతీంద్రియాసంజ్ఞాతశక్తిపై నానియుండె.**
**చేతననుండి చేతనకైన ఈ అధిరోహణాన**
**ఒక్కటొక్కటిగ చేతనలెల్ల తమ కాద్యమై**
**సత్తగలదానికెల్ల ఆదిమూలమై సదా ప్రభవించు**
**వానికెల్ల ఇల్లైన తత్త్వంబు జాడ తలలెత్తె.**

మనకు తెలిసిన, ఇంకను తెలియవలసిన వానిలో అత్యుత్తమమైన వానికి నెలవైన అనేక స్థరాలు, నిరంతరాయంగా ఆరోహణ అవరోహణలు చేస్తున్నట్లు కన్పించేవానిని గూర్చి తెలిసికోవటం అశ్వపతికి ఉత్తేజకరంగా అనిపించసాగింది. సారవంతమైన పదచిత్రాలను సృష్టిస్తూ, తాను దర్శించిన సంపదలకు సరియైన సంగీతస్థాయి శ్రుతులతో పోలిక చేస్తూ, భూమ్మీది జీవనం దివ్యజీవనంగా క్రమపరిణామం చెందే విధాన్ని ప్రదర్శించే మధ్యేమార్గ రంగస్థలాలను సూచిస్తూ, శ్రీ అరవిందుల లేఖిని ఔక్కలు సవరించింది.

ఇంకను పైన, పరంజ్యోతి ప్రపంచమున్నది. అక్కడ సూర్యుడు గాని, చంద్రుడు గాని, నక్షత్రాలు గాని వెలుగునివ్వరు. అక్కడ వెలిగేది స్వయంప్రకాశమైన మూర్తిత్రయం మాత్రమే :

*A last high world was seen where all worlds meet;*
*In its summit gleam where Night is not nor Sleep,*
*The light began of the Trinity supreme.*
*All there discovered what it seeks for here*
*It freed the finite into boundlessness*
*And rose into its own eternities.*

**అన్ని లోకాలు కలియు కట్టకడపటి లోకంబు కాననాయె;**
**దాని దీప్తాగ్రమున, రాత్రియును సుషుప్తియును లేదు;**
**పరమమూర్తిత్రయదీప్తి ప్రారంభమాయె.**
**ఇట నన్వేషింపబడినదెల్ల నట దర్శింపబడియె.**
**సాద్యంతము ననవధిలోనికి ముక్తముజేసి,**
**తనదైన అనంతత్వములోని కున్ముఖమై సాగిపోయె.**

కోట్లమంది సాధకులు దర్శించి మన అభాగ్యజీవులకై భూమిపై ఆవిష్కరించ యత్నించిన ఆదర్శాలను, మూర్తులను అశ్వపతి ఇక్కడ చూచినాడు. ఈ దర్శనములో

జ్ఞానము, అనుభవము శకలములు కావు. మనస్సుకు తోచే శంకలు అప్రయత్నముగ సమాధానములు పొందును. దీని నంతటిని ఒక అరుదైన ఆనందము పరివేష్ఠించి ఉండును. భూమిపై ప్రాణి దివ్యభౌతికరూపముతో, సంయుక్త చేతనతో సుసంగతమైతే! అశ్వపతి ఈ భావంలో తలమున్కలై పూర్తిగా విభిన్నదేశకాలముల స్థాయిలోని కున్మీలనం చెందినాడు :

Sunbelts of knowledge, moonbelts of delight
Stretched out in an ecstasy of widenesss
Beyond our indigent corporeal range.
There he could enter, there awhile abide.
A voyager upon unchartered routes
Fronting the viewless danger of the Unknown,
Adventuring across enormous realms,
He broke into another Space and Time.

**జ్ఞానసూర్యరశనల్, ఆనందచంద్రమేఖలల్**
**అస్మదీయాకించనవపుష్మద్గణముల కావల**
**ప్రహర్ష విస్తారముల్ పర్యాప్తములై యుండె.**
**అచ్చోటనతడు కాలూని కొంతతడవట్టె నిలిచె.**
**అసంకేతితమార్గములలో వెడలిన ఆ నావికుండు**
**అదర్శితాపదాపూర్ణమగు ఆ అజ్ఞాతము నెదిర్చి,**
**బహువిస్తార సీమాంతరములలో సాహసియై**
**ఆతడన్యదేశకాల పరిధిని ఛేదించి చనియె.**

❊ ❊ ❊

## 2వ కాండము - బహులోకయాత్రిక కాండం

## 1వ సర్గ - లోకసోపానం

తనను ఈ భూభౌతిక మండలాలకు బంధించే సమస్తవిషయాల నుండి దూరంగా పోవాలని అశ్వపతి బలమైన ప్రయత్నం చేసి, సంక్లిష్టమైన గుప్తలోకాలలో ప్రవేశించినాడు. చూచి చూడగనే అభిభూతుడైనాడు. అది మహామేరువువలె ఇన్నిన్ని అనరాని లోకాలు ఒకదానిపై నొకటి అమరి ఉన్నాయి! వీనిలో శాశ్వతమైనది యేది? ఈ చిక్కు నుండి బైటకు మార్గమెక్కడ? అసలు బైటకు మార్గమొకటున్నదా? ఈ సందర్భంలో వర్ణించబడిన దృశ్యాలు ఊహాకల్పితాలు కావు. అవి శ్రీ అరవిందులకు, 1926లో సిద్ధి అనుభవం కలిగిన తరువాత, వారు మరింత గాఢతరంగా యోగంలో చొచ్చుకుపోయినప్పుడు, కలిగిన యోగానుభవాలు, నిజమైనవి. ఈ విషయం వారు 1936లో నిరోద్‌బరన్‌కు వ్రాసిన లేఖలో స్పష్టంగా ఉంది :

"నిజానికి సావిత్రి వ్రాసి పూర్తిచేయవలసిన ఒక కావ్యమని నేనేనాడూ భావించలేదు. స్వీయయౌగిక చేతన నుండి ఏ మేరకు కవితను వ్రాయటం సాధ్యమో, దానిని సృజనాత్మకంగా చేయటం ఎట్లాగో పరిశీలించటానికి అది ఒక పరిశోధనాక్షేత్రంగా భావించబడింది."

అట్లా మనం అశ్వపతితో మనమెఱిగిన ప్రపంచానికి దూరం కానిదీ, అయినా భౌతికంగానూ మానసికంగానూ మన అవగాహనకు దూరమైనదీ అయిన ఒక క్షేత్రంలోకి కలిసి సాగుతాము. కాని మొట్టమొదటి అనుభవమే నేరుగా ఒక నిరంతరాయమైన విశ్వచైతన్య స్పర్శ కలగటం, "ఒక స్వయంసృజన అనంతము, నిరంతరాయము" "self-creation without end or pause" ఈ నిధి నుండియే మనం మనమెఱిగిన ప్రపంచపు వర్ణాలను, కదలికలను, రూపాలను స్వీకరిస్తూ ఉంటాము!

It poured into the Ever-stable's flux
A bacchic rapture and revel of Ideas,
A passion and motion of everlastingness.
There rose unborn into the Unchanging's surge
Thoughts that abide in their deathless consequence,
Words that immortal last though fallen mute,
Acts that brought out from Silence its dumb sense,
Lines that convey the inexpressible.

**అది నిత్యనిశ్చలప్రవాహాన్ని నింపుతూన్నది**
**దైవోన్మదానందంతోను, భావోన్మత్తక్రీడతోను,**
**ఒక అనంతత్వభావనా వికారముతోను, చేతనతోను.**
**జన్మమెత్తిన యోచనలు, నీరవమైనను అమరమౌ శబ్దాలు,**
**నిశ్శబ్దతనుండి తమ మౌనార్థనిష్పత్తి నొందు చర్యలు,**
**అనిర్వాచ్యమును ప్రకటించు వాక్యాలు**
**ఆ నిర్వికారితాకల్లోలినిలో ఎగసినవి.**

నిశ్చయంగా ఇదొక అయోమయాన్ని కలిగించే దృశ్యమే, ఈ చైతన్యం, వర్ణం అంతటినీ సాక్షిగా చూస్తూ తాను మాత్రం సంపూర్ణంగా నిశ్చలంగా ఉండే జనకశక్తి, సర్వమూలకశక్తి. శాశ్వతత్వం అండగా సాగే, ఈ సృజనాత్మక సమృద్ధిలో పరస్పరవిరుద్ధంగా మనకు కన్పించేవి అవిరుద్ధాలు. బాధ, సంతోషాలు రెండున్నూ ఈ సృజనానందంలో భాగమే, "బాధసైతమిచ్చోట ఆత్మానందమే" "*even pain, was the soul's pleasure here*" ఈ వైరుద్ధ్యాల సమన్వయానికి అర్థమేమిటి? ఈ నిర్నిద్రమనస్సుయొక్క అవ్యయ దర్శనాల" మధ్య "*exhaustless seeings of the unsleeping Mind*" నిలుకడకు స్థానమెక్కడ వెదకగలం? ఈ అద్భుతపు కేంద్ర స్థానానికి చేరటమెట్లా?

*Only was missing the sole timeless Word*
*That carries eternity in its lonely sound,*
*The Idea self-luminious key to all ideas,*
*The integer of the Spirits perfect sum*
*That equates the unequal All to the equal One,*
*The single sign interpreting every sign,*
*The absolute index to the Absolute.*

**తన ఏకమాత్రనాదాన అనంతత్వమును ధరించు**
**సర్వభావకుంచికయౌ స్వయంప్రకాశ భావమొకటి,**
**ఆత్మదగు అఖండత్వమునకు పూర్ణాంకమగుచు,**
**అసమాన సమస్తమునకు సమత్వైక్యమగుచు,**
**సర్వసంకేతార్థబోధకమగు ఏకైక సంకేతమగుచు,**
**పరమమునకు పరమార్థసూచియై వెలయు**
**ఏకైక కాలాతీత పదము మాత్రమె లేదు.**

ఉత్కంఠతోడి మహదాశ్చర్యాన్నీ అనుభవిస్తూ తనను తానే ప్రశ్నించుకొంటూన్న

ఈ తరుణంలో అశ్వపతి తన ముందొక దేవాలయరథాన్ని పోలిన నిర్మాణాన్ని చూస్తాడు:

*As if from Matter's plinth and viewless base*
*To a top as viewles, a carved sea of worlds*
*Climbing with foam-maned waves to the Supreme*
*Ascended towards breadths immeasurable;*
*It hoped to soar into the ineffable's reign:*
*A hundred levels raised it to the Unknown.*
*So it towered up to heights intangible*
*And disappeared in the hushed conscious Vast*
*As climbs a storeyed temple-tower to heaven*
*Built by the aspiring soul of man to live*
*Near to his dream of the Invisible.*

**పదార్థమధ్యస్థాదృశ్యమూలము నుండి అదృష్టోర్ధ్వమునకట్లు**
**ఒక ఉత్కీర్ణలోకముల సముద్రము పరముని జేర**
**ఎగయు ఫేనకేశాయిత తరంగములతో నెగసె**
**అమేయ పరిణాహములకు వర్ణనాతీతు రాజ్యానికాశజేసె.**
**అద్దాని నొక శతప్రస్థము లజ్ఞానమున కెత్తిపట్టె.**
**అట్లది స్పర్శాగోచరోన్నతులకెగబ్రాకి,**
**సాధక మానుషాత్మ నిర్మించిన వాసమునకు,**
**నిజస్వప్నసదృశమైన అయ్యగోచరుని సామీప్యమునకు,**
**అంతరిక్షమునకు, దేవాలయగోపురసోపానము లెక్కినట్లు,**
**అగోచరసతర్కాపారమున తిరోహితమయ్యె.**

అధ్యాత్మశిఖరాలనుండి పదార్థపుటఖాతాలకు దిగుతూ అక్కడొక మెట్లదారి ఉన్నది. ఇదంతా మనోనేత్రానికి సైతం అంత సులభగ్రాహ్యంగా లేదు. అవన్నీ "ఆత్మవైన దశల కొక సంగ్రహం" మాత్రమే ("a summary of the stages of the spirit") జగత్తుల ఈ సూక్ష్మసంగ్రహం "లోపల, క్రింద, బైట, పైన" ("within, below, without, above") ఉన్నది. జాగృతాత్మకు, భారతీయ సిద్ధసాహిత్యం వేల సంవత్సరాల అనుభవంతో స్పష్టంగా ప్రకటించినట్లు, ఈ పార్థివ శరీరం కారణంగా యెట్టి సీమామర్యాదలూ ఉండవు. మానవుడు దైవోపహతజీవికాడు, స్వయంకృషితో ఆతడాత్మవైన ఉన్నత సీమల నధిరోహించగలడని అశ్వపతికి స్పష్టమవుతుంది.

*A Mystery's process is the Universe.*
*At first was laid a strange anomalous base,*
*A void, a cipher of some secret Whole,*
*Where Zero held infinity in its sum*
*And All and Nothing were a single term,*
*An eternal Negative, a matrix Nought:*
*Into its forms the Child is ever born*
*who lives for ever in the vasts of God.*

**అద్భుతపు పరిక్రమణమే ఈ విశ్వమనగ.**
**ఆది నొక అనామక విచిత్రమూలమేర్పరుపబడియె,**
**అదియొక శూన్యము, ఏదేనొక రహస్యపూర్ణము,**
**అందు శూన్యమున అనంతమిమిడియుండు,**
**'అన్ని' యన్నను, 'సున్న' యన్ననట అర్థమొకటె,**
**అదియొక నిరంతరాభావార్థకము, శూన్యమాత్రిక.**
**శిశువు సదా తద్రూపముల దాల్చి ప్రభవించు,**
**సదా జీవించు నాదైవమైదానములలో.**

ఆనంత్యం ఒక సాద్యంతమైన ఆత్మగా రూపొందాలని నిశ్చయించినపుడు, సాక్షి ఆ శిశువులో నివసించవచ్చినాడు, విశాలసాగరాలు ఒక బిందువులో ఒదిగినవి, కాలబద్ధమైన ఈ శరీరం నిరవధికనిధిగా అనంతశక్తుల దాల్చినది. మనలోనొక సాక్షి, ఆంతరంగిక మార్గదర్శి, ఆత్మజ్యోతి, ఉన్నది. ఈ జీవన దేవత "అదృశ్యశిఖరాలకు మన అధిరోహణను ప్రేరేపిస్తుంది" ("inspires our ascent to viewless heights"). ఈ అంతస్సాక్షి యొక్క ప్రేరణాత్మకమైన పిలుపును అశ్వపతి విన్నాడు. అతడిప్పుడు అసంఖ్యాకమైన అంతర్లోకాల ప్రయాణానికి సిద్ధంగా ఉన్నాడు. అతని ఈ ప్రయాణం మానవునికెదురవుతున్న బాధ, మరణం, అన్న కూట ప్రశ్నకు సమాధానాన్ని అన్వేషించటానికే. ఒక సిద్ధుడు తన యౌగికమార్గాన సాగినప్పుడు, తన ఆత్మదైన ఆ సాహసయాత్రలో జయమా? అపజయమా? అంటూ ఆతడు ఆశ్చర్యచకితుడవుతాడా?

*Above him was the white immobile Ray,*
*Around him the eternal Silences.*
*No term was fixed to the high-pitched attempt;*
*World after world disclosed its guarded powers,*
*Heaven after heaven its deep beatitudes,*
*But still the invisible Magnet drew his soul.*

A figure sole on Nature's giant stair,
He mounted towards an indescernible end
On the bare summit of created things.

**వాని కూర్ధ్వమున నొక నిశ్చల శ్వేతరేఖ యుండె,**
**వాని చుట్టు నిరంతర నిశ్శబ్దములావరించె.**
**అయ్యుదాత్తప్రయత్నమున కొక అవధి అనిశ్చితము.**
**లోకము వెంట లోకము రక్షితనిజశక్తుల**
**నభంబు వెంట నభంబు ప్రగాఢనిజనిఃశ్రేయసముల వెలార్చె.**
**ఐన, ఇంకను అయ్యజ్ఞాతాకర్షకము వాని ఆత్మనాకర్షించె.**
**ప్రకృతిదౌ మహత్సోపానపంక్తిపై ఏకైక మూర్తియగుచు,**
**ఆతడగోచర గమ్యంబు దిక్కుగా నెక్కసాగె**
**అనాచ్ఛాదిత సృష్టి వస్తుపంక్తి శిఖరాగ్రమునకు.**

* * *

## 2వ సర్గ – సూక్ష్మపదార్థరాజ్యం

గుప్తలోకాలకు మహాయాత్ర సాగించిన అశ్వపతి ఇప్పుడు సూక్ష్మపదార్థస్థితిని చేరుకుంటాడు. ఇక్కడే "పృథ్వీ ప్రకృతి యైన ప్రకాశమాన మూలముల ఉనికి." ("dwell earth-nature's shining origins.") మనకు అతి సన్నిహితంగా ఉంటూ సౌందర్యసారాన్ని తనలో వహించే ఈ లోకాన్ని స్థూలపదార్థస్థితి కప్పి ఉంచుతుంది.

A world of lovelier forms lies near to ours,
where, undisguised by earth's deforming sight,
All shapes are beautiful and all things true.
In that lucent ambience mystically clear
The eyes were doors to a celestial sense,
Hearing was music and the touch a charm,
And the heart drew a deeper breath of power.

**సుందరతరాకారముల లోకమొక్కటి నికటమునగలదు,**
**అచట, విరూప భౌమ్యదృశ్యానావృతమై**
**సర్వము సుందరము, సర్వము సత్యమగును.**
**తత్సుదీప్తి వ్యాప్తి గహనముగ స్పష్టమై**

**కన్నులొక దివ్యేంద్రియకవాటములగుచు**
**సంగీతమగు శ్రుతి, సమ్మోహనము స్పర్శ,**
**హృదయమొక గాఢతరశక్తి నుచ్ఛ్వసించు.**

పదార్థంలోనికి పరముని అవతరణలో కొన్ని దశలిక్కడ గోచరమవుతాయి. ఉనికి (సత్) జ్ఞానము (చిత్) గా అవతరించి, ఆ చిత్ లేక జ్ఞానము ఆనందవర్ణాన్ని గ్రహిస్తుంది. ఇంకను క్రింది మెట్టుకు దిగి అతిమనస్సు అనబడే విజ్ఞానమయమై, ఆపై భౌతిక మనస్సును ప్రవేశించి, ఈ స్థూల పదార్థజీవనపు సమస్యలను, కుటిలతలను స్వీకరిస్తుంది. కాని ఈ మనస్సు తనకు పైనున్న విజ్ఞానమయ చిత్‌ను దర్శించగలదు. ఈ సూక్ష్మతలము అతిమనస్సు- మనస్సుల మధ్య, "మన అవరోహణ తలమునకు దేదీప్యమాన వలభియై" ("the brilliant roof of our descending plane") ఉంటుంది.

*It shields our ceiling of terrestrial mind*
*From deathless suns and the streaming of God's rain,*
*Yet canalises a strange irised glow,*
*And bright dews drip from the Immortal's sky.*
*A passage for the powers that move our days,*
*Occult behind this grosser Nature's walls,*
*A gossamer marriage - hall of Mind with Form*
*Is hidden by a tapestry of dreams.*

**అది కవచమై మన ధరామనోవితానమును గాచు**
**నమరసూర్యులనుండి, బాష్పాయితదైవవృష్టి నుండి;**
**ఐననొక విచిత్రమైన ఇంద్రధనుష్కాంతి ప్రసరించు,**
**అమరాకాశమునుండి కాంతిమత్తుషారముల్ జారు.**
**స్థూలప్రకృతిభిత్తకలమాటున నిగూఢమై**
**ఊర్ణనాభజాలాయిత మనోరూపముల వివాహవేది**
**మన దివంబుల గతిని నిర్దేశించు శక్తుల కొరకై**
**ఒక మార్గము స్వప్నయవనికాభ్యంతరమున దాగియుండె.**

అది అలాగే. ఎందుకంటే, ఇప్పటికింకా మానవుడు అధిమానసచైతన్య మవతరించుటలో దాని తాకిడికి సమతౌల్యాన్ని నిలుపుకోగలందులకు సంసిద్ధుడు కాలేదు. జడలుగట్టిన తన సిగలో గంగను దాల్చి దాని వేగాన్ని తగ్గించి, ఒక కొన్ని సన్నని పాయలుగా గంగను భగీరథునికోసం వదలిన శివుని వలె, ఈ సూక్ష్మతలం అధిమానస చైతన్య వేగాన్ని తగ్గించి ఒక కొన్ని, సన్నని కిరణాలను మాత్రం విడుదల చేస్తుంది. ఆ

కారణంగా ఈ సూక్ష్మపదార్థరాజ్యాన్ని, మూలరూపాల ప్రపంచాన్ని ధరించిన ఒక మధ్యాంతరాళ నిధిగా భావించవచ్చు :

*Figures are there undreamed by mortal mind*
*Bodies that have no earthy counterpart*
*Traverse the inner eye's illumined trance*
*And ravish the heart with their celestial tread*
*Persuading heaven to inhabit that wonder sphere.*
*The future's marvels wander in its gulfs;*
*Things old and new are fashioned in those depths:*
*A carnival of beauty crowds the heights*
*In that magic kingdom of ideal sight.*

**ఆకృతులట గలవు మర్త్యమానసస్వప్నములంటబోనివి,**
**భూమిపై తత్ప్రతిబింబములేమియు లేని శరీరముల్**
**దీప్తసమాధిస్థాంతర్నేత్రము నాక్రమించి**
**తచ్చిత్రగోళమధివసింప దివంబు ననునయించుచు**
**తద్దివ్యచరణవిన్యాసమున హృదయంబు నాక్రమించుచు**
**భవిష్యదద్భుతములు తదగాధములలోన తచ్చాడుచుండు;**
**అయ్యగాధములలో మూర్తిమంతములగు గతాగతవస్తువుల్,**
**తదాదర్శదృశ్యమయాద్భుతరాజ్యమందు**
**శిఖరంబుల మూగు నొక తుములసౌందర్యోత్సవంబు.**

సృజనాత్మక కళాకారులకు భావాలూ భావావేశాలూ ఈ ప్రాంగణం నుండే అందుతాయి. అయితే వారికి ఈ నిధి సార్వత్రికమని తెలియదు. అవతరించిన పరముడు ఆరోహించటం కూడా ప్రారంభిస్తాడు. ఇందువలన ఒక శక్తివంతమైన సహయోగిత ఈ సూక్ష్మరాజ్యంలో "పదార్థము ఆత్మ జ్ఞానయోగంలో కలిసిన" ("Matter and soul in conscious union meet") సమయంలో యేర్పడుతుంది.

ఈనాటికీ మానవునికి సత్తానందము (delight of existence) ఒక అద్భుతంగానే నిల్చిపోయింది. ఎందుకంటే ఆతడింకా మృత్యువు నీడలోనే అపకృష్టుడై ఉన్నాడు. "పవిత్రమైన ప్రహర్షోత్సవం" (sacred orgy of delight) మర్త్యుడైన మానవునకు విధిగా అంతరించవలసినదే. అన్ని కాలాల్లో పుడమిపై అసఫలప్రేమను, అసఫలశక్తిని, అసఫల జ్ఞానాన్నిసైతం మనం సాక్షిమాత్రులమై చూస్తాము, అనుభవిస్తాము. కాని మన పరిణామ సాహసయాత్రకు ఇది అంతం కాదు. ఈ యాత్ర నిజానికి పరముడు పదార్థంలో

అవతరించటంతో మొదలయింది. సర్వోత్తమఫలం లభించే కాలం ముందున్నది. అచిరకాలంలోనే వైఫల్యాలు విజయాలుగా రూపాంతరం చెందటం నిర్వివాదాంశం. సూక్ష్మపదార్థరాజ్యం భూమిపై మన భవిష్యద్విక్రాంతికి ఆవాసమవుతుంది :

By a subconscient yearning memory
Left from a happiness dead before she was born,
An alien wonder on her senseless breast.
This mire must harbour the orchid and the rose,
From her blind unwilling substance must emerge
A beauty that belongs to happier spheres.
This is the destiny bequeathed to her,
As if a slain god left a golden trust
To a blind force and an imprisoned soul.

**రూపుదాల్చక ముందె రూపతిన సుఖావశేషపు**
**అంతర్నిహితస్పృహితజ్ఞప్తి యొకటి**
**తదీయలుప్తసంజ్ఞకహృదయంబుపై విదేశాద్భుతంబు.**
**ఈ వృత్తికయె జపాపుష్పమున్ వర్ణోద్దీప్తసూనమున్ వహించవలయు**
**స్వీయాంధానిచ్ఛత్పదార్థము నుండి ఉదయించవలె**
**సుఖతరలోకములదైన ఒక సౌందర్యము.**
**ఒక ఖండితదేవత ఒక సువర్ణనిధిని**
**ఒక అంధశక్తికిన్ మరియొక బద్ధాత్మకిచ్చినట్లు**
**తనకు సంక్రమించిన భాగధేయ మిద్ది.**

మన కృషికి మనం, సూక్ష్మతలప్రేరణవలన, శౌచాన్ని జోడించగలిగినట్లయితే, జయించటం తథ్యం. ఎందుకంటే సూక్ష్మలోకాలు కేవలం ఊహాకల్పనల అల్లికలు కాదు, ఉనికి గల వాస్తవికతలు. "ఇప్పుడు దూరంగా ఉన్న ఆ జ్యోతి ఇక్కడే నైసర్గికమైపోతుంది" (The Light now distant shall grow native here), అన్నది శ్రీ అరవిందుల వాగ్దానం. మన యోగులు, సంతులు, సృజనాత్మక కళాకారులు ఆ సుదూరాల మండపాల నుండి అమరత్వపు సూచనలను పొందినవారు కారా? "రసజ్ఞానేంద్రియ మనే ఒక నాల్గవ ప్రమాణం" (a fourth dimension of aesthetic sense) మనల్ని సర్వజనక సౌందర్యానికీ, అమరత్వానికీ సరళీకరిస్తూ, ఈ పదర్థాచ్ఛాదనాన్ని, మనకు అనవరోధంగా, ఛేదించగలదు.

అశ్వపతి దృష్టికి సూక్ష్మపదార్థరాజ్యం పూర్తిగా నిర్దోషమే. ఇదీ వాని స్థితి. అది ప్రహర్షమూ సౌందర్యమూ ప్రేమ మాధుర్యమూ అవిరలమైనది, "ఒక నిర్దోషక్రమ విధాన

భావన" (a fantasy of perfect line and rule) కాని అశ్వపతి యాత్రలో ఇది ఒక మజిలీ మాత్రమే, తాను చూడవలెనని ఆశించిన సార్వత్రిక గృహం ఉన్న యాత్రాంతం కాదు, ప్రపంచ రూపాంతర వాగ్దానం పొందే చోటు కాదు. కనుక ఆతడీ లోకాన్ని దాటి ఆవలి వైపుకు సాగిపోతాడు :

*Our spirit tires of beings surfaces,*
*Transcended is the splendour of the form;*
*It turns to hidden powers and deeper states.*
*So now he looked beyond for greater light.*
*His soul's peak-climb abandoning in its rear*
*He left that fine material Paradise.*
*His destiny lay beyond in larger Space.*

**జీవోపరితలాలపై అలసే మన చేతన,**
**రూపవైభవ మధిగమింపబడెను;**
**అది గుప్తశక్తులదెస, అంతరాంతర స్థితులదెస మరలె.**
**కాన ఆతడిప్పుడు మహత్తర కాంతికై పారజూచె.**
**వాని ఆత్మ శిఖరారోహణము, దివసగృహంపు**
**కాంతిమత్ప్రాంగణమును వెనుకకు నెట్టై,**
**ఆతడా సూక్ష్మపదార్థసుఖభవంబు వీడె.**
**వాని గమ్యము సుదూరపారమున విశాలతరాంతరిక్షము.**

❊ ❊ ❊

## 3వ సర్గ - సత్త్వవైభవం, పతనం

సూక్ష్మపదార్థలోకమునుండి అశ్వపతి ఇప్పుడు జీవరాజ్యమున ప్రవేశిస్తాడు. ఆతడిక్కడ సర్వత్ర ప్రాణభూతమైన జీవతత్త్వం క్రియాశీలకమై ఉండటాన్ని గుర్తిస్తాడు. ఇక్కడి జీవితం మనమెఱిగినదే, జన్మ, వృద్ధి, క్షయ, నాశములతో కూడినది. ఇక్కడి అంతరిక్షం కేవలం అనుభవేచ్ఛతో నిండి ఉంటుంది కనుక పతన భయం గాని గత దుఃఖజ్ఞప్తి గాని కలుగదు. భయసందేహాలు, బాధావైఫల్యాలు, నిరాశలు, అన్నీ అనుభవసిద్ధమైన వాస్తవాలు.

*Careless of suffering, heedless of sin and fall,*
*She wrestles with danger and discovery*

*In the unexplored expanses of the soul.*
*To be seemed only a long experiment,*
*The hazard of a seeking ignorant Force*
*That tries all truths and, finding none supreme,*
*Moves on unsatisfied, unsure of its end.*

**బాధానుభవజాగృతిలేక, పాపపతనాల వెఱపులేక,**
**అనన్విష్టాత్మవిస్తారములలో**
**అపాయావగమాలతో నామె పెనగులాడు.**
**ఒక సుదీర్ఘప్రయోగమాత్రముగ తోచుచుండ,**
**అన్ని సత్యాల శోధించి పరమం బేదియుగానక,**
**ఒక అజ్ఞానశక్తిదౌ అన్వేషణ వికల్పము**
**అతృప్తితో, పరిణామానిశ్చితితో కొనసాగు.**

సహజంగానే ఇటువంటి వాతావరణంలో మానవులు ఓపికగా ఇతరుల బాధలను గురించి, దుఃఖాలను గురించి వింటూ ఉంటారు, మనకాలంలోవారు గంటల తరబడి తమ రోగాలను గురించి వాటి ఉపశమనానికి తాము వాడుతూన్న ఔషధాలగురించి చర్చిస్తూన్నట్లుగానే. లేకుంటే, పూర్వవైభవాలగురించి (తఱచుగా వారూహించినవే) తలచుకొని బాధపడుతూంటారు. కాని, సృష్టిని గురించిన పూర్ణసత్యం ఇది కాదు. ఆత్మన్యూనతాభావంలో తనను తాను కోల్పోవటం కోసం ఇది ఆరంభం కాలేదు. ఆ కారణంగానే జీవశక్తి ఎంత గొప్ప విషాదాన్నైనా ఛేదించి నవజీవనారంభానికి ప్రోది చేస్తుంది. ఎందుకంటే బాధానిరాశల హృదయంలో ఎట్లాగో ఆశ సజీవంగానే ఉంటుంది. పరిస్థితి నిరాశాజనకంగా ఉండవచ్చు, ఐనాసరే నిరాశాంధకారానికి లొంగిపోయేందుకు జీవశక్తి నిరాకరిస్తుంది. ఈ ఆశ ఒక స్వప్నమే కావచ్చు, ఒక దర్శనం కావచ్చు, కాల్పనికం కావచ్చు, అయినప్పటికీ, ఒక మెరుగైన, దుఃఖరహిత సుఖమయ భవిష్యత్తును సాధించటాని కది ఒక క్రియాశీలకమైన ప్రారంభం అవుతుంది!

*As through a magic television's glass*
*Outlined to some maginifying inner eye*
*They shone like images thrown from a far scene*
*Too high and glad for mortal lids to seize.*
*But near and real to the longing heart*
*And to the body's passionate thought and sense*
*Are the hidden kingdoms of beatitude.*
*In some close unattained realm which yet we feel,*

*Immune from the harsh clutch of Death and time,*
*Escaping the search of sorrow and desire,*
*In bright enchanted safe peripheries*
*For ever wallowing in bliss they lie.*

**ఒక మాంత్రిక దూరదర్శనాదర్శము ద్వారా**
**ఏదేనొక బృంహణశీలకాంతర్నేత్రమునకై రేఖాయితమైనట్లు,**
**మానుషనేత్రచ్ఛదము గ్రహించరాని సమున్నత హర్షములై**
**ఏదేనొక సుదూరదృశ్యప్రసారిత రూపములట్లు భాసించినవి.**
**కామయమానహృదయంబునకు చేరువై, సత్యమై,**
**శారీరక తీవ్రభావనలకు, ఇంద్రియజ్ఞానమునకు**
**రహస్యముగ నున్నవీ సత్యసుందరలోకముల్.**
**ఏదేనొక అనన్విష్టరహఃప్రదేశమున**
**మృత్యుకాలముల కర్కశగ్రహణాక్షమమై**
**దుఃఖకామనాన్వేషదృష్టి దొలగి**
**కాంతిమన్మంత్రరక్షిత పరివేషములలో**
**సర్వదా ఆనందక్రీడామగ్నమై యున్నవి.**

స్పష్టంగా, ఈ ఇంద్రియగోచర ప్రపంచానికి, స్వప్నసందృశ్యప్రపంచానికీ మధ్య ఒక దట్టమైన యవనిక రెంటినీ వేరుచేస్తూ ఉన్నది. ఈ రెండవ ప్రపంచాన్ని కేవలం అది యొక ఊహాకల్పితమైన ప్రభాకీటప్రపంచమని, ఒక్క క్షణం వెలిగి ఆపై అంధకారంలో కలిసిపోయేదే అని, తిరస్కరించలేము. మన ప్రాచీనులు, గొప్ప తత్త్వవేత్తలు, యోగులు, ఋషులు, భూమిపై నడయాడినవారందఱూ ప్రవచించిన సాధ్యాలను పరిగణించి చూస్తే, ఆ వ్యక్తులందఱూ పనీపాటా లేని వాచాలురు కారని స్పష్టంగానే తెలుస్తుంది. మన చుట్టూ మనం చూస్తూన్న ఈ సత్యం వలెనే, మన చుట్టూ మరియొక సత్యం కూడా ఉన్నది. దానిని చూడగల అంతర్దృష్టి మనందఱికి లభించకపోయి ఉండవచ్చు. ఆ రెండు నిత్యసత్యాలకు మధ్యనున్న తెర తొలగినప్పుడు మనం కూడా దానిని చూడగలం. అదెప్పుడు జరుగుతుందంటే, అతిమానసం అనబడే విజ్ఞానమయ చేతన అవతరించి ఆ తెరను చీల్చి చూడగల సహాయాన్ని మనస్సు కందించినప్పుడు అది జరుగుతుంది. భూమిపైగల జీవం మృత్యువుతో సంయోగం చెంది, ఒక విధమైన నిరాశను పొడసూపనిస్తూన్నది. తనలో మహామహితమైన అవకాశాలను ఇముడ్చుకున్న జీవానికిది బృహత్పతనం! ఐనా, అశ్వపతి నిరాశకు తావివ్వలేదు. ఎందుకంటే, మానవజాతికి ఒక

గొప్ప భవిష్యత్తు కలిగే అవకాశాలను ఆతడు చూస్తూన్నాడు. శ్రీ అరవిందులు మానవ హృదయంలో ఆశను, బలాన్నీ నింపటానికెప్పుడూ అవకాశాలనన్వేషిస్తూనే ఉంటారు. వారు మనముందు ఆదర్శజీవిత స్వరూపాన్నిట్లా ఆవిష్కరిస్తూన్నారు :

*Creation leaped straight from the hands of God;*
*Marvel and rapture wandered in the ways.*
*Only to be was a supreme delight,*
*Life was a happy laughter of the soul*
*And Joy was king with Love for minister.*
*The spirits luminousness was bodied there.*
*Life's contraries were lovers or natural friends*
*And her extremes keen edges of harmony:*
*Indulgence with a tender purity came*
*And nursed the god on her maternal breast:*
*There none was weak, so falsehood could not live...*

**ఒక్క ఉదుటున దైవహస్తమునుండి సృష్టి ఎగసి వచ్చె;**
**అద్భుతత్వము నానందమున్ తచ్చాడు నాపుంతలలో.**
**ఉనికియే పరమానందమయ్యె,**
**జీవమాత్మసుఖహాసమయ్యె,**
**హర్షము రాజుగా ప్రేమ మంత్రియయ్యె.**
**జీవప్రతిపక్షముల్ ప్రేమికులైరి, సహజమిత్రులైరి.**
**తదీయావధుల్ తత్సంయోగనిశితాంచలములయ్యె:**
**నిరతియొక సుకుమారపవిత్రతతోడ వచ్చి**
**తన మాతృపయోధరాన పోషించె నా దేవతన్:**
**బలహీనులట నెవ్వారు కారు, కాన వసించదసత్యమున్....**

స్వేచ్ఛతోను, శక్తితోను బలపడి, జీవం "భగవంతుని లయవిన్యాసముల రీతుల నన్వేషించును" (explore the measures of the rhythms of God.) ఈ జీవితంలోని దుఃఖరాహిత్యస్థితికి అశ్వపతి అమితాశ్చర్యాన్నీ ఆనందాన్నీ పొందినాడు. మానవజాతికీ స్థితి ఆదర్శప్రాయము! కాని ఆ రాజు తాను ప్రగతిశీల చింతకుడే అయినప్పటికిని, ఈ మరో ప్రపంచంలోనికి ప్రవేశించే సత్తా వానికింకా కలుగలేదు. వాని ఆత్మ భూలోక సంబంధి భూజాతమే. నిజానికి అశ్వపతి భూలోక వాస్తవికతకును దార్శనిక సత్యానికిని మధ్య సమతులనమున నున్న మన ద్వంద్వ ప్రకృతికి ఉదాహరణరూపము :

*Although he once had felt the Eternal's clasp,*
*Too near to suffering worlds his nature lived,*
*And where he stood were entrances of Night.*
*Hardly, too close beset by the world's care,*
*Can the dense mould in which we have been made*
*Return sheer joy to joy, pure light to light.*
*For its tormented will to think and to live*
*First to a mingled pain and pleasure woke*
*And still it keeps the habit of its birth :*
*A dire duality is our way to be.*

**అనంతత్వపరిష్వంగమాతడొకప్పుడెఱిగియున్నను,**
**వాని ప్రకృతి బాధామయప్రపంచమున కతినికటము,**
**ఆతడెచ్చోట నిలచెనో అట తమఃప్రలీనతలున్నవి.**
**ప్రాపంచిక దుఃఖాకులమైన మన సాంద్రప్రకృతికి**
**హర్షమునకు హర్షమును, నిర్మలకాంతికి కాంతిని**
**ప్రతిఫలించు క్షమత లేదు.**
**అత్యంత సంతప్తమౌ తత్సంకల్పము మొదట**
**నొక దుఃఖహర్ష సమ్మేళనమునకే**
**ఆలోచింపగ జీవింపగ జాగృతమైనది,**
**ఇంకను దాని జన్మశీలమునది వదలకున్నది:**
**మన మార్గమొక భీషణ ద్విత్వము కావలసియున్నది.**

అచేతనమైనట్లు తోచే పదార్థం నుండి ప్రాణి, మనస్సు కూడా ఉద్భవించినవి. అదెట్లైనను, మనస్సుతో బాటు సంశయమూ వచ్చింది, హర్షదుఃఖాలనే "దారుణద్విత్వం" (dire duality) అనుభవంలోకి వచ్చింది. ఇదే సార్వకాలిక సత్యమైనట్లయితే, మన ఇహలోక జీవితము "నిరంతరమరణంలో ఒక ఉపాఖ్యానం" (an episode in an eternal death) మాత్రమే అవుతుంది. ఏది యేమైన, భూమిపై మానవుని జీవితం ప్రస్తుతానికొక 'అసద్రహస్యం' (evil mystery). అదే సమయంలో, పరిణామావర్తిలో ప్రారంభదశలే ఇవన్నీ, అని కూడా గుర్తించాలి. ఇప్పుడశ్వపతి ఊర్ధ్వముఖ పరిణామావర్తిని పరిశీలించ నారంభించినాడు.

* * *

## 4వ సర్గ - అల్పప్రాణి రాజ్యాలు

దివ్యారంభములుగల జీవము కొంతకాలము వరకు "ప్రకృతిప్రేరితాజ్ఞానము" (an instinct driven Ignorance) వలన ప్రచోదితమైనది. "అల్పప్రాణి" ప్రపంచమైన ఈ లోకంలో ప్రాకృతికమైన సహజావబోధము, ఇంద్రియజ్ఞానము మాత్రమే సక్రియమై ఉంటాయి. అదిగాక, మనస్సు ముందుకురికి ఇప్పుడింక జీవాన్ని అదుపుజేస్తుంది, తన ఇష్టానుసారంగా దాన్ని నడిపిస్తుంది కూడా. ఎందుకంటే, అది కేవల సహజావబోధం కంటె ఉన్నతతరమైన ఒక చేతన కనుక. మానవుడొక జంతువు మాత్రమే కాడు. వానిదైన మనస్సొకటి వానికి సంపదగా ఉన్నది. అది వాని జీవితాన్ని సంస్కరించుకోటానికి అనంతమైన అవకాశాలున్నాయని వానికి నమ్మకం కలిగిస్తుంది.

పదార్థం నుండి మొదలై, ప్రాణిగా, మనస్సుగా ఎదుగుతూ, ఇది యొక ఊర్ధ్వముఖ గతియని నిరూపితమయింది. మనస్సు ఊరికే ఉండలేదు. అది ఈ ఊర్ధ్వగతిని కొనసాగించి తనను తానే అధిగమించే దిశగా సాగుతుంది. కాని ప్రగతి యేమంత సులభం కాదు. ఎందుకంటే మానవుని కోరికలు అసమర్థత వలన పరిమితమైనవి. వాని ఆకాంక్షలెంత మహత్వపూర్ణమైనప్పటికిన్నీ, ఆతడు సాధించినది అత్యల్పం మాత్రమే. ఏదో కొంత క్రమవృద్ధి ఉన్నప్పటికిన్నీ, మనోగతులు చాల వరకు కష్టాలలోకి, సంక్షోభాలలోకి దారితీస్తాయి. కనుక మానవుడిప్పుడు మరింతగా దుఃఖభాజనుడుగా కనిపిస్తాడు! అదే సమయంలో అతడు మనస్సునొక అనంతశక్తిగా భావించి ముందుకు దూసుకుపోవటానికి తగినంత బలం తనకున్నదనుకుంటాడు. భూమ్మీద జరిగే దివ్యనాటక స్వభావం ఇది :

The Animal's thoughtless joy is left behind,
Care and reflection burden his daily walk.
He has risen to greatness and to discontent,
He is awake to the invisible.
Insatiate seeker, he has all to learn :
He has exhausted now life's surface acts,
His being's, hidden realms remain to explore.
He becomes a mind, he becomes a spirit and self;
In his fragile tenement he grows Nature's lord.
In him Matter wakes from its long obscure trance,
In him earth feels the Godhead drawing near.

**ఆలోచనారహిత జంతుహర్షంబును వెన్క విడిచి,**
**చింతావిమర్శల భారము ననునిత్యగతుల వహించె;**

**ఆతడౌన్నత్యము నసంతృప్తిదిశ ఊర్ధ్వగతుడయ్యె,**
**అదృశ్యశక్తి దిశగా నతడు జాగృతివహించె.**
**అసంతుష్టాన్వేషకుడాతడు సర్వంబు నేర్వవలసె :**
**ఆతడిప్పుడు జీవోపరితలచేష్టల పారంబు జేరె,**
**తన సత్తదౌ రహః రాజ్యాల నన్వేషింపవలెనింక.**
**తానె మనసాయె, చేతనయాయె, ఆత్మయునయ్యె;**
**తన దుర్బలాయతనమందు ప్రకృతికి ప్రభువాయె.**
**మేల్కాంచె పదార్థము సుదీర్ఘాజ్ఞాతసమాధినుండి**
**వానిలో పుడమి భగవానుని ఆగమనసంజ్ఞనొందె.**

శ్రీ అరవిందుల అశ్వపతి ఇప్పుడీ దివ్యనాటకాన్ని పరిశీలిస్తాడు. ఇది నిజానికి "పంకకుటి" (cabin of mud) నుండి ప్రారంభమైనట్లు తోస్తుంది. అక్కడే జీవం ఒక విధమైన జగన్నిద్రలో ఉన్నది. ఈ ప్రారంభం, వికారమూ పంకిలమూ అయినప్పటికిన్నీ, తనవైన సుందరాకృతులు దాని కున్నవి. ఎందుకంటే, "ప్రపంచపు అచేతన సౌందర్యం భగవంతుని ఆనందానికి అద్దం పడుతుంది" కూడ. (the world's senseless beauty mirrors God's delight). జీవకణాలలో, అతి సూక్ష్మప్రాణులలో, కీటకాలలో సరీసృపాలలో, క్రిములలో కనిపించే జీవాన్ని అర్థరహితమని నిరాకరించలేము. ఇక్కడ కూడా ఆ పరముడున్నాడు.

ఈ అల్పప్రాణి రాజ్యం నుండి అశ్వపతి మరియొక అల్పప్రాణిరాజ్యానికి పరిక్రమిస్తాడు. అక్కడ నిరంతరము చైతన్యం ఉంటుంది. ఇదే మనస్సును శంకాకులం చేసే "జాంతవ పరిశోధన" (animal experiment). ఇక్కడ భూతత్త్వవిషయిక కాలానికి చెందిన యుగాలున్ను (ages), రాకాసి బల్లులు, mastodons తాలూకు మయాజాలమున్నూ అన్నీ ఉన్నాయి :

*Huge armoured strengths shock a frail quaking ground,*
*Great puissant creatures with a dwarfish brain,*
*And pigmy tribes imposed their small life-drift.*
*In a dwarf model of humanity*
*Nature now launched the extreme experience*
*And master-point of her design's caprice,*
*Luminious result of her half-conscious climb*
*On rungs twixt her sublimities and grotesques*
*To massive from infinitesimal shapes,*

*To a subtle balancing of body and soul,*
*To an order of intelligent littleness.*

**తనుమేధాల్పిత మహాశూరసత్వంబులు, బృహత్తనుత్రాణరక్షితముల్**
**కంపమానదుర్బల ధరిత్రిన్ కంపింపజేసె,**
**వామనజాతులల్పిష్ఠజీవనగతులన్ విన్యస్తమొనరించె.**
**ఒక వామన మానుషాకృతిలో పరమానుభవమునావిష్కరించె ప్రకృతి,**
**అదియు నిజసంకల్పచాపల్యవైదగ్ధ్యము,**
**తన ప్రౌఢిమల, విరూపతల మధ్య సోపానములపై**
**అతిసూక్ష్మరూపాలనుండి భౌమాకారముల నొంద,**
**దేహాత్మల సూక్ష్మ సమతౌల్యసాధనకై,**
**ఒక ప్రజ్ఞాన్వితాల్పత్వక్రమవిన్యాసము వంకకు**
**తన అసమగ్రప్రజ్ఞారోహణకాంతిమత్ఫలము.**

ప్రకృతి పరిణామోద్యమంలో ఆ విధంగా ఎదిగిన మానవుడు తన మేధస్సు సహాయంతో కుటుంబస్థాపన నెట్లాగో సాధించినాడు, కాని వాని ప్రాథమిక సహజావబోధాలు వానిలో చాల బలంగా ఉన్నాయి. ఆతడు శీఘ్రకోపి, తన వ్యక్తిగత సంకల్పానుసారం శాసించాలని కోరుకుంటాడు, కనుక హత్యలతో, మానభంగాలతో, కొల్లగొట్టటంతో, విధ్వంసంతోను తనను తానే ఛిన్నాభిన్నం చేసుకుంటాడు. ఇట్లాంటిదే మన “వీరగాథా కాలం” (heroic age).

ఇంకా ముందకు సాగితే “మేధావి మానవుడు” కనిపిస్తాడు. వానికి ప్రకృతి నుండి ప్రేరణ, ఊర్ధ్వప్రకృతినుండి సహకారము లభించినవి. మానవుడిప్పటికీ స్వార్థపరుడు గానే ఉన్నాడు కాని వాని కోరికలిప్పుడు అంతరిక్షాన్ని తాకుతున్నాయి. తాను మరణించవలెనా? చంపబడవలెనా? తాను మృత్యువు నధిగమించగలడా? తాను మృత్యువు నతిక్రమించి శాశ్వతంగా జీవించగలడా?

*A finite movement of the Infinite*
*Came winging its way through a wide air of Time;*
*A march of knowledge moved in Nescience*
*Its right to be immortal it reserved,*
*But built a wall against the siege of death*
*And threw a hook to clutch eternity.*
*A thinking entity appeared in Space.*
*A little ordered world broke into view*

*Where being had prison-room for act and sight,*
*A floor to walk, a clear but scanty range.*

**అనంతముయొక్క ఒక పరిమితోద్యమము**
**విశాల కాలాంబరమున ఱెక్కలల్లార్చి వచ్చినది;**
**అజ్ఞానగర్భాన నొక జ్ఞానప్రస్థానం కదిలింది,**
**అమరత్వంపై తన అధికారాన్ని స్పష్టీకరించింది**
**కాని మృత్యుదురాక్రమణనెదిర్చి ఒక భిత్తిని నిర్మించి**
**శాశ్వతత్వగ్రహణానికై ఒక గ్రహణిని విసిరింది.**
**అంతరిక్షంలో ఒక చింతనాశీలసత్వముదయించింది.**
**జీవచేష్టకు, దృష్టికి కారాగృహమున్నచోట**
**నడయాడ నొక భూమి, ఒక స్పష్టస్వల్పపథము**
**ఒక కొంత క్రమబద్ధమైన ప్రపంచం పొడసూపింది.**

కాని ప్రగతి సుసాధ్యం కాదు. ఏదో, ఎక్కడో మానవుని ఇహలోక జీవితానికి నిశ్చయాంతంగా ఉన్నదాని నతిక్రమించటంలో విజయవంతుడు కాకుండా అడ్డు పడుతూన్నది. ఈ లక్ష్యాన్ని చేరుకోకుండా మానవుని అసహనం ఆపుతున్నది. ఆతడు తన "అత్యల్ప లాలసలు, క్షణికకామనలు" అన్నిటికన్న మిన్నయని భావిస్తాడు. మనస్సు ఆ మార్గాన్నే అనుసరిస్తుంది, ఇక "పునరపి జననం, పునరపి మరణం" చక్రభ్రమణంగా నిరాటంకంగా సాగిపోతుంది. మానవుడు మాత్రం తన విధిని తాను నిర్వహిస్తూన్నాననే అనుకుంటూ ఉంటాడు :

*Absorbed in the little works of its prison-house*
*It turned around the same unchanging points*
*But thought itself the master of its jail.*

**తన కారాగృహంలోని అల్పకార్యాలలో మునిగి**
**మారని ఆ ధృవాలను చుట్టిచుట్టి తిరుగుతుంది**
**కాని అది తన కారాగృహానికి తానే ప్రభువుననుకున్నది.**

ఈ అల్పప్రాణిరాజ్యం ద్వారా అశ్వపతి నేర్చికొన్న గొప్పపాఠం ఇది. మానవుని నాగరికత ఉన్నతోన్నత శిఖరాలను మనస్సు సహాయంతో చేరుకొని ఉండవచ్చు. కాని కేంద్రీయ సమస్య అలాగే ఉండిపోయింది. మానవునకు తానెక్కడ నుండి వచ్చినవాడో, ఎక్కడికి చేరవలసినవాడో తెలియదు.

*A little light in a great darkness born,*
*Life knew not where it went nor whence it came.*
*Around all floated still the nescient haze.*

**ఒక మహాంధకారంలో పుట్టిన ఒక చిన్ని దివ్వె,**
**జీవానికి తానెటు సాగెనో, ఎటనుండి వచ్చెనో తెలియదు.**
**సర్వమును చుట్టి ఇంకను అజ్ఞానధూమిక తేలియాడె.**

* * *

## 5వ సర్గ - అల్పప్రాణి దేవతలు

అల్పప్రాణి సామ్రాజ్యంలోని వివిధ రాజ్యాలను చూచినమీదట అశ్వపతి, అవన్నీ మనస్సు చేత సాధింపబడిన సృజనాత్మకతలో ప్రగతిని సాధించినట్లే కనిపించినప్పటికిన్నీ, ఆ మనస్సు మానవునింకెంత ఉన్నతతరసాధ్యాలకు తీసికొని పోగలదో వారికింకను తెలియదని గ్రహిస్తాడు. జీవాన్ని గురించి, దాని పరిణామాన్ని గురించి ఇంతమాత్రమేనా? కనుక ఆ ఆకృతుల వంక నిశితంగా దృష్టిని సారించి, పూర్తిగా ఊహకందని విషయాన్ని గ్రహిస్తాడతడు :

*He plunged his gaze into the siege of mist*
*That held his ill-lit straitened continent*
*Ringed with the skies and seas of ignorance*
*And keep it safe from Truth and Self and Light.*
*And dwellings and trees and figures of men appear*
*As if revealed to an eye in Nothingness,*
*All lurking things were torn out of their veils*
*And held up in his vision's sun-white blaze.*

**అజ్ఞానగగనసాగరమేఖలావలితమై**
**అద్దాని సత్యాత్మప్రకాశముల నుండి కాపాడుచు**
**ఆ కుదీపితకుచ్ఛితవర్షతుషారపరివేష్టనములోనికి**
**తన దృష్టి నాతడు చొరబారజేసినాడు.**
**అంత శూన్యమున నొక నేత్రమునకు సాకారమైన యట్లు**
**గృహవృక్షప్రతిమామానవరూపాలు గన్పట్ట**
**సమస్త ప్రచ్ఛన్నవాసివస్తువుల్ అవగుంఠనములు వీడి**
**వాని సూర్యశుద్ధప్రకాశదృగంతరాన నిలిచె.**

ఈ "ప్రచ్ఛన్నవాసి వస్తువులు" (lurking things) అల్పప్రాణులను బృహత్తర జీవితం లోనికి వృద్ధి చెందేట్లు ప్రణోదనం చేసే శక్తులు, పతనం చెందిన దేవతలు. వారు ప్రపంచాన్ని తమ ఆధిపత్యం క్రిందకు తెచ్చి దానిని ఎండించేవారు, 'క్షుద్రదేవతలు' అని దేశగాధలలో ప్రసిద్ధులైనవారు. వారితో నెయ్యం మొదట లాభదాయకంగా కనిపించవచ్చు కాని చివరికది ప్రాణాంతక మవుతుంది.

*Astonished by the unaccustomed glow,*
*As if immanent in the shadows started up*
*Imps with wry limbs and carved beast visages,*
*Sprite-prompters goblin-wizened or faery-small,*
*And genii fairer but unsouled and poor*
*And fallen beings, their heavenly portion lost,*
*And errant divinities trapped in Time's dust.*
*Ignorant and dangerous wills but armed with power,*
*Half-animal, half-god their mood, their shape.*

**అనభ్యస్తకాంతిచే విస్మయాకులితులై ఉదుటున లేచిరి**
**ఛాయాంతర్భవులట్లు వికృతావయవ పిశాచముల్**
**కృతజంతుముఖుల్, విద్యాధరవామనుల్ మ్లాన నిశాచరప్రవర్తకుల్,**
**సుందరభూతముల్ దయనీయు లాత్మరహితుల్**
**నష్టనిజదివ్యతాపతితసత్వముల్ సందేశవహుల్ దేవతల్**
**కాలధూళిజాలపతితులందఱు**
**అర్ధపశు, అర్ధదేవతామనః స్థితులాకృతుల్**
**అజ్ఞానభయంకరచిత్తుల్ శక్తిమంతుల్.**

వీరు అన్నిటిని భ్రష్టము జేయువారని అశ్వపతి గ్రహించెను. కాని అరవిందుని భావదృష్టి దేనిని గాని పూర్తిగా నిరాకరించదు. ఈ భ్రష్ట శక్తులలో అంతర్గతముగ అంతిమ విజయాన్ని తెచ్చిపెట్టగలదేదో నిగూఢముగ ఉండియుండవలె. జీవము తన దైహికవిషయములన్నిటిని కుమ్మరించిన తరువాత, దానినుండి ఒక అమరాకారము బయల్పడుట తథ్యము.

అశ్వపతి మానవజాతికి ప్రతినిధి. ఈ సృష్టిలోని పరస్పరవైరుద్ధ్యాన్ని చూచి ఆశ్చర్యం చెందుతాడు. ఇదంతా ఆ పరముడు ఈ అస్తవ్యస్తతలోనికి ఆత్మప్రణోదనం ద్వారా అవతరించాలని అభిలషించిన దాని ఫలము. ఈ సృష్టి ఎట్లా జరిగింది? మొదట ఆకాశమున్నది. అది శక్తికి తావిచ్చింది.

*An ocean of electric Energy*
*Formlessly formed its strange wave-particles*
*Constructing by their dance this solid scheme,*
*Its mightiness in the atom shut to rest;*
*Masses were forged or feigned and visible shapes;*
*Light flung the photon's swift revealing spark*
*And showed, in the minuteness of its flash*
*Imaged, this cosmos of apparent things.*
*Thus has been made this real impossible world,*
*An obvious miracle or convincing show.*

**ఒక విద్యుచ్ఛక్తిసాగరము**
**తన విచిత్ర తరంగకణముల నరూపముగ రూపించెను;**
**దాని శక్తి అణువులో నిక్షిప్తమై శాంతినొందగ,**
**వాని నృత్యముతో ఈ సారవత్ప్రబంధమును నిర్మించెను;**
**పిండంబులు దృగ్గోచరాకృతుల్ ఘటితమైనవి, కల్పితమైనవి;**
**కాంతి ఫోటాను వేగవద్దర్శకవిస్ఫులింగమున్ విసరి**
**తత్తటిత్తనుతయం దీ దృశ్యమానవస్తుజగద్రూపము జూపెను.**
**ఇయ్యసంభవ వాస్తవిక ప్రపంచ మీరీతి సృజింపబడియె,**
**ఇది యొక విస్పష్టాద్భుతము, సంశయచ్ఛేదక ప్రదర్శన.**

ప్రకృతి నియతసూత్రాలు పదార్థాన్నీ శక్తినీ అధీనంలోనికి తీసికొని ఒక క్రమబద్ధమైన పదార్థప్రపంచానికి బాటపరిచినవి, అంతట ప్రాణి దానిలో ఉదయించింది. కాని అదే జీవం తాలూకు చివరి మాట కాదు. జీవం ఒక పరిణామ క్రమం, అది ఒక అచలదైవత్వం కాదు. అందుచేతనే అది ఊర్ధ్వముఖంగా కదులుతుంది, మానవుడు తన ఆలోచనా పద్ధతుల ననుసరించి ప్రవర్తించనారంభించినాడు. మనస్సు స్థాయికి ఎదిగిన వాడైనప్పుడు, ఆతడు మృత్యువు నతిక్రమించటానికి, మరింత ఉన్నతమైన చేతనలోని కెదగటానికీ వీలుగా మరిన్ని శక్తులను సమీకరించికొనేందుకు మనస్సున కావలివైపు దృష్టిని సారించటంలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఈ పరిణామం అంతటిలోనూ, మానవునిలో ఒక సాక్షి ఆత్మ వానికి మార్గదర్శనం చేస్తూ, సహాయం చేస్తూ ఉన్నది.

వేగంగా ఉద్గమించటానికశక్తుడై మానసిక మానవుడు నిత్యజీవన దినచర్యలలో మరింత తీవ్రంగా మునిగిపోయి తన కాలాన్ని ప్రేమ ద్వేషాలలో, సంశయ వినాశాలలో గడుపుతాడు. కాని ఆ సాక్షి ఆత్మ ప్రకటం కాక నీడలలోనే ఉండిపోతుంది. అయినా అది

శరీరపతనంతో మరణించదు. ఎందుకంటే, అది శస్త్రాలచే నశించదు, అగ్నిచే దహింపబడదు, నైవం ఛిందంతి శస్త్రాణి నైవం దహతి పావకః. కాలం గడుస్తూండగా మానవుడు తన అకించిత్కరమైన వినోదక్రీడలతో తృప్తుడై ఉదాత్తంగా ఉన్నతంగా ఆలోచించటానికి గాని సాహసకృత్యాలు చేయటానికి గాని శ్రద్ధాళువుకాడు :

*A brief companionship with many jars,*
*A little love and jealousy and hate,*
*A touch of friendship mid indifferent crowds*
*Draw his heart-plan on life's diminutive map.*
*If something great awakes, too frail his pitch*
*To reveal its Zenith tension of delight,*
*His thought to eternise its ephemeral soar,*
*Art's brilliant gleam is a pastime for his eyes.*

**ఎన్నియో కలహాలతో, స్వల్పప్రేమతో, అసూయాద్వేషాలతో**
**ఒక క్షణిక సాహచర్యం, ఉదాసీన సమూహగతస్నేహస్పర్శ,**
**జీవితాలేఖ్యపత్రంపై వాని హృదయకల్పనల లిఖించు.**
**మహద్విషయ మొందుదయించినట్లయిన,**
**దాని హర్షపరమాతతిని ప్రకటింప,**
**దాని క్షణికోత్తుంగతను శాశ్వతీకరింప,**
**చాలనిది వాని దుర్బల శ్రుతి,**
**చాలనిది వాని చింతన,**
**దీప్తిమత్ కల్పనాలసత్ప్రభ**
**వాని దృష్టిలో నొక వినోదము.**

ఏదియేమైనను, ఇది కేవల మొక తాత్కాలిక ప్రణాళిక మాత్రమే అనిన్నీ, అచిరకాలంలోనే ఆత్మ ఆత్మతో సంభాషించే సుదినం వస్తుందనిన్నీ అశ్వపతి గ్రహిస్తాడు.

*All shall be captured by delight, transformed :*
*In waves of undreamed ecstasy shall roll*
*Our mind and life and sense and laugh in a light*
*Other than this hard limited human day,*
*The body's tissues thrill apotheosised,*
*Its cells sustain bright metamorphosis.*

**సర్వము నొడిసిపట్టు ఆనందము,**
**సర్వమున్ రూపాంతరమొనర్చు :**
**మనస్సు, జీవంబు, ఇంద్రియముల్**
**అనూహ్యానంద వీచికల నాదు,**
**హసించు కఠిన పరిమిత మానుషాహస్సేతర కాంతిలో,**
**పులకించుదేహజాలము దైవీకరింపబడి,**
**ధరించు తజ్జీవాంబువుల్ తత్కాంతిమద్రూప పరిణామమున్.**

ఈ ఊహతో సంతోషం కలుగగా, అశ్వపతి ఆ "తారాస్తవ్యస్తము" (astral chaos) సృజించిన భీకర తుషార మార్గమున కదిలి, వేగంగా ఆ క్షుద్రదేవతా సమూహాలను దాటి ముందుకు సాగిపోతాడు. చుట్టూ అంతా చీకటి, కాని అది వాని గమనాన్ని ఆటంక పరచలేక పోయింది. ఎందుకంటే, వానికి లో వెలుగు స్పష్టంగా త్రోవను కన్పింపజేస్తూన్నది. "వానికి సూర్యమాత్రుడు వాని ఆత్మజ్యోతి" (His only sunlight was his spirit's flame).

❊ ❊ ❊

## 6వ సర్గ - మహత్తరజీవరాజ్యాలు, దేవతలు.

మానసోపరితలప్రదేశాల నుండి దూరంగా ప్రయాణిస్తూ అశ్వపతి ఈ తమోమయప్రదేశాల గుండా దూరానగల ఒక కాంతి దిశగా ముందుకు సాగిపోగలిగినాడు. ఎంతైనా, మానవునిలో ఒక అమృత బీజం ప్రేమ అనబడేది విశిష్టగుణంగా ఉన్నది. ఆ గుణం వాని హృదయానికి భయాన్ని జయించటంలో సాయపడుతుంది. ఎక్కడినుండో సత్యం హృదయంలో ప్రకాశిస్తుంది, దాని వెలుగులో అశ్వపతి ముందుకు కదిలి ఒక ప్రపంచంలో ప్రవేశిస్తాడు. అక్కడ భూతాలు లేక ఆత్మలు ఆశ నిరాశల వలయంలో సుడిబడి తిరుగుతూ కనబడతాయి. మానవుని పరిశ్రమలకు లక్ష్యం, గమ్యం ఇదేనా? కాదు. త్వరలోనే ఆతడు "ఉదయనక్షత్రరాజ్యాన్ని" లేక "వేగుచుక్క రాజ్యాన్ని" (the kingdom of the morning star) చేరుకో గలుగుతాడు.

First came the kingdom of the morning star :
A twilight beauty trembled under its spear
And the throb of promise of a wider life.

**మొదట వచ్చింది వేగుచుక్క రాజ్యం :**
**ఒక సంధ్యా సౌందర్యం దాని శక్తిక్రింద కంపించింది.**
**ఒక విశాలతర జీవప్రతిజ్ఞాస్ఫురణం కలిగింది.**

ఆ ప్రదేశం నిస్సంశయంగా అమరత్వమూ శాశ్వతానందమూ కలిగిన ఆ క్షణాలకు ఆశ్రయమిచ్చింది. అవి ఒక కళాహృదయం గలవాని దర్శనం నుండి స్ఫురించి, శిలలోనో లోహం లోనో లేక వర్ణంలోనో చిక్కి శాశ్వతత్వాన్ని సంతరించుకొన్న క్షణాలను పోలినవే. మానవుని ప్రయత్నాలు, తపస్సు, నిర్విరామ సాధనల ఫలంగా కలిగే ఈ లాభాలు సామాన్య మానవునకు ఒక మహత్తర ఉషస్సును గురించి ఆశ కలిగిస్తుంది :

*This realm inspires us with our vaster hopes;*
*Its forces have made landings on our globe,*
*Its signs have traced their pattern in our lives:*
*It lends a sovereign movement to our fate,*
*Its errant waves motive our life's high surge.*
*All that we seek for is prefigured there*
*And all we have not known nor even sought*
*Which yet one day must be born in human hearts*
*That the Timeless may fulfil itself in things.*

**ఈ రాజ్యం విస్తృతాశలతో మనల్ని ప్రాణితులను చేస్తుంది;**
**దాని బలాలు మన భూమిపైన విడిసియున్నవి,**
**దాని సంకేతాలు మన జీవితాలలో తమ అభిజ్ఞలుంచినవి;**
**అది మన విధికొక రాజప్రవృత్తిని దత్తం చేస్తుంది,**
**దాని వార్తావాహక తరంగాలు మన జీవిప్రవంతికి లక్ష్యాన్నిస్తాయి.**
**మన మన్వేషించేది సమస్తం అట ప్రతిబింబితం,**
**మనమెఱుగని, అన్వేషించనిదెల్ల తథాపి మానవహృదయంలో**
**ఒక నాటికి ఉదయించక తీరదు, కాలాతీతశక్తి**
**వస్తుజాలములో సాఫల్యము గాంచవలెను కనుక.**

ఈ రాజ్యం శూన్యంలో నుండి రాలేదు. మిగత అన్నిటివలెనే, ఇది కూడా పదార్థం నుండి ఉద్భవించినదే. ఇది భూకేంద్రకం గల తుంగతరప్రాణ ప్రపంచం. ఇది సృజనకై ఉత్సుకత కలిగినది. అదిగాక, పరముని నుండి అమరత్వ ఉపక్షేపములు కలుగనిది కూడా కాదు. సారవత్ మనస్సు, ఆలోచన యను వీని కతీతమైన ఆ పరముని ఆవిష్కరణను సాధించే నిమిత్తం, దానికొక లౌకికావాసాన్నీ నామాన్నీ కల్పించే నిమిత్తం ప్రకృతి మార్గాలు కనుగొంటూనే ఉన్నది.

*This is her secret and impossible task*
*To catch the boundless in a net of birth,*
*To cast the spirit into physical form,*
*To lend speech and thought to the Ineffable;*
*She is pushed to reveal the ever Unmanifest.*
*Yet by her skill the impossible has been done :*

**ఆమె రహస్యము, అసాధ్యకర్తవ్యమిదియె**
**అయ్యనంతుని జన్మజాలాన ధరించుటే,**
**ఆత్మనొక భౌతిక రూపాన నిక్షేపించుటే,**
**అయ్యనిర్వాచ్యునికి భాషభావాల నర్పించుటే;**
**ఆ నిరాకారుని ప్రదర్శించుట కామె ప్రేరితురాలైనది.**
**ఐనను ఆమె చాతుర్యమున అసాధ్యము సాధింపబడినది :**

అదే సమయంలో, శాసనసభా భవనం దిశ నుండి కార్లను మళ్ళించటం వంటిది కాదు ప్రకృతి పని. ఆమె సృష్టిలో ఒక స్తబ్ధపూర్ణత్వం ఎందులోనూ లేదు. ఆ కారణంగా, మనం సాధారణంగా అంటూ ఉండే "వ్యర్థత" చాలానే ఉన్నది. కోట్ల కొలది నిష్ఫలతలున్నప్పటికిన్నీ, ప్రకృతి మాత జీవాన్ని ఉద్ధరించి సమగ్రం చేసే కర్తవ్యాన్ని నిర్వహిస్తూనే ఉంటుంది, దాన్ని పరిణామసోపానం మీద అపరిహార్యంగా పైపైకి చేదుకుంటూనే ఉంటుంది.

ఆ దృశ్యాన్ని చూస్తూనే, అశ్వపతి ఆకులుడైనాడు. ఈ ప్రకృతి నిర్విరామకృషి యథార్థంగా అర్థరహితం కాదని అతనికి స్పష్టమయింది. తేటతెల్లంగా, ఆమె ఏదేనొక పరిపూర్ణతను భూమిమీదకు తీసికొని రావాలని పురిటినొప్పులు పడుతూన్నదని తెలుస్తూన్నది, కనీసం పరిణామంలో ఊర్ధ్వదిశగా పై మెట్టు నందుకునే యత్నం అది. ప్రకృతి రీతులు అంత సులభంగా అర్థమయ్యేవి కావు. తఱచుగా ముందు వచ్చేది చీకటే. అసురుడు నాయకుడవుతాడు, పరిణామక్రమాన్ని అధోగతికి లాగాలని ప్రయత్నిస్తాడు. అయినాగాని ప్రకృతి పరాజయాన్ని అంగీకరించదు. క్రిందపడి, మళ్ళీ పైకి లేచే ప్రయత్నం, ముందుకు సూర్యోదయోన్ముఖంగా నడిచే ప్రయత్నం చేస్తుంది.

*A strange enthusiasm has moved its heart;*
*It hungers for heights, it passions for the supreme.*
*It hunts for the perfect word, the perfect shape,*
*It leaps to the summit thought, the summit light.*
*For by the form the formless is brought close*
*And all perfection fringes the Absolute.*

**ఒక విచిత్రోత్సాహం దాని హృదయాన్ని కదిలించింది;**
**శిఖరాలకై దాని బుభుక్ష, పరమమునకై దాని సంరంభము.**
**పూర్ణపదమునకై, పూర్ణరూపమునకై అనుధావనం,**
**శిఖరాగ్రవిమర్శకై, శిఖరాగ్రకాంతికై దాని లంఘనం.**
**ఏలన ఆకారముచేత నిరాకారము చేరువ చేయబడినది,**
**పూర్ణత్వమంతయు కైవల్యాంచలము స్పృశించినది.**

మనం మన స్మృతికవాటములు త్రోసి ఆది కాలంలోకి చూస్తే చాలు. మనిషి ద్విపాది కావటానికెంత కాలం పట్టింది? మోకాళ్ళపై నిలిచి తన చేతులను పనిచేయటానికి ఉపయోగించటం మొదలైన క్షణం చాల కాలం క్రిందట జరిగి ఉంటుంది. ఆ తరువాత ఇప్పుడు ఆతడున్న స్థితికి పరిణామం చెందటానికి, కేవలమొక పశువు కాక, ఆలోచించి విధాన నిర్ణయం చేసి మహాద్భుత కార్యాలను నిర్వహించగల మేధావిగా ఎదగటానికి కోట్ల సంవత్సరాలు పట్టి ఉంటుంది. రోమ్ నగరం యథార్థంగా ఒక్క రోజులో నిర్మింపబడలేదు!

*Housed in the atom, buried in the clod.*
*Her quick creative passion cannot cease.*

**అణువు గృహంగా, మృత్పిండమున నిక్షేపించబడి,**
**ఆమెలోని వేగవత్ సృజనప్రకోపము విరమించనేరదు.**

అప్పుడప్పుడామె మూర్ఛావశయైనట్లు కనిపించవచ్చు, ఒకప్పుడు తమఃపరిష్వంగములో చిక్కి యుండవచ్చు. కాని ఈ క్షణములు గూడ సృజనాత్మకమైనవే, ఇవి యామె నిద్రావస్థలోనున్న వేళలు. "ఆమె మహద్విరామము అంతశ్చేతనయే" (*Inconscience is her gigantic pause.*)

ప్రకృతి కార్యముల వలన ఒక విషయము స్పష్టము. అపజయము, అంధకారము వచ్చిన రానిమ్ము, ఆమె అపజయము నంగీకరించదు. ఎందుకంటే దివ్యలోకములను భువిపైకి అవతరింపజేసి లౌకిక జీవనమును దివ్యజీవనముగా రూపాంతరీకరించుటే ఆమె సాధన.

*Nourished by hardship and calamity*
*And with pain for her body's handmaid, masseuse, nurse,*
*Her tortured invisible spirit continues still*
*To toil though in darkness, to create though with pangs;*
*She carries crucified God upon her breast.*

**క్లేశవిపత్తులచే పోషింపబడి**
**బాధయె శరీరమునకు చేటిగా, అంగసంవాహికగా, అంకపాలిగా,**
**ఆమె పీడితాదృశ్యాత్మ అట్లయ్యు కొనసాగు**
**అంధకారమున శ్రమించియైన, వేదనతోనైన సృజింప;**
**శిలువవేయబడిన దేవుని తన తొమ్ముపై వహించునామె.**

అందుచేతనే దేవీమహాత్మ్యం మహాసరస్వతీప్రార్థనలో ఆమె విశ్వమంతటా మేధగా, శక్తిగా, శాంతిగా, విశ్వాసముగా, సౌందర్యముగా మాత్రమే కాక నిద్రగా, ఆకలిగా, నీడగా, దప్పిగా, తప్పుగా కూడా నిండియున్నట్లు చెప్పబడింది. సృష్టిలోని ఆ శ్రేష్ఠతర ప్రాణి ప్రపంచాన్ని అధివసించే మహత్తరజీవుల దేవతలను చూచి అశ్వపతి “ఆమె సూత్రముల శోధితక్లిష్టప్రమేయోపపాద్యము” (*screened difficult theorem of her clues.*) నకు సూచన కోసం అన్వేషిస్తాడు. సృష్టి సమస్తంలో జరుగుతూన్నదానికి సాక్షీభూతుడై అశ్వపతి నిలిచినప్పుడు శ్రీ అరవిందుల కవిత రెక్కలు సారించి ఎగురుతుంది. ఈ సర్గ పూర్తయ్యేప్పటికి, ఒక సాహసకార్యానికి అపజయమన్నది మొదటే నిశ్చితమనట్లు కన్పించినప్పటికిన్నీ, ప్రకృతి క్రియాశీలం కావటం ఆగిపోదని స్పష్టమవుతుంది. దానితోబాటు మనముందొక పెద్ద ప్రశ్న నిలుస్తుంది. వరప్రసాదమైన ఆ భవిష్యత్తును ఈ నిర్విరామకృషి ఎప్పుడు సాకారం చేస్తుంది? ప్రస్తుతానికి, అశ్వపతి గ్రహించినట్లు ఒక నిరాశాభావం ఉన్నది :

*Life has no Issue, death brings no release.*

**జీవం నిష్ప్రయోజనం, మరణం కాదు మోక్షం.**

❊ ❊ ❊

## 7వ సర్గ - చీకటిలోని కవరోహణం

దాని ప్రయత్నాలు విఫలం కావటం నిశ్చయాంతం కనుక జీవాన్ని గురించిన చర్చకు విలువలేదనీ, జాతస్య మరణం ధృవం అనీ అంగీకరించినప్పటికిన్నీ, అశ్వపతిలోని యోగి ఇదంతా శాశ్వతసత్యమని అంగీకరించటానికి సిద్ధంగా లేడు. మానవుని క్లేశాలకు పరిష్కారం కనుగొనటంలో సహాయంగా యోగాన్ని స్వీకరించిన వ్యక్తిగా అతడిప్పుడు భయంకరమైన పెంజీకటిలోనికి ప్రవేశించి దానిని అంత నిరనురోధంగా నిర్మించేదేమిటో తెలిసికోవటానికి ముందుకు సాగినాడు. ఇదియొక ప్రాణాంతక సాహసం. కాని శ్రీ అరవిందులు, ఒక అవతారపురుషుడు లేక స్త్రీ, అందరు మానవుల వలెనే జీవితంలోని

బాధలను మరణాన్ని అనుభవించటం విధి, అని అంటారు :

*He who would bring the heavens here*
*Must descend himself into clay*
*And the burden of earthly nature bear*
*And tread the dolorous way.*
*Coercing my godhead I have come down*
*Here on the sordid earth,*
*Ignorant, labouring, human grown*
*Twixt the gates of death and birth.*

**దివిని భువిపైకి దించాలని కోరేవాడు**
**స్వయంగా తాను పంకంలోనికి దిగవలె,**
**ధరాప్రకృతి భారాన్ని స్వయంగా వహించవలె,**
**ఆ శోకాకులితమార్గాన సాగవలె.**
**నా దైవత్వాన్ని నిగ్రహించి నేనవతరించాను**
**ఇక్కడ ఈ మలీమసభూమిపైకి**
**అజ్ఞానినై, శ్రమిస్తూ, మానవుడనై**
**మరణజననద్వారాల మధ్య.**

భూమ్మీది జీవితాన్ని రూపాంతరం చెందించాలని ప్రయత్నించినవారిలో అగ్రగామియైన అశ్వపతి ఇప్పుడు ధైర్యంగా పెంజీకటిని ప్రవేశిస్తాడు. వాని లక్ష్యం, మరణంగా, అజ్ఞానంగా, అవిద్యగా మానవజాతిని పీడిస్తూన్న అరిష్టానికి కారణమేమో తెలిసికొనటం. ఈ ప్రపంచంలో తాను భూమ్మీద ఎఱిగిన శక్తి, ఉనికి, వెలుగు, ప్రేమ వంటివన్నీ విపర్యాస్తంగా ఉన్నాయి. సృష్టియొక్క ప్రయోగాలన్నిటినీ బుద్ధిపూర్వకంగా అపవిత్రం చేసే ఆ అరిష్టాన్ని ముఖాముఖి కలుసుకుంటాడు :

*A hostile and perverting Mind at work*
*In every corner ensconced of conscious life*
*Corrupted Truth with her own formulas;*
*Interceptor of the listening ofthe soul,*
*Afflicting knowledge with the hue of doubt*
*It captured the oracles of the occult gods*
*Effected the signposts of Life's pilgrimage,*
*Cancelled the firm rock-edicts graved by Time,*
*And on the foundations of the cosmic Law*
*Erected its bronze pylons of misrule.*

**ప్రతికూల విపర్యాసకారి మనస్సొకటి క్రియాశీలియై**
**కోణములన్నిట సతర్కజీవమునుండి దాచబడి**
**స్వీయసూత్రాలతో సత్యమున్ భ్రష్టంబు జేసె;**
**ఆత్మశ్రవణంబునకు భంగకారియై,**
**విజ్ఞానమున్ సంశయచ్ఛవితోడ ఆర్తమొనరించుచు,**
**అది క్షుద్రశక్తుల భవిష్యవాణిని గ్రహించి**
**జీవతీర్థాటనధ్వజస్తంభముల నున్మూలమొనరించె,**
**కాలశిల్పిత స్థిరశిలాశాసనముల నిరస్తమొనరించె,**
**విశ్వధర్మప్రతిష్ఠాపనమూలములపై**
**తన దుర్నీతికాంస్యముఖద్వారముల నిల్పె.**

"పురాతనాజ్ఞానపట్టణముల" (Cities of ancient Ignorance) తో నిండిన ఈ లోకంలో ఎక్కడగాని శాంతి లేదు, భయమే శాసకుడు. ఆత్మవంచన ఒక జీవన విధానమయింది. ఈ నియంతల బారినుండి యేదిగాని క్షేమంగా మనలేదు. మతధర్మపు బాహ్యరూపం అంతటా ఉంది కాని ఆ ఆచారాలలో నిష్కాపట్యం లేదు, ఆత్మవిచారానికి పోషకమైన స్థితిగతులు లేవు. దురదృష్టవంతులైన ప్రజలపైన బలాత్కారము భ్రష్టత అన్నవి ఏదోవిధంగా ఒక ఐకమత్యాన్ని ఆరోపిస్తాయి. లక్షలకొలది తప్పుడు పనులతో, అతిక్రమణలతో, అసమానతలతో, దుష్ప్రవర్తనలతో మార్గాలు చిక్కణములైనవి. వాని అన్నిటిగుండా అశ్వపతి అతిజాగ్రత్తగా కదులుతాడు. ఎందుకంటే, ఈ నరకపట్టణాలను దాటి సాగితేనే అతడు స్వర్గాన్ని చేరగలడు మరి. వానికి క్షేమంకరములైనవి ప్రార్థన, నామస్మరణ మాత్రమే :

*A lie was there the truth and truth a lie.*
*Here must the traveller of the upward Way -*
*For daring Hell's, kingdoms winds the heavenly route -*
*Pause or pass slowly through that perilous space,*
*A prayer upon his lips and the great Name.*

**అచట అసత్యము సత్యమగు, సత్యమసత్యమౌ,**
**ఇచట ఊర్ధ్వమార్గయాత్రికుండు –**
**నరకరాజ్యాల దర్శించి స్వర్గపథము సాగుగాన –**
**ఆ ప్రాణాంతక ప్రదేశమున నాగి మెల్లగా సాగవలయు,**
**అధరాలపై ప్రార్థనల్ మహితనామంబు నటింప.**

దివ్యనామజపప్రభావం ఎంత గొప్పదంటే, ఆ నిర్మానుష్యాంధకారభూమిని, ఆ నిర్లజ్జా దుష్టలాలసత్వభూమిగుండా సాగినప్పుడు సైతం అశ్వపతి క్షేమంగా ఉండగలిగినాడు. నైట్ క్లబ్‌లు (Night clubs) అనబడేవి ఆ దుష్కర్మకుహరాల మనోమయ వర్ణన అయియుండవచ్చు. మన ఇండ్లను మనం టెలివిజన్ సెట్లు ప్రసారం చేసే హింసా భయానకతతో నింపుకొనటానికి చాల కాలం ముందే శ్రీ అరవిందులు ఈ అప్రియ ప్రపంచాన్ని తమ దృష్టత్వదర్శనంతో లిఖించినారు :

*In booths of sin and night-repairs of vice*
*Styled infamies of the body's concupiscence*
*And sordid imaginations etched in flesh,*
*Turned lust into a decorative art :*
*Abusing Nature's gift her pervert skill*
*Immortalised the sown grain of living death,*
*In a mud goblet poured the baechic wine,*
*To a satyr gave the thyrsus of a god.*
*Impure, sadistic, with grimacing mouths,*
*Grey, foul inventions gruesome and macabre*
*Came televisioned from the gulfs of Night.*

**పాపపు పాకలలో, అధర్మపు రాత్ర్యారామాలలో**
**శారీరకవ్యభిచారపు సభ్యతానామక దుష్కృతియు**
**మాంస లిఖితమలీమసభావనలు**
**లాలసనొక అలంకారకళగా రూపించెను :**
**ప్రకృత్యుపాయనము దురపయోగముగా**
**ఆవాపిత సజీవమృత్యుబీజము నమరించెను,**
**మృత్పాత్రలో దైవీద్రాక్షాసవమును నింపెను,**
**ఇంద్రియలాలసునకు భాగ్యసౌభాగ్య దేవతాదండమిచ్చె.**
**అపరిశుద్ధ హింసానంది వికృతవదన-**
**లాపాండురపంకిలభీషణ మారకకల్పనలు**
**నిశాఖాతములనుండి దృశ్యమాన ప్రసారములై వచ్చె.**

అట్టి ప్రజలలో మానుషమైనదేమీ లేదు. వారు అనుకంప, విశ్వాసము, ప్రేమ అనువాని ఆవశ్యకత గూర్చి మహోపన్యాసం చేస్తారు. కాని వారి చేష్టలు అమానుషాలు. ఈ రాకాసిమానవుడు గతిశీలాహంకారముతో నిండి సమస్తాన్నీ తనకోసం, తన కుటుంబం

కోసం దోచేస్తే, ఆతనిని వీరుడనీ, దేవుడనీ కొనియాడుతుంది లోకం. ఇక నాతడూ ఆతని అనుచరులూ సర్వవిధాలా నిర్దయగా ప్రజలను తమ శాసనం క్రిందకు తెచ్చుకొంటారు. శ్రీ అరవిందులు, ఈ సర్గాంతంలో వర్ణనలు చూస్తే, ఈనాటి భారతదేశపు రాజకీయ నేపథ్యాన్ని గురించి వ్రాస్తున్నట్లు తోస్తుంది :

A bull-throat bellowed with its brazen tongue
Its hard and shameless clamour filling space
And threatening all who dared to listen to truth
Claimed the monopoly of the battered ear;
A deafened acquiescence gave its vote...

**వృషభగాత్రమొకటి కఠోరభాషణల అంకెవేసె;**
**ఆ కర్కశ నిర్లజ్జావాచాలత సర్వత్ర నావరించె**
**సత్యమును విన సాహసించువారి భయపెట్టి**
**వికల శ్రోతలపై గుత్తాధిపత్యము వహించె;**
**బధిరితామోదంబు మతదానముద్రవేసె...**

❊ ❊ ❊

## 8వ సర్గ – అనృతప్రపంచము, అహితమాత, అంధకార పుత్రులు.

ఇప్పుడశ్వపతి "నగ్ననరకం" చేరుకొన్నాడు. అక్కడాతడు చూచినది వానిని అనంతముగ భయభీతుని చేయగలదు. ఎందుకంటే, అహితమిక్కడ తిష్ఠవేసి నిర్లజ్జగా దేవదూషణాపూర్ణమైన ఆలోచనలను, వాక్కులను, చేష్టలను, ఇంతవరకు మానవుడూహించని వానిని ప్రకటిస్తూ ఉంది. ఈ ప్రపంచపు నాగరికులను శ్రీ అరవిందులు వర్ణించిన తీరు భయంకరం కాని మానవుని అహంకారం గూర్చి ఇది కాదనలేని సత్యం. అహంకారి మనస్సు చెయ్యలేనిదంటూ యేమున్నది?

The Anarchs of the formless depths arose,
Great Titan beings and demoniac powers,
World-egos racked with lust and thought and will,
Vast minds and lives without a spirit within :
Impatient architects of error's house,
Leaders of the cosmic ignorance and unrest
And sponsors of sorrow and mortality
Embodied the dark Ideas of the Abyss.

**అయ్యరూపాఖాతముల అరాచకతాస్రష్టలుత్తిష్ఠలైరి,**
**బృహచ్ఛరీరమహద్దానవపైశాచక బలాలు,**
**లోకాహంకారులు, లాలసాలోచనాసంకల్పపీడితుల్,**
**విస్తారమేధాజీవులు, అంతరాత్మరహితులు :**
**మోహగృహాసహిష్ణువాస్తుశిల్పులు,**
**విశ్వాజ్ఞానాశాంతి నాయకులు,**
**దుఃఖమర్త్యత్వధర్మప్రతిభువుల్,**
**అతల స్పర్శాఖాతపు తమోభావాకృతుల్.**

ఇదెట్లా జరిగింది? దేవుడు ప్రపంచాన్ని సృష్టించినట్లయితే, సృష్టి లోనికి అహితాన్నెందుకు అడుగు పెట్టనిచ్చినాడు? ఒక మానవుడు ఇతర మానవులను బాధలకు గురిచేసే విధంగా తెలిసి తెలిసి ప్రవర్తించేట్లు ఎట్లా భ్రష్టబుద్ధి అవుతాడన్న ప్రశ్నకు సమాధానాలు చాలా ఉన్నాయి. అతనిలో ఉన్న అహంకారం కారణంగా మనిషి స్వార్థపరత్వానికి అవధులు లేవు. అట్లాంటి విభేదం అన్నదమ్ముల మధ్యకూడా తఱచు కన్పిస్తుంది. ఒక సోదరుడు ధర్మమార్గాన్ని అనుసరించి మిగత వారి మంచికై పనిచేస్తాడు. మరియొకడు సంపన్నుడు కావటానికి నింద్యమైన పనులు చేస్తూ, భూములను, ధనాన్నీ, స్త్రీలను పెద్దయెత్తున సంపాదించటం ద్వారా తన అహంకారాన్ని పోషిస్తాడు. అంతెందుకు, స్వార్థబుద్ధి అన్నది ఒక సోదరుని హతమార్చటానికి మరొక సోదరుని ప్రోత్సహిస్తుంది. ఒకే తల్లి తండ్రులకు జన్మించినవారిలో అహితమెట్లా దాగి ఉంటుందో చెప్పవలెనంటే, రావణుడు, కెయిన్ (Cain) అన్న ఇద్దరూ ఉదాహరణలు. శ్రీ అరవిందులు అహితం భూమిపైన ఎట్లా జన్మించినదో చెప్పటాని కొక కథను ఉపయోగించారు.

మొదట అంతా అచేతన పదార్థము, కాలము ఉన్నవి. ఆ పదార్థానికి ఆత్మలేదు. ఆ రెండవ దానికి చైతన్యం లేదు. పదార్థంలో జీవం వెలిగి పరిణామ ప్రగతి ఊర్ధ్వదిక్కుగా సాగవలసిన సమయం వచ్చింది. కనుక జీవం

"Her pallid beam smote the unfathomed Night
In which God hid himself from his own view"

**"తత్పేలవకాంతిరేఖ లోతు తెలియని రాత్రిని మర్దించింది**
**ఆ రాత్రిలో దేవుడు తనకు తానే కనరానట్లు దాగి యున్నాడు"**

వెంటనే 'ఒక పెద్ద అప్రాణి' (A vast Non-being) రూపంలో ఒక సమాధానం ఆ రాత్రి నుండి వచ్చింది. వేగంగా అది జీవమార్గాలన్నిటినీ మోహింపజేసి పరిణామం ఎల్లవేళలా

మందగించేట్లు చేసింది :

*A shadow fell across the simple Ray :*
*Obscured was the truth-light in the cavern heart*
*That burns unwitnessed in the altar crypt*
*Behind the still Velamen's secrecy*
*Companioning the Godhead of the shrine.*
*Thus was the dire antagonist Energy born*
*Who mimes the eternal Mother's mighty shape*
*And mocks her luminous infinity*
*With a grey distorted silhouette in the Night.*

**ఆ సరళకాంతిరేఖపై నొక ఛాయ పడినది :**
**సత్యకాంతి ఆ గుహాహృదయాన నణగిపోయి**
**ఆ చైత్యగుహాగృహాన, తదధిష్ఠానదేవతానువర్తియై,**
**తన్నిశ్చలపటాచ్ఛాదితరహస్సువెన్క**
**సాక్షీరహితమై జ్వలించుచుండు.**
**ఇట్లా దారుణ ప్రతీపశక్తి జనియించి**
**అనంతమాతృరూపంబు ననుకరించుచు**
**తద్దీప్తిమదనంతత్వము నపహసించుచు**
**రాత్రియందొక ఆపాండువిరూపాకృతియౌ.**

ఈ ఛాయ మానవుడు ఉన్నతతర చేతనాస్థరాలకు పరిణామం చెందాలని చేసే ప్రయత్నాలను భంగపరుస్తూ ఉంటుంది. ఈ ఛాయ చాలవరకు పూతనను పోలి ఉంటుంది. అట్లాగే వెలుతురున్నచోటికి దొంగతనంగా చేరాలని ప్రయత్నిస్తుంది : "ఊయలలోని ఆ దివ్యశిశువును హతమార్చ" చూస్తుంది. మన చుట్టూ ఒక పొగమంచు లాంటి దౌర్మనస్యాన్ని క్రమ్మేట్లు చేసి పరాజిత మనోవృత్తిని ప్రేరేపిస్తుంది. సహజంగానే ఆమె సంతానం కూడా "కాంతిద్వేషకులే". ఎట్లాగైతేనేమి, ఏదో ఒక విధంగా వారు పవిత్రప్రదేశాలను కూడ ఆక్రమిస్తారు, వాటిని ఆటంకవాదుల చీకటి మందిరాలుగా మార్చివేస్తారు :

*Night is their refuge and strategic base.*
*Against the sword of Flame, the luminous Eye,*
*Bastioned they live in massive forts of gloom,*
*Calm and secure in sunless privacy :*

*No wandering ray of Heaven can enter there.*
*Armoured, protected by their lethal masks,*
*As in a studio of creative Death*
*The giant sons of Darkness sit and plan*
*The drama of the earth, their tragic stage.*

**నిశి వారి ఆశ్రయం, వ్యూహరచనా స్థానం.**
**జ్వాలాఖడ్గాన్ని విరోధించి, దీప్తనేత్రాన్ని తొలగి,**
**సాంద్రాంధకారదుర్గములలో రక్షితులై వసింతురు,**
**నీరవ నిర్భయులై అసూర్యైకాంతమున వారుందురు :**
**ప్రవేశింపజాల దట నొక పరిభ్రామిత స్వర్లేఖయైన.**
**ప్రాణాంతకఛద్మరక్షితులై, కంచుకధారులై,**
**సృజనాత్మక మృత్యుచిత్రలేఖనస్థలియందు వలె,**
**ఆ నిశారాక్షసపుత్రులు కూర్చుండి కార్యకల్పన జేయు**
**ఈ ధాత్రీనాటకమన్ విషాదరంగస్థలిన్.**

విజ్ఞానశాస్త్రం, ఆ విజ్ఞానప్రయోగ పరిభాషా, ఈ రెండిటి ప్రగతిని, హిరోషిమా నాగసాకిలపై "విస్ఫోటకాస్త్రముల నరమేధమును" చూచిన తర్వాత, విశ్లేషించిన తర్వాత, శ్రీ అరవిందులు మన సమకాలీన నాగరికతా మూలకాలను కించిత్తయినా అతిశయించి చెప్పలేదని ఎవరికైనా అనిపిస్తుంది. కాని పురాతన ప్రశ్నను కూడ మరువరాదు. ఈ సృష్టిలో 'అహితం' (Evil) అన్నదానికి అవసరమెక్కడున్నది? అందున, ఉచ్చైస్స్వరంతో దేవుని పేరును అరచి చెబుతూ, ఆ దేవుని తన నేరాలలో భాగస్వామిని చేస్తూన్న ఈ 'అహితం' ఆవశ్యకత యేమిటి? మానవ నాగరికతలో చోటు చేసికొన్న అసంఖ్యాకమైన మతయుద్ధాలకు మరేదైనా వివరణ ఉన్నదా?

కాని ఈ 'అహితం' సృష్టికంటె భిన్నమైనదని ఎందుకు భావించాలి? మానవుడు తన మానవతను అధిగమించి ఎదగాలని చేసే ప్రయత్నంలో ఈ అహితాన్ని వాని మార్గంలో నిల్పటానికి ఆ పరమజ్ఞానానికి (Supreme Intelligence) కారణమొకటి ఉండే ఉండాలి. సులభంగా లభించినదేనికైనా మనం విలువనివ్వం. పరిణామప్రగతి విషయమూ ఇంతే. అహితం అంటే ఏమిటో మానవుడు తెలిసికొనవలె, దానిని ముఖాముఖి ఎదుర్కొనవలె, తన ఆత్మదైన దీప్తిలో అచంచల విశ్వాసంతో దానిని అతిక్రమించవలె. అశ్వపతి ఈ "అవిజ్ఞాతాంధకారంలో ఒక మౌనప్రజ్ఞను" గుర్తించగనే, వాని హృదయంలో ఆశ

ఉద్దీప్తమయినది. మానవునకుపాయనమివ్వబడిన ఈ ఆశాబీజం "ప్రకృతియొక్క మార్పును" ప్రవేశపెట్టగల ఒక తాళపు చెవి.

*A light was within him, an invisible hand*
*Was laid upon the error and the pain*
*Till it became a quivering ecstasy,*
*The shock of sweetness of an arm's embrace.*
*He saw in Night the Eternal's shadowy veil,*
*Knew death for a cellar of the house of life,*
*In destruction felt creation's hasty pace,*
*Knew loss as the price of a celestial gain*
*And hell as a short cut to heaven's gates.*
*Then in Illusions occult factory*
*And in the Inconscient's magic printing-house*
*Torn were the formats of the primal Night*
*And shattered the stereotypes of Ignorance.*

**వానితో నొక కాంతి యున్నది, అదృశ్యహస్తమొకటి**
**మోహముపైదగిలె, బాధను స్పృశించె**
**అదియొక కంపమాన మహానందమౌనంతవరకు,**
**ఒక బాహూపగూహనపు మాధుర్య నిర్ఘాతము.**
**చీకటిలో జూచెనతడు అనంతుని ఛాయావగుంఠనము,**
**జీవగృహంపు కక్షగా మృత్యువు నెఱిగె,**
**విధ్వంసమున సృష్టి వేగవచ్చలనంబు గ్రహించె,**
**నష్టమన్నది దివ్యలాభంపు విలువగా నెఱిగె**
**స్వర్గద్వారమునకు జేర్చు దెగ్గరిదోవ నరకమనుచు.**
**అంతట భ్రమదౌ గూఢార్థకర్మగృహాన,**
**అనైతికతామాయాముద్రణాలయమున**
**ఆద్యాంధకారపు నియమావళులన్ని ఛిద్రంబుగా**
**అవిద్యాస్థిరాకృతులు కకావికల్ గావింపబడియె.**

పరిణామమార్గంలోని ఆటంకాలను గురించి ఇంక విచారించటం మాని, అశ్వపతి ఇప్పుడా రాత్రిని వెన్కకు నెట్టివేసినాడు. అది పేక ముక్కల వలె నేల గూలింది. ఉషస్సు వచ్చింది, మార్గం స్పష్టంగా ఉన్నది.

* * *

## 9వ సర్గ - జీవదేవతల స్వర్గం

తమోనివహంలో సుదీర్ఘ ప్రయాణాన్నుండి బయటకు వచ్చి అశ్వపతి కడకు సేదదేరినట్లవుతాడు. ఉత్కంఠ దూరమయింది. ఈ ప్రపంచంలోని అహితము, బాధ, మృత్యువు ఎవరు వద్దన్నా పోయేవి కావని తెలుసుకున్నవానికి నిరాశ కలుగుతుంది. కాని భూప్రకృతిని మార్చాలని ప్రయత్నించే మానవుడు ముందుగా ఈ అహితాన్ని అనుభవించటం అవసరమని తెలిసినప్పుడింక ఉత్కంఠకు తావుండదు. శ్రీ అరవిందుల కవిత ఒకటి సార్థకమైన 'ఒక దేవుని పురిటి నొప్పులు' అన్న పేరుతో ఉన్నది. మానవజాతిని ఉద్ధరించటానికి దిగి వచ్చిన అవతారమూర్తులకు సైతం ప్రకృతిలోని ఈ అహితం సృష్టించే దుఃఖాన్నుండి మినహాయింపు లేదన్న సంగతిని ఈ కవిత స్పష్టం చేస్తుంది.

ఆ పరముడు మానవాకృతిలో అవతరించాలని నిశ్చయించికొంటే, ఆ అవతారమూర్తులు మానుషమైన కష్టాలననుభవించటంలోని హేతువిది. రాముని చరిత ఇందుకు ప్రసిద్ధమైన ఉదాహరణ. పదునాలుగు సంవత్సరాల సుదీర్ఘ కాలంపాటు అడవులలో తిరుగవలసిన అవసరం రామునికేమున్నది? అధర్మం చేసినాడన్న నిందమోయటం ఎందుకు? నేటికి గూడ పండితులు వాలివధను గురించి చర్చిస్తూనే ఉన్నారు. ఒక అవతారపురుషుడీ పని చేయదగునా? ఆపై సీతాబహిష్కారవృత్తాంతం! అదెట్లా జరిగింది? దశరథుని మరణవార్తను విని ఒక సామాన్యునివలె ఆతడెందుకు ఏడ్చినట్లు? సీతను పోగొట్టుకొని ఎందుకేడ్చినట్లు? మరి కృష్ణుని మాటేమిటి! శిశుపాల కర్ణుల నుండి నేటి రచయితల వరకు లక్షలసార్లు వానిని బోనులో నిలబెట్టినారు కదా!

కాని ఆ అవతారమూర్తులు మార్గాన్ని విడువరు. వారు తమ మార్గాన్ననుసరిస్తారు, వారి అవతార ప్రయోజనాన్ని సాధిస్తారు. అదేమంటే, మరల మరల తలయెత్తే అహితాన్నుండి భూమికి ముక్తిని ప్రసాదించటమే. త్రేతాయుగంలో ఒక రావణుడు, ద్వాపరయుగంలో ఒక దుర్యోధనుడు. శ్రీ అరవిందులిట్లా వ్రాస్తారు :

*He who would bring the heavens here*
*Must descend himself into clay*
*And the burden of earthly nature bear*
*And tread the dolorous way.*

**దివిని భువిపైకి దించాలని కోరేవాడు**
**స్వయంగా తాను పంకంలోనికి దిగవలె,**
**ధరాప్రకృతి భారాన్ని స్వయంగా వహించవలె,**
**ఆ శోకాకులితమార్గాన సాగవలె.**

అశ్వపతి ఇంతదనుక చేస్తున్నదిదే. ఇప్పుడాతడు ఆ దుఃఖమార్గం నుండి ఒక "గొప్ప పరమసుఖాహస్సు" (great felicitous Day) లోనికి ప్రవేశించినాడు. ఈ సత్యసౌందర్య వాతావరణంలో ఆతడు స్వేచ్ఛావిద్యుదనుభూతిని పొందినాడు.

Assured of the bliss for which all forms were made,
Unmoved by fear and grief and the shocks of Fate
And unalarmed by the breath of fleeting Time
And unbesieged by adverse cirumstance,
It breathed in a sweet secure unguarded ease
Free from our body's frailty inviting death,
Far from our danger-zone of stumbling Will.

**రూపోద్దిష్టమైన ఆనందప్రాప్తి ప్రతిజాతముగా,**
**భయ దుఃఖవిధివ్యాఘాతములచే విచలితము కాక,**
**ధావత్కాలశ్వసితముచే ఉద్విగ్నత జెందక,**
**ప్రతికూలస్థితిచే అనవరుద్ధమై,**
**అది యొక మధుర సురక్షితానభిరక్షితస్వాస్థ్యమున్ శ్వసించె**
**ఈ మరణాకర్షిశారీరకదుర్బలత నుండి ముక్తమై,**
**మన స్ఖలత్ సంకల్ప మను ఆపన్మండలమునుండి సుదూరమై.**

శ్రీ అరవిందులు సుపరిచితమైన భావాలను ప్రస్తావించటం ద్వారా మనం మన సమతౌల్యాన్ని తిరిగి పొందే విషయంలో సహకరిస్తారు. ఈ నాటకీయ ప్రయాణం పూర్తిగా అశ్వపతి ఆత్మలోని అంతరంగస్థలాలలో సంభవిస్తున్నది. దీనివలన మనలో నిద్రాణంగా ఉన్న శక్తుల గురించి ఒక అవగాహన కలుగుతుంది. అందులో ఆశ వంటి శక్తి మనల్ని గొప్ప లక్ష్యసాధకులుగా మార్చివేయగలదు. ఉదాహరణకు, లలితకళలు సంగీత నృత్యాల ద్వారా మనల్ని దివ్యత్వానికి చేర్చగలవు. ఈ లలితకళలు గంధర్వుల సొత్తు. ఇప్పుడు అశ్వపతి గంధర్వలోకాన్ని దర్శిస్తున్నాడు :

Below him lay like gleaming jewelled thoughts
Rapt dreaming cities of Gandharva Kings.
Across the vibrant secrecies of space
A dim and happy music sweetly stole,
Smitten by unseen hands he heard heart-close
The harp's cry of the heavenly minstrels pass,
And voices of unearthly melody
Chanted the glory of eternal love
In the white-blue-moonbeam air of Paradise.

**అధోభాగాన మెఱుస్తూన్న రత్నాయితభావాలుగా**
**ఆనందస్వప్న గంధర్వరాజనగరాలున్నవి.**
**కంపమానాంతరిక్ష రహస్యముల దాటి**
**ఒక మందసహర్ష సంగీతము తియ్యగా ప్రసరించింది,**
**అదృశ్యహస్తలాలితమైన తంత్రీనాదగానాలు**
**అలౌకికదివ్యగానమాధుర్యాలు**
**అనంతప్రేమ వైభవాన్ని స్వర్గ సమీర స్వచ్ఛ నీలజ్యోత్స్నలో**
**హృదయానికి హత్తుకున్నవి.**

సంగీతమన్నది నాదరూపంలో బ్రహ్మము నారాధించటం (నాదబ్రహ్మ), కనుక అది మనల్ని "జీవాతీత మహత్తు దిశగా" తీసుకుపోగలదు. ఈ నిత్యజీవితపు లౌకిక వ్యాపారాలకు అందనంత ఎత్తుకు మనల్ని మంచి సంగీతం తీసికొని పోగలదన్న అనుభవం తఱచుగా చెప్పుకుంటూ ఉండేదే. ఇక్కడ అందం, శాంతి, ప్రేమ ఉన్నవి. మన ఆశయాలను సూచించే ఒక సాధనాన్ని సంగీతం మనకిస్తుంది. ఈ గంధర్వలోకపు సంగీతశక్తి బాధను సంతోషంగా మార్చివేస్తుంది. అంధకారాన్ని తరిమివేసి, ఆత్మను శాంతపర్చటంలో సంగీతమెంత శక్తివంతమో చెప్పనక్కరలేదు. ఎందుకంటే, అది అందరికీ నిత్యానుభవమే.

*After the anquish of the soul's long strife,*
*At length were found calm and celestial rest*
*And, lapped in a magic flood of sorrowless hours,*
*Healed were his warrior nature's wounded limbs*
*In the encircling arms of Energies*
*That brooked no stain and feared not their own bliss.*
*In scenes forbidden to our pallid sense*
*Amid miraculous scents and wonder-hues*
*He met the forms that divinise the sight,*
*To music that can immortalise the mind*
*And make the heart wide as infinity*
*Listened....*

**ఆత్మికసుదీర్ఘ సంఘర్షణయాతనానంతరము**
**కట్టకడపట కన్పించె ప్రశాంతియు దివ్యవిశ్రాంతి,**
**అంత, దుఃఖరహితఘటికామాయాసంప్లవానదేలి,**
**వాని యోద్ధస్వభావికక్షతాంగముల్ శమించె**
**పర్యావృతశక్తి బాహువులలో**

**నెయ్యవి నిష్కలంకములు, నిర్భీకానందనిధుల్.**
**పేలవమైన మన ఇంద్రియముల కందబోని దృశ్యములు**
**అద్భుతసుగంధము లాశ్చర్యవర్ణముల మధ్య**
**దృష్టిని దైవీకరించు ఆకృతుల నతడు చూచె,**
**మనస్సు నమరమొనరించజాలు, హృదయంబును**
**సైత మనంతవిశాల మొనర్చు సంగీతము నాతడు వినియె.**

ఆతడా సంగీతమున మైమరచునంతలో అశ్వపతి శరీరమునకు ఒక దివ్యప్రకాశము కలిగింది. శరీరము – మనస్సు అను విభజన తొలగిపోయింది. ఎందుకంటే, సంగీతం ఆవరణలను ఛేదించి సూటిగా ఆత్మను చేరి ఆ పరముని సందేశాలను వినిపిస్తుంది. "భూస్వభావము పునర్జన్మమంది నిలిచె, స్వర్లోకసహవాసియై" (Earth-nature stood re-born, comrade of heaven) అది సర్వము ఆనందమయము.

A giant drop of the Bliss unknowable
Overwhelmed his limbs and round his soul became
A fiery ocean of felicity...

**బృహదానందబిందువొకటి అజ్ఞేయమై**
**వాని అంగముల నాక్రమించి, ఆత్మనావరించు**
**ఒక ఉజ్జ్వల ప్రహర్షసింధువాయె.**

* * *

## 10వ సర్గ – అల్పమనస్సురాజ్యాలు, దేవతామూర్తులు

అశ్వపతి ఉన్న స్వర్గం చాలా ప్రలోభపెట్టేట్లున్నది. కాని నిర్ణీతసమయాల్లో మళ్ళీ మళ్ళీ పునర్నవం కావలసిన ఆ సంతోషం విషయంలో అతడు అనాసక్తుడు. అందులో క్రమవృద్ధి కసలు అవకాశమే లేదు! అశ్వపతి ముందుకు తన అనామికలక్ష్యం కోసం అన్వేషిస్తూ సాగవలసిందే. ఆ లక్ష్యం ఆవలితీరం నుండి పిలుస్తున్నది. ఇక్కడ సాహసకృత్యాలు నిరీక్షిస్తున్నవి. ఆతడిప్పుడు "రేబవళ్ళుద్వాహమై ఒక్కటైన ఒక వెండి రంగు మైదానం" ("a silver-grey expanse where Day and Night had wedded and were one.") లో ఉన్నాడు. యథాతథంగా, ఆ ప్రదేశంలో కీటకాలు ప్రాకటం నేర్చుకుంటూ ఇంద్రియ జ్ఞానసాధన చేస్తున్నాయి. ఈ ప్రాంతం ఏమిటో అతనికి విస్పష్టంగా తెలియదు. ఎందుకంటే, అదంతా సంధ్యాసమయపు మసక వెలుతురు. ఆతడొక

కాంతివంతమైన వంతెనమీదుగా సాగిపోయి ఒక ఉజ్జ్వల ప్రదేశాన్ని ప్రవేశించినాడు. మానవుని ఇంద్రియ జ్ఞానాన్ని అధిగమించి ఒక ప్రజ్ఞాతత్త్వం ఉదయించే పరిణామదశ ఇది. ఆత్మవిశ్వాసంతో ఆ ప్రజ్ఞ మనస్సుగా స్ఫటికీకృతమవుతుంది :

*Thus streamed down from the realm of early Light*
*Ethereal thinkings into Matter's world;*
*Its gold-horned herds trooped into earth's cave-heart*
*Its morning rays illume our twilight's eyes,*
*Its young formations move the mind of earth*
*To labour and to dream and new-create,*
*To feel beauty's touch and know the world and self :*
*The Golden child began to think and see.*

**ఆ రీతి తైజసాలోచనలు పూర్వకాంతిసీమ నుండి**
**పదార్థప్రపంచములోనికి ప్రవహించినవి;**
**దాని సువర్ణశృంగసమూహము లిలాహృదయ గుహనుజేరె.**
**దాని ఉదయకిరణాలు మన సంధ్యా నేత్రముల దీపింపజేయు,**
**దాని కౌమారరచనల్ ధాత్రీమనస్సును కదిలించి,**
**శ్రమించి, కలగాంచి, నవసృష్టికుద్యమింపజేయు,**
**సౌందర్యస్పర్శను లోకమున్, తననుదా దెలియ :**
**ఆ స్వర్ణశిశువు యోచించి గ్రహించ దొడగె.**

మనస్సు వేగంగా పనిచేస్తుంది. మేథాశక్తి ఉదయించటంతో, ఈ సృష్టిని గురించి జ్ఞానం ప్రోగుబడి విశ్వమంతా చిత్రరేఖాయిత మవుతుంది, మనస్సు సర్వజ్ఞయైనట్లు. క్షణమైన వృథా కాకుండా జ్ఞానాన్నంతా స్వీకరించాలన్న తొందరలో, విధిగా ఈ ఉపకరణం గాఢతర సత్యాలను చూడనేలేదు. అది పదార్థాన్ని మాత్రమే చూచింది, కాని అంతర్గతుడైన దేవుని కాదు. సృజనాత్మకప్రేరణకు విషయసత్యత్వాన్ని మనస్సుకు బోధించటంలో తొందరపాటు కూడ లేదు. ఎందుకంటే, "భూమి మందగామి ప్రగతిని మాత్రమే భరించగలదు." ("Only a slow advance the earth can bear") కాని మనస్సు సంతోషంగా తన పని తాను చేసుకుపోతుంది :

*Incapable of the soul's direct look*
*She sees by spasms and solders knowledge-scrap,*
*Makes Truth the slave-girl of her indegence,*
*Expelling Nature's mystic unity*

*Cuts into quantum and mass the moving All;*
*She takes for measuring-rod her ignorance.*

**నేరుగా ఆత్మదర్శనము చేయలేక**
**ఆమె సంకుచితాంగముల జూచి జ్ఞానశకలాల సంధించు,**
**తన దైన్యమునకు సత్యమున్ బానిసగ జేయు,**
**ప్రాకృతిక గుప్తైక్యతన్ బహిష్కరించి**
**చరంబునెల్ల పరిమాణమని, రాశియని విభజించు;**
**తన అజ్ఞానమునె దాను మానదండమని తలంచు.**

విషయ పరిజ్ఞానాన్ని సంపాదించే ఈ సత్వర కార్యంలో, మనస్సుకు ముగ్గురు నమ్మిన బంట్లున్నారు. వారిలో మొదటివారు :

*A pigmy Thought needing to live in bounds*
*For ever stooped to hammer fact and form.*
*Absorbed and cabined in external sight,*
*It takes its stand on Nature's solid base*
*A technician admirable, a thinker crude,*
*A riveter of life to habit's grooves....*

**ఒక వామనచింతన సీమాంతఃస్థితికై**
**యథార్థమున్ రూపము సర్వదా సమ్మెటగొట్టబూనె.**
**బాహ్యదృష్టిలో మున్గి సంపుటీకృతమై**
**ప్రాకృతఘనమూలము పయిన్ దా నిల్చు.**
**శ్లాఘ్యశిల్పాధికారియు, అపరిణత తత్త్వవేత్తయు,**
**జీవమును అభ్యాసప్రణాలీబద్ధముగ బంధించునతడు.**

ఎవరికైనా వారి తమ స్వంత ఆలోచనకంటె సరియైన సహకారి వేరెవరో ఉంటారనుకోవటం కుదరదు. కాని ఆలోచనకు స్వయంప్రేరణ ఉండదు. అది కేవలం మనస్సు చెప్పిన దానిని యాంత్రికంగా చేసేస్తుంది. ఇక రెండవ బంటు "సాహసిక ప్రవృత్తి" (*a rash intelligence*). వామనచింతనకు స్వంతప్రేరణ లేనట్లయితే, ఈ సాహసిక ప్రవృత్తి హఠాదూహలు చేస్తుంది, వితర్కం అస్పష్టసామాన్యవాదం చేస్తుంది. మూడవదీ చివరిదీ అయిన పరిచారిక వివేకం, "బలవత్తమము, వివేకోత్తమము ఈ భూతసంకాశత్రయంలో" (*the strongest, wisest of the troll-like Three*) :

*Armed with her lens and measuring rod and probe,*
*She looked upon an object universe*
*And the multitudes that live in it and die*
*And the body of space and the fleeing soul of Time,*
*And took the earth and stars into her hands*
*To try what she could make of these strange things...*
*Impatient of enigma and the unknown,*
*Intolerant of the lawless and the unique,*
*Imposing reflection on the march of Force,*
*Imposing clarity on the unfathomable,*
*She strove to reduce to rules the mystic world.*

**చేత కాచమున్ మానదండంబు శలాకబట్టి**
**ఆమె వస్తుప్రపంచముం జూచె**
**అందు మనుచు చచ్చుచునుండు జీవసంఘాతమున్**
**అంతరిక్షశరీరమున్ పరుగెత్తిపోవు కాలాత్మగూడ,**
**పృథ్వీ నక్షత్రములం దన చేతబట్టె**
**చూతునుగాక ఈ విచిత్రవస్తువులతో నేమి చేయగలనని..**
**అజ్ఞాతముల్ గూఢార్థములతో అసహిష్ణుతన్,**
**ధర్మరహితము నపూర్వమైనవాని నోర్వలేక,**
**బలము నడవడికపై చింతను నిక్షేపించి,**
**అనవగాహ్యముపై స్పష్టత నిక్షేపించి,**
**ఆమె ఆ నిగూఢ ప్రపంచమున్ సూత్రీకరించ జూచె.**

ఇదంతా మెచ్చదగిందే కాని ఆమె చివరి మాట ఎప్పటికీ చివరది కాదు. నేడు ఋజువైన విషయం రేపు సులభంగా నిరస్తమవుతుంది. ఒకప్పుడు భూమి బల్లపరుపుగా ఉన్నది, నేడు భూమి గుండ్రంగా వుంది! మన విజ్ఞాన శాస్త్రం హేతుబద్ధత అన్న గట్టి బండఱాతి పునాది మీద ఉన్నదని బీరాలు పలుకుతుంది. అయినాసరే తన నిర్ణయాలను గురించి ఎప్పుడూ అనిశ్చితియే. అయినా గాని హేతుబుద్ధి సులభంగా తన ఓటమిని అంగీకరించదు, మనిషి ఆత్మగలవాడని ఒప్పనూ ఒప్పదు. హేతుబుద్ధికి "పదార్థమన్నది శ్లాఘనీయ వాస్తవము" (Matter is the admirable Reality).

అదృష్టవశాత్తు మనకు దెలిసిన విధమైన ఈ మనస్సుసమస్తమూ కాదు. ఈ మనస్సుకు వేరుగా అన్యవిస్తారములున్నవి, హేతువు నధిగమించి ప్రసరించగల అన్య తలములున్నవి. విశ్వాత్మ యే ధృవమైన విధికీ కట్టుబడి లేదు :

*A sudden turn can come, a road appear.*
*A greater Mind may see a greater Truth,*
*Or we may find when all the rest has failed*
*Hid in ourselves the key of perfect change.*

**ఒక హఠాత్పరిణామము రాగలదు, మార్గము కన్పించును.**
**ఒక మహత్తర మనస్సు మహత్తర సత్యమున్ జూచు,**
**లేదేని, సమస్త మపజయము నొందినపుడు,**
**దోషరహితమగు పరిణామకుంచిక**
**మనలోనె దాగియుందని గ్రహించవచ్చు.**

రెండు "సూర్యదృష్టిగల భూతముల"ను (sun-gaze Demons) అసాధారణమైన చొరవ, కార్యదక్షత గలవానిని, చూచినపుడు, అశ్వపతికి ఈ విషయము కొంత అవగాహన కలిగింది. కనుక అతడు మహత్తరమనోరాజ్యముల దిక్కుగా సాగిపోతాడు.

❊ ❊ ❊

## 11వ సర్గ – అతిమానసరాజ్యాలు, వాని దేవతలు

బాహ్య దృష్టికి ఎంత అనంతమైన ప్రయాణం! కాని ఈ ప్రయత్నం చేయక తప్పదు. కనుక ఇప్పుడశ్వపతి మనస్సంబంధి తలముల కావలనున్న సీమలకు వెళ్ళుతున్నాడు. వానిలో ఒక హర్షోద్రేకమున్నది. ఎందుకంటే, ఇది మనస్సును వెన్కకు లాగే పదార్థం నుండి విడుదల. శ్రీ అరవిందులు రచించిన చక్కని కవిత ఒకటి 'వృక్షము' అన్న పేరున ఉన్నది. ఇది మానవుని ఈ సమస్యను వర్ణించి చెబుతుంది. ఆతడు పదార్థం వెనక్కి లాగుతూన్నప్పటికీ మనస్సు కింకా పై సీమలగురించి ఆసక్తితో ఉన్నాడు.

*A tree beside the sandy river beach*
*Holds up its topmost boughs*
*Like fingers towards the skies they cannot reach,*
*Earth-bound, heaven-amorous.*
*This is the soul of man. Body and brain*
*Hungry for earth our heavenly flight detain.*

**ఆ నదీసైకత తీరాన వృక్షమొకటి**
**తన శిఖరాగ్ర శాఖల విస్తరించె**
**అవి చేరలేని గగనాలవంకకు అంగుళులట్లు,**

**ధరాబద్ధమై, స్వర్లోక ప్రేమియై.**
**ఇది మానవుని ఆత్మ. దేహమున్ మేధయు**
**ధరణికై క్షుధార్తమై మన స్వర్గోద్గమనము న్నిరోధించు.**

గాఢమైన ధ్యానంలో తాను "చింతనామహత్సోపానముల" (great stairs of thought) పై సాగుతూన్నట్లు అతడు గ్రహిస్తాడు. ఈ ఊర్ధ్వమార్గానికి అంతులేనట్లున్నది. కాని "ఆదర్శమనోవైభవాల" (the splendours of ideal Mind) క్షణదర్శనం కలుగుతున్నది. శ్రీ అరవిందులు తమ దివ్యజీవనం (The life divine) లో మనస్సు కావల నాలుగు స్థాయిలున్నట్లు చెబుతారు : 1. ఊర్ధ్వతర మనస్సు, 2. దీప్తమనస్సు, 3. సహజావబోధము, 4. ఉన్మనస్సు. ఇవన్నీ అతిమనస్సునకు బాటవేసేవే. ఏదియేమైనా, ఇవి అరూపభావాలు, ఈ పై జెప్పిన మానసిక స్థరాలను సునిశ్చితమైన అధికరణాలుగా విభజించటం సాధ్యం కాదు. బాహ్యదృష్టికి దురవగాహమైన భావాలను గ్రహించటంలో ఉపకారకంగా శ్రీ అరవిందులు అవన్నీ వేర్వేరు లోకాలు అన్న పదచిత్రాన్నుపయోగించినారు. ఇవి శ్రీదివ్యోపాసకునకు సంబంధించిన మహామేరువులోని వివిధమైన 'ఆవరణ'లను గుర్తుచేస్తాయి.

ఆ వైభవోపేతమైన సోపాన పంక్తిని అధిరోహించటంలో ఆతడు చేరిన మొదటి మెట్టు భూమికి అత్యంతం చేరువగా ఉన్నది. ఇది భూమీ కాదు స్వర్గమూ కాదు. కాని దీనినొక తాత్కాలికమైన విశ్రాంతి స్థానం అనవచ్చు. ఇక్కడ ఈ ప్రపంచంతో ప్రతిస్పందించే శక్తులూ మూర్తులూ ఉన్నాయి. ఇవి ప్రకృతి సూత్రాల గురించి క్రొత్త విషయాలను క్రొత్త ప్రతిపాదనలను ఈ ప్రపంచం తెలుసుకోవటంలో సహకరిస్తాయి. ఆపై అశ్వపతి "సూక్ష్మ ప్రధానదేవదూతలజాతి" (a subtle archangel race) వారి ప్రపంచాన్ని చేరుకుంటాడు. వీరు విషయాల గురించి అధికతర సమగ్రదృష్టి కలిగినవారు. వీరు సాహసంతో ఊహించి, ఆలోచించగల గొప్ప తాత్త్వికులు. కాని ఒక స్థాయి చేరగానే వారు పరమసత్యాన్ని తాము గ్రహించినామని భావిస్తారు! అట్టివారిలో చాలా మందిని మనం చూచినాము కదా: ఐన్‌స్టీన్, రూథర్‌ఫర్డ్, ప్లాంక్, ఫ్రాయిడ్ (Einstein, Rutherford, Planck, Freud) వారికొక అవకాశమిస్తే వారు విశ్వాత్మకుని (the cosmic self) కూడ మనోధర్మవిశ్లేషణ చేసి ధైర్యంగా ప్రకటించగలరు!

The psycho-analysis of cosmic self
Was traced, its secrets hunted down, and read
The unknown pathology of the Unique.
Assessed was the system of the probable,

*The hazard of fleeing possibilities,*
*To account for the Actual's unaccountable sum,*
*Necessity's logarithmic tables drawn,*
*Cast into a scheme the triple act of the One.*

**విశ్వాత్మ మనోధర్మవిశ్లేషణ**
**కనుగొనబడి, అందలి రహస్యాల నేరితీసి,**
**ఆ అద్వితీయుని అజ్ఞాతరోగలక్షణాలు**
**సంభావ్యపున్ సరణి నిర్ధరింపబడియె,**
**స్రవత్ సాధ్యముల సంకటము,**
**వాస్తవికతయొక్క నిర్హేతుక యోగమునకు హేతువుం జెప్పగా,**
**ఆవశ్యకతయొక్క ఘాతప్రమాపకముల పట్టిక వ్రాయబడినది,**
**కేవలుని కార్యత్రయము ఒక ప్రబంధమున నమర్చబడినది.**

ఇప్పుడు అశ్వపతి దివ్యచేతనకు సన్నిహితమగు చేతనగల ఒక మూడవ ప్రపంచాన్ని చేరినాడు. ఇది భావనాప్రపంచం. ఇక్కడ నివాసముండేవారు కొద్దిమంది కాని వారందరు–

*"Wide all-seeing gaze*
*Surveying the enormous work of Time.*

**"అతిమాత్రకాలచేష్టితమున్ విలోకించు**
**విశాల సర్వసాక్షీభూతదృష్టి"**

కలిగినవారు. ఎవరైనా "సర్వభృచ్చేతన" (all-containing Consciousness) ఉనికి నక్కడ గ్రహిస్తారు. అది జీవునికాలంబనయైన మూలప్రకృతి. చరమసత్యాన్ని గ్రహించటంలో వారు నిమగ్నులై పరాశక్తి సాధనలో ఉన్నారు. వారి ఆకాంక్ష వ్యర్థం కాదు, ఆమె వారికి తప్పక ప్రత్యుత్తరమిస్తుంది. వైయక్తిక జ్ఞానయోగులు సాధించిన ఇట్టి వైయక్తికముక్తి సాధన మనకేమీ క్రొత్త కాదు :

*She shaped her body to a mind's embrace,*
*Into thought's narrow limits she has come;*
*Her greatness she has suffered to be proposed*
*Into the little cabin of the Idea,*
*The closed room of a lonely thinker's grasp :*
*She has lowered her heights to the stature of our souls*
*And dazzled our lids with her celestial gaze.*

*Thus each is satisfied with his high gain*
*And thinks himself beyond mortality blest,*
*A king of truth upon his separate throne.*
*To her possessor in the field of Time*
*A single splendour caught from her glory seems*
*The one true light, her beauty's glowing whole.*

**ఆమె శరీరమొక మనస్సు కౌగిలికి మలచికొన్నది.**
**సంకుచితచింతనావధులలోని కామె చేరె;**
**తన మహత్తునొక భావనాల్పకుటిలోన**
**ఇమిడింపగా నామె అంగీకరించె,**
**అదియొక ఏకాకి చింతకుని గుప్తగ్రహణము :**
**ఆమె తన ఉన్నతిన్ మన మన ఆత్మల మిరుమిట్లుగొలిపె**
**తన లాభోన్నతికి సంతుష్టుడగుచు ప్రతియొక్కరుండు**
**తనకు దానె మర్త్యత్వముం ద్రోచిన భాగ్యవంతుడనుకొను,**
**తనకు దానొక సత్యసింహాసనాసీనుడైన రాజుగా నెంచు.**
**కాలరణరంగమున ఆమెను స్వీకరించినవానికి**
**ఆమె వైభవంబున నొకే ఒక విభూతినొంది, అదియె**
**ఏకైక సత్యకాంతి, ఆమె దీప్తిమత్సౌందర్య సర్వమనిపించు.**

కాని అశ్వపతికి సంబంధించినంతవరకు, ఇది వాని అన్వేషణకు సమాప్తి కాబోవటం లేదు. పరాశక్తిని జీవాత్మలో బంధించి తనకు దాను ఆనందంలో మునిగిపోవటం మాత్రమే చాలదు. ఈ రీతిలో ఆమె ఉనికిని మనం సృజనాత్మకంగా ఉపయోగించలేము. దానికి బదులు ఆ పరముని మనం మానుషమనస్సుగా వర్గీకరించి, జ్ఞాని సాహసకృత్యాన్ని నిరర్థకం చేస్తాము. మానుషం దివ్యాన్ని పరిమితం చేసివేస్తే, మనం ఎక్కడున్నట్లు? వ్యక్తిగతంగా జ్ఞాని తాను జగన్మాతను గ్రహించినానని భావిస్తాడు, కాని ఆతనికి దక్కినది ఆమె అనంతత్వంలో ఒక చిన్న భాగం మాత్రమే. తానొక్కడే ముక్తుడైతే లాభమేమిటి? నిజానికి, తన సుదీర్ఘనిరంతరాయ యోగానికి ఏమి లాభం చేకూరినట్లు? తపస్సు ద్వారా మనస్సు పరిమితులను అధిగమించాలని చేసిన పరిశ్రమకు అర్థమేమిటి? మానవుని పరిశ్రమలకొక అర్థం కలగాలంటే, తాను ఈ పరిణామ సోపాన పంక్తిపై పైమెట్టునెక్కక తప్పదు. దానిని సాధించవలెనంటే, మనం మన మానుష కక్ష నుండి బైటబడి, దివ్యచేతనల విస్తారం వైపు దృష్టి సారించవలె. గుర్తుంచుకో, ఆ దివ్యమాత పరిమితులకు లొంగునది కాదు!

*Out of our thoughts we must leap up to sight,*
*Breathe her divine illimitable air,*
*Her simple vast supremacy confess,*
*Dare to surrender to her absolute.*
*Then the Unmanifest reflects his form*
*In the still mind as in a living glass;*
*The timeless Ray descends into our hearts*
*And we are rapt into eternity.*
*For truth is wider, greater than her forms.*
*A thousand icons they have made of her*
*And find her in the idols they adore;*
*But she remains herself and infinite.*

**మన చింతనల నుండి మనం దృష్టి దనుక ఎగురవలె,**
**ఆమెదౌ అపరిమేయ దివ్య ప్రాణమున్ శ్వసించవలె,**
**ఆమెదౌ సరళవిస్తార ప్రభుతనంగీకరించవలె,**
**ఆమెదౌ అనన్యసంబద్ధతకు శరణనగ సాహసించవలె.**
**అంతట అవ్యక్తము తన రూపమున్ సజీవదర్పణమందువలె**
**ఈ నిశ్చలమనస్సు నందు ప్రతిఫలించు;**
**అకాలనియత కాంతిరేఖ మన హృదయాలలో నవతరించు,**
**మనము అనంతత్వములో పరిహృష్టుల మౌదుము.**
**సత్యమామె రూపములకన్న విశాలతరము, మహత్తరమగు.**
**ఆమెవౌ రూపసహస్రము మూర్తీకరింపబడి**
**ఆ మూర్తులలో నామెనారాధించి దర్శింతురు;**
**కాని ఆమె తానయైయుండు అనంతమగుచు.**

❊ ❊ ❊

## 12వ సర్గ - ఆదర్శ స్వర్గములు.

రాత్రిలోనికి అవతరణ తప్ప మిగత ప్రయాణమంతా చాలా అద్భుతంగా ఇంతవరకు సాగింది. అద్భుతం, అవును. కాని ఇది నిరంతర లగ్నతనూ ధ్యానాన్నీ అశ్వపతి నుండి అపేక్షించింది. ఎందుకంటే, అతడు తన ఆధ్యాతిక సాహసానికి గల లక్ష్యాన్ని మరువకుండ ఉండాలని. ప్రతి నవలోకమున్నూ అదెంత గొప్పదైనాగాని వ్యక్తి

సాఫల్యాన్ని మాత్రమే ఆశిస్తుంది. కాని ఆ "ప్రపంచపు పూర్వికుడు" లోకోద్ధరణ అన్న తన లక్ష్యాన్ని త్యజించలేదు. ఇక్కడ శ్రీ అరవిందులు, అశ్వపతియొక్క ఈ యోగం సారవత్ ధ్యానమే అని, గుర్తిస్తారు. ఆతడు ధ్యానంలో కూర్చొని ఉండగా పైపైకి సాగిపోతూన్నది చింతన :

*Always the ideal beckoned from afar.*
*Awakened by the touch of the Unseen,*
*Deserting the boundary of things achieved,*
*Aspired the strong discoverer, tireless Thought,*
*Revealing at each step a luminous world.*
*It left known summits for the unknown peaks :*
*Impassioned, it sought the lone unrealised Truth,*
*It longed for the Light that knows not death and birth.*

**సదైవ ఆదర్శం దూరంనుండి చేయూచి పిలిచింది.**
**అదర్శిత స్పర్శచే నిద్రమేల్కొలుపబడి,**
**సాధించిన వస్తుప్రపంచపు పొలిమేర విడిచి,**
**ఆ బలవంతుడౌ రహస్యభేది, అలుపెరుగని చింతన,**
**అడుగడుగున నొక ప్రకాశమాన లోకము నావిష్కరింప**
**ఊర్ధ్వగామియయ్యె, అజ్ఞాత శిఖరాలకై జ్ఞాతంబు వదలె :**
**అనురక్తయై అది ఏకైకాప్రత్యక్షసత్యము నన్వేషించె,**
**మరణజననాల నెఱుగని జ్యోతికై అభిలషించె.**

శాస్త్రవేత్తలంటారు కదా, మానవుడింకా తన మేధస్సులోని నిద్రాణశక్తులను వశము జేసికొనవలసి ఉన్నదని. అతడలా చేస్తే, "అమరమగు గులాబిదైన ప్రియరాజ్యాల" (the lovely kingdoms of the deathless Rose) నిప్పుడు ప్రవేశించిన అశ్వపతి వలె, మానవుడు అనన్విష్టక్షేత్రాలను దర్శిస్తాడు. ఈ రాజ్యం అతిచేతనాకాశమునకు క్రింది అచేతనాకాశమునకును మధ్య, మానవునకు చేరువలో ఉన్నది. కాని ఆతడు నిత్యజీవిత వ్యాపారాలలో చిక్కుకొని ఉండటం వలన దానిని సులభంగా అనుభవించలేడు. సాధకుడు తన భౌతిక ప్రపంచ బంధాలనుండి విడివడినపుడు, ఇది కేవలం కొద్దిసేపు మాత్రమే అయినప్పటికి, అతడు తనలో ఈ మరణంలేని గులాబి భగవానుని పాదాల చెంత వికసించే ఆ సుందరలోకాన్ని దర్శిస్తాడు.

మర్త్యుడైన మానవున కిది చేరరాని, అసాధ్యమైన ఉన్నతి కాదు, అంటారు శ్రీ

అరవిందులు. తపస్సులో ఈ గులాబిని తనలోనూ పూయించవచ్చు. ఒక్కసారి ఇది జరిగితే, యావత్ప్రపంచమూ ఆ దివ్యుని వైభవంతో నిండి ఉన్నదని దర్శిస్తాడు. అప్పుడంతా సర్వత్ర ఆనందమే, "ఆత్మ సుఖోన్ముఖమై వికసిస్తుంది" (the soul opens to felicity). ఈ ఆనందాన్ని వివరించట మెట్లా?

A bliss is felt that never can wholly cease,
A sudden mystery of secret Grace
Flowers goldening our earth of red desire.
All the high gods who hid their visages
From the soiled passionate ritual of our hopes,
Reveal their names and their undying powers.
A fiery stillness wakes the slumbering cells,
A passion of the flesh becoming spirit,
And marvellously is fulfilled at last
The miracle for which our life was made.

**ఎన్నటికి నశించని ఆనందమనుభూతమయ్యె,**
**ఎఱ్ఱని కోర్కెల ధాత్రిని స్వర్ణకాంతుల నింపుచు**
**రహఃప్రసాదపు హఠాదద్భుతము వికసించె.**
**మన ఆశల మలినోత్కంఠిత శాస్త్రవిధుల నుండి**
**ముఖముదాచిన ఉన్నత దేవతలందఱు**
**తమ నామములన్ అవ్యయ శక్తులన్ ప్రదర్శింతురు.**
**ఒక జాజ్వల్యనిశ్చలత నిద్రాణజీవాణువుల మేల్కొలుపు,**
**మాంసల వికారమొకటి ఆత్మయగుచు,**
**ఎట్టకేలకు మన జీవితాశయమగు అద్భుతము**
**ససంభ్రమముగా ఫలవంతమయ్యె.**

శ్రీ అరవిందులు "దేవుని గులాబి' అను శీర్షికన ఒక కవిత వ్రాసినారు. దానిలో ఆనందము, కాంతి, శక్తి, జీవము, ప్రేమ అను అయిదింటి సమాహారమైన సాధకుని తొలి ఆనందానుభవాన్ని ఒక అయిదు రేకల గులాబిగా సంకేతించి వర్ణిస్తారు :

Rose of God, vermillion stain on the sapphires of heaven,
Rose of bliss, fire-sweet, seven-tinged with the ecstasie's seven!
Leap up in our heart of humanhood, O miracle, O flame,
Passion-flower of the Nameless, bud of the mystical Name.

**గగనమహానీలముపై సిందూరచిహ్నంబు దేవజపాపుష్పం**
**సప్తప్రహర్షముల సప్తవర్ణాలైన జ్వాలామధురానంద జపాపుష్పం!**
**హే అద్భుత, హే జ్వాలా, నామరహితుని భావపుష్పమ!**
**గహననామముకులమా! మానుషత్వపు మా హృదిలో ఉత్ఫ్లుతియై లెమ్ము!**

సాధకుడు అశ్వపతి అక్కడ ఒక జ్వాలను చూస్తాడు. గులాబి ఆనందానికి చిహ్నం కాగా, జ్వాల జ్ఞానానికి ప్రతినిధి. ఇది బ్రహ్మానందంగానూ బ్రహ్మజ్ఞానంగాను సాక్షాత్కరించగలదు.

మరణరహితమైన ఈ జపాపుష్పదేశం మనల్ని ఆ పరముని దిశగా ఆనందవర్ణాల అనుభవంగా మార్గదర్శనం చేయగా, మరణరహితమైన జ్వాలాదేశం నిష్ఠురమైన చింతనాక్రమం ద్వారా సాధకుని ముందుకు నడిపిస్తుంది :

*On their summits they bear up the sleepless Flame;*
*Dreaming of mysterious Beyond,*
*Transcendent of the paths of Fate and Time,*
*They point above themselves with index peaks*
*Through a pale-sapphire ether of god-mind*
*Towards some gold Infinite's apocalypse.*

**తమ శిఖరములపైనవి నిర్నిద్రజ్వాలను ధరిస్తాయి**
**ఒక అద్భుతమైన పరముని గూర్చి కలగంటూ,**
**విధికాలముల మార్గముల నధిగమించి,**
**అవి తమ సూచికా శిఖరాలనూర్ధ్వదిక్కు జూపు**
**ఒక పేలవనీలాకాశపు దైవమనస్సు ద్వారా**
**ఒకానొక స్వర్ణానంతపు ఆవిష్కరణవైపు.**

మరణరహితజపాపుష్పమా? లేక, మరణరహిత జ్వాలయా? భక్తియోగమా? లేక, జ్ఞానయోగమా? అశ్వపతి ఒక నిశ్చితాభిప్రాయానికి రావటానికి ఎంతో సమయం పట్టలేదు. అటువంటి విభక్తపాక్షికప్రకాశం వానికక్కరలేదు. ఐనప్పటికిన్నీ, ఈ రెండు విధాల ఆదర్శస్వర్గాలు వానికి సుఖప్రదాలే. కనుక వీనిలో ఆనందాన్నీ, కాంతినీ, శక్తినీ, జీవాన్నీ, ప్రేమనూ అనుభవిస్తూ ఆతడక్కడ కొంత తడవు తచ్చాడుతాడు. కేవల జ్ఞానం చేత సాధించే పరముని దర్శనం కూడా అతనికి స్వీకార్యమే. "దేవదూతమార్గం" భక్తి. అది చేతన యొక్క సాహసాన్ని అర్థవంతం చేస్తుంది :

*A glorious shining Angel of the Way*
*Presented to the seeking of the soul*
*The sweetness and the might of an idea,*
*Each deemed Truth's intimate fount and summit force,*
*The heart of the meaning of the universe,*
*Perfection's key, passport to paradise.*

**ఒక వైభవోపేత కాంతిమన్మార్గదర్శి**
**అన్వేషకాత్మకు భావమాధుర్యబలముల జూపె,**
**సమస్త భవితసత్యానీకగాఢమూలంబు శిఖాశక్తియు,**
**విశ్వార్థహృదయంబు, పూర్ణత్వకుంచికయు,**
**స్వర్గప్రవేశాధికార పత్రమున్.**

కాని అశ్వపతి లక్ష్యం ఆ జపాపుష్పము, జ్వాల, ఈ రెండిటికి పరమునందున్నదేదో అది. కనుక "వాని వైభవశాసన" మునకు దూరంగా, ఆ జపాపుష్పజ్వాలల, భక్తిజ్ఞానాల, ప్రవృత్తి నివృత్తుల, అనేకము ఏకముంగలసి ఒక సుసంబద్ధ వ్యవస్థయైన ఆ స్వర్గాన్ని వెదుక్కుంటూ ముందుకు కదిలినాడు.

*Above the parting of the roads of Time,*
*Above the silence and its thousandfold Word,*
*In the immutable and inviolate Truth*
*For ever united and inseparable,*
*The radiant children of Eternity dwell*
*On the wide spirit height where all are one.*

**విడివడుతూన్న ఆ కాలిక మార్గాలకు పైన,**
**ఆ నిశ్శబ్దమునకు, దాని సహస్రవిధవాచకమునకు పైన,**
**నిర్వికారాలంఘ్య సత్యంలో**
**సదా ఐక్యమై, అవిభాజ్యమై,**
**సమస్తమేకమైన విశాలాత్మోన్నతిమీద**
**అనంతత్వపు కాంతిమత్సంతానము రాజిల్లు.**

❊ ❊ ❊

## 13వ సర్గ - మనోవ్యక్తిలో

అలసటలేక, ప్రపంచపు సమస్యలకు పరిష్కారాన్ని కనుగొనాలన్న ప్రగాఢ వాంఛతో, అశ్వపతి ఆ జపాపుష్ప, జ్వాలా ప్రదేశాలను విడిచి ముందుకు సాగి, అంతిమ శిఖరంగా కనిపిస్తూన్న ఆ ప్రదేశానికి చేరుకుంటాడు. ఈ ఏకమాత్రపాంథుని ఒక గాఢ నిశ్శబ్దం ఆవరిస్తుంది :

He stood on a wide arc of summit Space
Alone with an enormous self of Mind
Which held all life in a corner of its vasts.
Omnipotent, immobile and aloof,
In the world which sprang from it, it took no part...

**ఆతడొక శిఖరప్రదేశపు విశాల వృత్తఖండాన నిల్చె**
**నొంటియై ఒక అతిబృహన్మానసవ్యక్తితోడ**
**సర్వజీవంబునది తన విస్తారముల కోణాలనొకట దాల్చె.**
**సర్వశక్తి నిశ్చల పృథక్,**
**తత్సంభవ ప్రపంచమున అది పాత్ర వహించదయ్యె.**

ఒక్క ముహూర్తకాలం వానికి తన లక్ష్యాన్ని చేరినట్లు తోచింది, తాను కోరిన గమ్యస్థానాన్ని చేరినట్లనిపించింది. ఇప్పుడంతా అత్యంత ప్రశాంతంగానూ యే అలజడిగాని లేకుండా ఉన్నది. తానింకమీదట యేమాత్రమూ శ్రమించవలసిన అవసరం లేదని అతనికి తోచింది. "నిన్ను నీవు తెలిసికో" (konw thyself) అన్నది సనాతన శాసనం. అశ్వపతి సరిగా అదే చేసినాడనిపిస్తుంది. బహుశః, మానవజాతి తన అవిజ్ఞాత పద్ధతిలో అందుకోసమే కృషిచేస్తూన్నదా? ఏ అవసరాలుగాని యే ప్రశ్నలుగాని లేక యే లక్ష్యంగాని లేని ఒకానొక భావస్థితియా? సమత్వం అన్నది యోగం కాని ఈ సమత్వం సర్వశః అటువంటిదే!

It gave no head to the paeans of victory,
It was indifferent to its own defeats,
It heard the cry of grief and made no sign;
Impartial fell its gaze on evil and good,
It saw destruction come and did not move.
An equal cause of things, a lonely seer
And Master of its multitude of forms,
It acted not but bore all thoughts and deeds,

*The witness Lord of Nature's myriad acts*
*Consenting to the movements of her force.*
*His mind reflected this vast quietism.*

**విజయఘోషలనది సరకుసేయలేదు,**
**స్వీయాపజయముల కుదాసీనత వహించె,**
**శోకాక్రోశముల విని ప్రతిస్పందించకుండె;**
**శ్రేయాశ్రేయములపై దృష్టి నిష్పక్షపాతమాయె,**
**విధ్వంస పరిక్రమణంబు గాంచి నిశ్చలముగ నిల్చె.**
**సర్వవస్తుసమహేతువు, ఒక ఏకాంతద్రష్టయు**
**తద్బహుళ స్వరూపముల కేకైక ప్రభువు,**
**తా నవిస్పందక సర్వభావక్రియా వాహకుడు,**
**ప్రకృతివౌ అగణితచేష్టలకు సాక్షిప్రభువుగ**
**నామె బలముల కదలికలకు తలయూచు సమ్మతిన్.**
**వాని మనస్సీ విశాల వైరాగ్యమున్ ప్రతిఫలించె.**

శ్రీ అరవిందులిప్పుడు, ఈ "మనోవ్యక్తి" ఈ విశాల నిశ్శబ్ద ప్రవేశం చేయటం మానవుని భవితవ్యమును ప్రణాళికాబద్ధం చెయ్యటంకోసం అవసరమవుతుందని వివరిస్తారు. గాఢ నిశ్శబ్దంలోనే బలమూ, అవగాహనా, శక్తీ, వీని సాధనకనుకూలత లభిస్తుంది. సావిత్రి ఎల్లవేళల తనలో నొక గాఢ నిశ్శబ్దాన్ని ధరించి యున్నదని శ్రీ అరవిందులు పదేపదే వర్ణిస్తారు.

*The genius of titanic silences*
*Sleeping her soul in its wide loneliness*
*Had shown to her her self's bare reality*
*And mated her with her environment.* (Book I, canto 2)

**భూమనిశ్శబ్దభూతంబు**
**తనవిశాలైకాంతమున దన ఆత్మను ముంచివేసి**
**తనకు దా దర్శింపజేసె దన వ్యక్తి యాథార్థ్యమున్**
**తన పర్యావరణంబుతో దాని జతగూర్చె.** (కాండ1, సర్గ 2)

ఈ మనోవ్యక్తిని ప్రవేశించునప్పటికి అశ్వపతి స్థితియు ఇట్టిదే, ఏలన ఈ విస్తార నిశ్శబ్దము తాత్త్వికుని ఆధారము (the thinker's base). ప్రాపంచిక విషయాల కర్ణభేదకమైన అపశబ్దాలలో చిక్కినపుడు మనం విస్పష్టంగా ఆలోచించలేము. ప్రపంచాన్నీ మన చర్యలనూ

మనం విశదతరంగా తెలిసి న్యాయనిర్ణయం చెయ్యటానికి అనువుగా మన నిత్యజీవితాలలో మనం మనకోసం కొంత అవకాశాన్ని యేర్పఱుచుకోవాలి. మనం మన మనస్సులను నిశ్చలం చేసి, దానిని దానిలో తిరుగాడే పరస్పర విరుద్ధభావాలనుండి ముక్తం చేయగలిగితే, స్పష్టతతో మాట్లాడేందుకున్నూ జాగ్రతతో కార్యక్రమాన్ని రూపొందించికోగలందులకూ సులభమవుతుంది. ఆ కారణంగానే అశ్వపతి తన అన్వేషణ చరమదశను చేరుకోలేదు. నిజానికి అతడు ఒక మహాన్వేషణలో మొదటి మెట్టుపై ఉన్నాడు. అతనికీ జ్ఞానం కలిగినంతనే, నిర్వాణనిశ్శబ్దంలోని ఈ తాత్కాలిక మూర్ఛాస్థితి నుండి ముక్తుడవుతాడు.

మరొక్కసారి ఆతడు ధరిత్రీచేతనలో ఉన్నాడు. దానితో అది అనిశ్చితస్థితులను, సంశయాలను, దుఃఖాలను తెస్తుంది. ఈ కలహాలూ తపస్సులతో ఆతడు పుడమిపై మానవుని విధిని మార్చలేకపోయినాడు. పుడమిపై మానవజీవితపు పరిమితులకు సమాధానమేమీ కనుగొనబడలేదు.

వాని యోగానికేమి మూల్యం? లేక, ఆమాటకొస్తే, మానవుని ఈ ప్రయాసలన్నిటికీ యేమి లాభం? మూలసమస్య అపరిష్కృతంగా ఉండిపోతే, ఈ చింతనల కేమి ప్రయోజనం?

*All the ideas in its vast repertory*
*Were like the muttering of a transient cloud*
*That spent itself in sound and left no trace.*
*A frail house hanging in uncertain air...*

**తన విశాల కోశాగారానగల భావాలన్నీ**
**ధ్వనిలో తననుదాకోల్పోయి రేఖామాత్రమైన మిగులని,**
**ఒక అశాశ్వతమేఘ నిర్ఘోషలవలె నున్నవి.**
**అనిశ్చితవాతంలో లంబమానమైన ఒక దుర్బలగృహం.**

మానవజాతి అంతటికీ గల సమస్యలకు “మనోవ్యక్తి”ని చేరుకున్న ఒక వ్యక్తికి తథ్యమైన ఈ విశాల ప్రశాంతి సమాధానం కాదని అశ్వపతికి అర్థమయింది.

*Deep peace was there, but not the nameless Force :*
*Our sweet and mighty Mother was not there*
*Who gathers to her bosom her children's lives,*
*Her clasp that takes the world into her arms,*
*In the fathomless rapture of the Infinite,*
*The Bliss that is creation's splendid grain*

*Or the white passion of God-ecstasy*
*That laughs in the blaze of the boundless heart of Love.*

**గాఢ ప్రశాంతి కలదు, కాని అట నామరహితశక్తి లేదు:**
**తన సంతతి జీవితాల హృదయాలకు హత్తుకొనే**
**మన మధురశక్తిమతీమాత అచట లేదు,**
**అనంతత్వపు అగాధానందములో**
**తన కౌగిలిలోకి ఆమె ప్రపంచాన్ని స్వీకరిస్తుంది,**
**సృష్టియొక్క వైభవబీజమైన ఆనందం**
**లేక భగవదానందపు స్వచ్ఛభావం**
**అసీమిత ప్రేమ హృదయ ప్రకాశంలో హసించు.**

మానవుని విధి సమస్యను సజ్జీకరించటానికి అశ్వపతికి "మనోవ్యక్తి కంటె మహత్తరచిత్తం" ("a greater spirit than the self of Mind") యొక్క ఆవశ్యకత ఉన్నది. ఎందుకంటే ఈ సమస్య అక్షోభ్యమైన "బృహన్మృత్యుస్రష్ట" (huge creator Death) కంటె తక్కువేమీ కాదు. కాని ఈ మహత్తర చిత్తాన్ని తానెక్కడ పొందగలడు? తన వత్సలను రక్షించగల ఏకైక మాత? ఇప్పటివరకు, రెండే రెండు వాస్తవికతలున్నా యనిపిస్తుంది. ఆత్మయొక్క నిశ్శబ్దవిస్తారాలు పైన, క్రింద మృత్యువు గుప్పిట అహితముల సాంకర్యము. ఇదేనా సృష్టిని గూర్చిన సంపూర్ణసత్యం? ఇదే సమస్తమయితే, ఇందుకోసమే మానవుడుద్దేశింపబడినట్లయితే, ఇది సృష్టికర్తయొక్క అర్థరహితమైన పరిహాసంకాక మరేమిటి? అశ్వపతి మనస్సులో లెక్కలేనన్ని ప్రశ్నలు సుడిగుండంలాగ తిరుగుతూన్నవి, గాఢమైన మనోనిశ్శబ్దము. ఆకులీకృత మృత్యుజాలముల మధ్య నాతడు ఉక్కిరిబిక్కిరిగా ఉన్నాడు. "ఉనికి యొక కారాగారం, మృత్యువు విడుదల." ("To be was a prison, extinction the escape.")

❊ ❊ ❊

## 14వ సర్గ - ప్రపంచాత్మ

సాధారణ మానవునికి ఇప్పటికీ అజ్ఞాతంగా ఉన్న చేతనాతలాలనాక్రమించే అశ్వపతి యోగాన్ని అనుసరించటం చాలా కష్టమన్నమాట నిజమే. అయినప్పటికి, భారతీయ యోగులు పదే పదే అటువంటి ప్రయాణాలను చేపట్టియున్నారు. ఉదాహరణకు, పతంజలి, వాని పరంపర. తమిళదేశానికి చెందిన సిద్ధులు. వారి దర్శనాలను వ్రాసి

ఉంచటానికి వారు చేయగలిగినంత చేసినారు. ఏదెట్లాగైనా, ఈ గహనప్రయాణం స్వభావతః ఆంతరంగికం, అంతర్ముఖం కనుక, దానిని వర్ణించి చెప్పటానికి పదజాలం సమస్యాత్మక మవుతుంది. అత్యున్నతమైన గౌరవంతో ఈ యోగమార్గాన్ని స్వీకరించకపోయినట్లయితే, ఎవరైనా సరే విజ్ఞాన సంధ్యాచ్ఛాయలోనే ఉండిపోయే అవకాశం ఉంటుంది. శ్రీ అరవిందులు తామెన్నుకొన్న భాషవలన లేఖనంలో మరింత కష్టం. ఆంగ్లభాషకు ఆధ్యాత్మిక పదజాలం ఉండే చరిత్రలేదు. శ్రీ అరవిందులు తమ పారిభాషికపదజాలాన్ని తామే సృష్టించుకోక తప్పదు. ఈ ప్రయత్నంలో వారెంతటి ఘనవిజయాన్ని సాధించినారో చూస్తే మహదాశ్చర్య మవుతుంది.

అశ్వపతి అన్ని మార్గాలూ మూసుకుపోయినట్లున్న స్థితికి చేరుకున్నట్లు తోస్తుంది: "ఉనికియొక కారాగారం, మృత్యువు విడుదల" (*"To be was a prison, extinction the escape"*) తనకింక ఎటువంటి భయమూ లేదు కనుక ఆతడు ధైర్యంగా గాఢతర ధ్యానంలోనికి ప్రవేశిస్తాడు. ఇప్పుడొక నిష్క్రమణ మార్గమున్నది. అది స్వగృహాగమనం వంటిది. విచిత్రమైన ఆ నూతన ప్రదేశంలో అతనికి భయం కలుగలేదు. ఎందుకంటే, తల్లిని చూసి భయపడేదెవరు?

*In a far-shimmering background of Mind-space*
*A glowing mouth was seen, a luminous shaft ;*
*A recluse-gate is seemed, musing on joy,*
*A veiled retreat and escape to mystery.*
*A way from the unsatisfied surface world*
*It fled into the bosom of the unknown,*
*A well, a tunnel of the depths of God.*

**మనోదిగంతరసుదూరస్ఫురన్నేపథ్యమున**
**ఉజ్జ్వలద్వక్త్ర మొక ప్రకాశమానకాండంబు చూడనయ్యె;**
**ఒక వివిక్త కవాటమో యన, హర్షచింతాయితమై,**
**ఒక పరిచ్ఛన్నైకాంతస్థలము, అద్భుతత్వదిక్పలాయనము.**
**అసంతృప్తోపరితల ప్రపంచమునకు దూరముగ**
**అది అవ్యక్తత్వహృదయాంతరములోనికి,**
**ఒక కూపమొక దైవాఖాతకుల్యలోనికింబారె.**

ఆధ్యాత్మికభావాలపై మన మనస్సును నిల్పే ప్రయత్నంలో శ్రీ అరవిందులు హైఫన్ (-, hyphen) ను ఉపయోగించినారు : *far-shimmering, Mind-Space, re-*

cluse-gate. దృశ్యమానము అయినను ఒక ఆధ్యాత్మిక భావస్థితి, చివరకు అశ్వపతికి తాను అంతరంగంలోనికి సాగుతూ దూరాన్నుండి వస్తూన్నట్లు ధ్వనులను వినే తరుణంలో ఒక అవకాశమున్నది. ఆ ధ్వనులు, పక్షిగానం వలె, అలిఝంకారం వలె, మందిరఘంటా రావం వలె, లేక సాగరవీచికా ఘోషవలె, హర్షాకారంగా ఉన్నవి. ఇక్కడ హృదయసంతాపాలకు, బాధలకు, లౌకిక జీవితంలో వలె తావుండదు. ఇక్కడంతా దివ్య ప్రసన్నత మాత్రమే ఉన్నది. ఇక్కడ ఎవరైనా దాదాపు దివ్యత్వాన్ని స్పృశించగలదు! ఇది ప్రపంచాత్మ సీమ. ఇదంతా పరమాత్మ, సర్వం ఖల్విదం బ్రహ్మ, సమష్టి చేతన, పురుషుడు!

The silent soul of all the world was there :
A being lived, a Presence and a Power,
A single person who was himself and all
And cherished Nature's sweet and dangerous throbs
Transfigured into beats divine and pure.
One who could love without return for love...

**నీరవ ప్రపంచాత్మ అచట ఉన్నది :**
**ఒక జీవజ్జీవము, ఒక సన్నిధి, ఒక శక్తి**
**ఒకే ఒక పురుషుడు వ్యష్టియు సమష్టియునై,**
**దివ్యము నిర్మలమునైన మార్జనగ రూపాంతరమందిన**
**ప్రాకృతిక మధుర భీకరస్పందనల ధరించెను.**
**ప్రతిఫలమాశించక ప్రేమించగలవాడు...**

లౌకిక జీవితంలో తగిలిన గాయాలు పూర్తిగా మానినట్లు ఎవరికైనా అనిపిస్తుందిక్కడ. ఇంతవరకు చీకటిగా ఉన్నదంతా ఇప్పుడొక దీప్తిమత్సన్నిధిగా మారిపోయింది, అబద్ధమైనదంతా సత్యంగా రూపాంతరం చెందింది. మనిషిని మనిషి నుండి వేరుచేసే అహంకార కంచుకం ఇక్కడ నిలువదు. ఇక్కడ నడిచేది ఆత్మభూమిపై, కలిసేది ఆత్మపదార్థాన్ని, లేచేది ఆత్మసీమలో, మునిగేది ఆత్మసంతోషంలో. ఇది ఆత్మానుభవము లేక బ్రహ్మానందము అనుదానికి సగోత్రీయము. భూమిపై తమ తమ శరీరాల వలన కర్మఫలాలవలన విభక్తమైన ఆత్మలన్నీ ఈ ప్రపంచాత్మలో ఒక సహర్ష సాంగత్యాన్ని అనుభవిస్తారు. ముక్తాత్మలున్నూ, కర్మశేషం వలన మరల "నవ్యజీవన సాహసకృత్యాన్ని" (the adventure of new life) స్వీకరించవలసిన వారున్నూ, ఇక్కడందరూ ఆనందైక్యమై ఉంటారు. తానున్నూ ఆత్మస్థితిలో ఉన్నాడు కనుక అశ్వపతి వారందరినీ కలిసి, మాట్లాడగలిగినాడు. నిజంగా ఇది "సృష్టికేంద్రం" (creation's cen-

tre). ఆత్మలు పరిపూర్ణతను చేరుకునేందుకు వేసే ఒక అడుగు మాత్రమే 'మరణం' అని అర్థం చేసుకోవాలి, అంటారు శ్రీ అరవిందులు.

*There they remould their purpose and their drift*
*Recast their nature and reform their shape.*
*Ever they change and changing ever grow,*
*And passing through a fruitful stage of death*
*And after long reconstituting sleep*
*Resume their place in the process of the Gods*
*Until their work in cosmic Time is done.*

**అక్కడ తమ ప్రయోజనాన్ని, ఆశయాన్ని**
**పునర్నిర్మించుకుంటారు వారు,**
**తమ స్వభావాన్ని పునః సృష్టించుకొని**
**తమ రూపాన్ని పునారూపించుకుంటారు.**
**వారు సదా పరివర్తనం చెందుతూ వృద్ధియౌతూంటారు,**
**ఫలవంతమైన మరణదశద్వారా సాగుతూ,**
**సుదీర్ఘమైన పునర్ఘటనాత్మక సుషుప్తి తర్వాత**
**దైవీయక్రమంలో తమ స్థానాన్ని పునర్గ్రహిస్తారు**
**విశ్వకాలంలో తమ కార్యం సంపన్నమయ్యేంతవరకు.**

జీవం ఈ దృశ్యమాన ప్రపంచంగా వ్యక్తం కావటం అన్న ఉద్యమాన్ని గ్రహించిన అశ్వపతి, "సృష్టికేంద్రం"తో సహ దీనినంతా సాధ్యం చేసే ఆ దివ్యత్వాన్ని అన్వేషిస్తూ ముందుకు సాగుతాడు. ఎందుకంటే, విశ్వాత్మ ఒక్కటి ఉన్నంత మాత్రాన సృష్టి జరుగదు. ఈ సర్వాత్మ లేక సర్వచేతన లేక చైతన్యాత్మ, శ్రీ అరవిందుల మాటల్లో, ప్రాకృతాత్మ ద్వారా ప్రవర్తింపవలసి ఉన్నది. కనుక ఇప్పుడశ్వపతి తన ప్రార్థన వినిపించటానికి ఆ శక్తియామలాన్ని అన్వేషిస్తూ సాగిపోతాడు.

*Along a road of pure interior light,*
*Alone between tremendous presences,*
*Under the watching eyes of nameless Gods,*
*His soul passed on, a single conscious power,*
*Towards the end which ever begins again,*
*Approaching through a stillness dumb and calm*
*To the source of all things human and divine.*

**ఒక నిర్మలాంతర్జ్యోతితమైన మార్గము పొడవున,**
**అతి బృహత్సాన్నిధ్యముల మధ్యనొంటియై,**
**నామరహిత దేవతానేత్ర సాక్ష్యమ్ము తోడ,**
**వాని ఆత్మ సాగిపోయె, ఏకైక చైతన్యశక్తిగా,**
**సదా పునరారబ్ధాంతము దిశగా**
**మూకనిర్వికారనిశ్చలత దాటి సాగుచు**
**మానుషదివ్యసమస్తమునకున్ మూలంబు జేర.**

ప్రాచీన యౌగిక సిద్ధానుభవముల వలన ప్రసిద్ధమైన పురుషుడు – ప్రకృతి భావం ఆంగ్లభాషలో సంపూర్ణసామర్థ్యంతో చెప్పబడింది. అంతేకాదు, ఈ ద్వంద్వ శక్తి పరమాత్మ నుండి యేర్పడిన రీతి కూడ.

*There he beheld in their mighty union's poise*
*The figure of the deathless Two-in-One,*
*A single being in two bodies clasped,*
*A diarchy of two united souls,*
*Seated absorbed in deep creative joy;*
*Their trance of bliss sustained the mobile world.*
*Behind them in a morning dusk One stood*
*Who brought them forth from the Unknowable...*

**వాని శక్తిమదైక్యతాసమతయందతడు గాంచె**
**నయ్యమరద్వాంద్వైకమూర్తిన్,**
**ఇరుమేనుల బెనసిన ఏకైక వ్యక్తి,**
**ఏకీకృతాత్మద్వయ ద్వంద్వప్రభుతన్,**
**ప్రగాఢసృజనాత్మకానందమగ్న స్థిరతన్;**
**తదానందసమాధి ఈ జగచ్చేతన న్నిల్పు.**
**ఉదయసంధ్యలో వారివెన్క నిలిచె నొకడు,**
**వాడెపో అవ్యక్తమునుండి వారికి జన్మనిచ్చె...**

అతని స్పృహలో మెఱిసే దివ్యమాత కన్నులను గురించి ఒక సూచనమాత్రం ఉన్నది. తనను ఉక్కిరిబిక్కిరి చేసిన ఈ పూర్ణానందాన్ని వర్ణించటానికి అతనికి మాటల్లేవు. ఆ కేవలునికి తనను తాను సమర్పించుకొని, "ఆమె పాదాలచెంత అచేతనంగా సాష్టాంగ పడెనతండు." (fell down at her feet unconscious, prone.)

❊ ❊ ❊

## 15వ సర్గ - మహత్తర విజ్ఞాన రాజ్యాలు

చివరకు, సృష్టియంతటికీ సజీవమూలమైన ఆ ఏకము, పరాశక్తి, జనని! కొద్దిసేపు అచేతనంగా ఉన్న తరువాత, అశ్వపతి తాను నిజంగానే మానుషప్రయత్నపు విభజనరేఖను చేరుకున్నానని గ్రహించినాడు, ఇక ముందంతా తాను పూర్తిగా ఆత్మసీమలో ఉంటానని తెలుసుకున్నాడు. పదార్థం, జీవం, మనస్సు, ఇవి తన వెనుక చాలాదూరాన వదిలి వేయబడినవి :

Out of the sphere of Mind he had arisen,
He had left the reign of Nature's hues and shades;
He dwell in his self's colourless purity.
It was a plane of undetermined spirit
That could be a zero or round sum of things,
A state in which all ceased and all began.

**మనోమండలం నుండి అతడు పురోగమించె,**
**ప్రకృతి వర్ణాల ఛాయల శాసనాన్ని వదిలినాడు;**
**తన వర్ణరహితచేతనాస్వచ్ఛతలో వసించినాడు.**
**అదియొక అనిశ్చిత చేతనాతలము,**
**అది శూన్యము కానోపు లేక వస్తువుల పూర్ణత్వసంజ్ఞ,**
**ఆ స్థితి యందె సర్వము విరమించె, సర్వమారంభించె.**

ఒక అద్వితీయానుభవం, తాను పరమాత్మతో సాంగత్యం నెఱపవలెననే లక్ష్యం గల యోగి మార్గమది. దీనిని సాధించే ముందు మిగత సాంగత్యాలన్నీ రాలిపోవలసినదే. రామాయణంలో, ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రంతో హనుమంతుని బంధించినాడని చదువుకున్నాం. హనుమంతుని రావణుని దర్బారుకు తీసికొని వెళ్ళగానే, రాజు కోపంతో వాని వాలాన్ని విరూపం చెయ్యమని ఆజ్ఞాపించినాడు. అంతట లంకావాసులు హనుమంతుని వాలానికి వస్త్రాలు చుట్టి జ్వాలగా వెలిగిస్తారు. కాని వారు వస్త్రాలు చుడుతూండగానే, ఆ బ్రహ్మాస్త్రం తన పట్టు విడుస్తుంది. అటువంటిదే పరమాత్మతో అనుసంధానం, పదార్థబంధాలను అది ఉపేక్షించదు. అట్లాగే జీవం, మనస్సు తన మార్గంలో అవరోధాలు కానివ్వదు. వేగంగా ఊర్ధ్వగతిలో సాగుతూ అశ్వపతి తాను చాలా తేలికపడినట్లు భావిస్తాడు, ఎన్నో యుగాల భారం జారిపోయినట్లు, తనను స్వేచ్ఛగా తేలికగా విడిచి పోయినట్లు : తనకు తెలిసిన దానిని సమస్తం ఆతడు వదిలిపెట్టి ముందుకు సాగినాడు. ఇప్పుడతడు అజ్ఞేయమైన ఆ సీమలలో ప్రవేశించటానికి తగియున్నాడు.

మనమెఱిగిన ఈ వ్యక్తప్రపంచపు వైభవాలు లెక్కలేనన్ని. సుబ్రహ్మణ్యభారతి గానం చేసినట్లు, చిత్తాన్ని అచిత్తంతో జతపఱచి ఆ ప్రభువు ఆనందకోటిని సృష్టించి యున్నాడు. అదట్లా ఉండగా, మున్ముందు వ్యక్తం కావలసినదాని వైభవాలు మన ఊహకు అందనివి. ఇంతవరకు వ్యక్తమైనది ఒక భాగం మాత్రమే : పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్య అమృతాం దివి. ఆ అవ్యక్త భాగపు మహత్త, తాను ఆ దిక్కు చూడగనే, అశ్వపతిని ఉక్కిరిబిక్కిరి చేసివేస్తుంది.

*Thence gazing with an immeasurable outlook*
*One with self's inlook into its own pure vasts,*
*He saw the splendour of the spirit's realms,*
*The greatness and wonder of its boundless works,*
*The power and passion leaping from its calm,*
*The rapture of its movement and its rest,*
*And its fire-sweet miracle of transcendent life,*
*The million - pointing undivided grasp*
*Of its vision of one same stupendous All,*
*Its inexhaustible acts in a timeless Time,*
*A space that is its own infinity.*

**తనదైన నిర్మలవిస్తారముల నంతర్దృష్టి నాత్మలో వీక్షించి,**
**ఒక అమేయాపేక్షతో అటనుండి దృష్టి సారించి**
**అతడు గాంచె ఆత్మసామ్రాజ్యవైభవమ్ము,**
**తన్మహత్త, తదసీమితకార్యవైచిత్రి,**
**తత్ప్రశాంత్యుత్ప్లావితశక్తి వృత్తులన్**
**తచ్చైతన్య విరామానందాతిరేకమున్,**
**తదగ్ని మధుర సర్వాతిరిక్తలోకోత్తర జీవమున్,**
**విభక్తకోట్యగ్రగ్రస్తమౌ**
**తదేకైక మహావిస్తార సమస్తదర్శనమున్,**
**కాలాతీతకాలగత తదవ్యయ కార్యములన్,**
**స్వకీయానంతత్వమౌ నొకసీమన్.**

ఇది మహత్తరవిజ్ఞాన సీమ. ఇక్కడ పరస్పరవైరుధ్యాలన్నీ సమసిపోతాయి. ప్రేమకు ప్రేమ లభిస్తుంది. ఎందుకంటే, ఇక్కడ ద్వేషచ్ఛాయకు తావులేదు. ఆనందం వ్యక్తమైతే, ప్రత్యానందంతో అది అధికమవుతుందే తప్ప దుఃఖానికి తావులేదు. ఇక్కడ ఏకమూ

అనేకమూ కలిసి కనిపిస్తాయి, ఎందుకంటే భావంలోనే ద్విధావిభజన లేదు. ఏ దుష్టబుద్ధికి గాని వినాశనాన్ని సృష్టించే అవకాశం లేదు కనుక, ఇక్కడ ప్రతి సృజనకార్యమూ కాంతికీ హర్షానికీ కారణం అవుతుంది. అశ్వపతికి కూడా, ఆరోహణ కష్టమనిపించదు. కారణం, చలనం సంఘర్షణ లేకుండా ఈ ఆత్మసీమలో సాగుతుంది, ఈ "సర్వాతిరిక్త సత్యసీమలలో" (regions of transcendent Truth) అతడు "కాలం యొక్క త్రిగుణీకృత చలనం" (Time's triple step.) (పదార్థపు జీవ మనస్సుల నిమ్నలోకాలు, అతిమనోలోకం, దివ్య సచ్చిదానంద లోకం, అనే ఈ మూడిటిగుండా), దీని చేత అతడు అయోమయంలోకి జారిపోడు. అతడు "మూల నాదసముద్రం" (the ocean of original sound) తరిస్తాడు.

యౌగికానుభవాలు ఉన్నతస్థాయిలో మానవభాషలోకి అనువదించటం సాధ్యం కాదు. ఎవరైనా సరే సంకేతాలూ, రూపకాలంకారాలూ, ఉపమాలంకారాలూ వాడక తప్పదు. అశ్వపతి యౌగికానుభవాలను ఆంగ్లంలో వర్ణించటానికి శ్రీ అరవిందులు సాంప్రదాయికంగా లభించినవాని సహాయంతో ఆ అనుభవవైశాల్యమూ గాఢత్వమూ మనకర్థమయ్యేట్లు చెప్పే ప్రయత్నం చేసినారు :

*Above him he saw the flaming Hierarchies,*
*The wings that fold around created Space*
*The sun-eyed Guardians and the golden Sphinx*
*And the tiered planes and the immutable Lords.*
*A wisdom waiting on Omniscience*
*Sat voiceless in a vast passivity;*
*It judged not, measured not, nor strove to know,*
*But listened for the veiled all-seeing Thought*
*And the burden of a calm transcendent Voice.*

**ఉజ్జ్వల పురోహితాధిపత్యముల నూర్ధ్వమున జూచె నతడు,**
**సృష్టిసీమను పొదువుకొనిన ఱెక్కలన్,**
**సూర్యాక్షులౌ రక్షకులను, సువర్ణమయ స్ఫింక్స్ ను**
**పంక్తీకృత తలములను, నిర్వికారప్రభువులన్.**
**సర్వజ్ఞతకుపచారముల్ జేయ నొక ప్రజ్ఞ**
**మూగవోయి, ఒక విశాల సహిష్ణుతలో నుండి పోయె;**
**అది నిర్విచక్షణ, అమేయ, అప్రయతితజ్ఞానశీలయై,**
**నిర్వికారసర్వాతిరిక్త వాణీ పల్లవి నవధరించె.**

అదెంత అస్పష్టమూ దూరస్థమూ అయినప్పటికిన్నీ, ఈజిప్టు దేశపు స్ఫింక్స్ (sphinx), అంతింతనరాని, అనిర్వచనీయమైన ఈ దివ్యసీమలో అశ్వపతికి కలిగిన ప్రతిస్పందనను గూర్చి ఒక భావరూపాన్ని కలిగిస్తుంది. ఈ స్ఫింక్స్ (sphinx) ఈజిప్టుదేశ పురాణాలలోని సూర్యదేవతకు సంకేతంగా భావించబడింది. అశ్వపతికి కలిగిన అనిర్వచనీయానుభవాన్ని వర్ణించటానికి ఈ పదం చాలు. ఎందుకంటే, ఆతడిప్పుడు ఆదిమ శక్తిక్షేత్రంలో ఉన్నాడు. తాను స్వయంగా ఆ శక్తిలో ఒక భాగమై ఉన్నాడు.

*In the kingdom of the Spirit's power and light,*
*As if one who arrived out of infinity's womb*
*He came new-born, infant and limitless*
*And grew in the wisdom of the timeless child;*
*He was a vast that soom became a Sun.*

**ఆత్మశక్తి కాంతుల ఆ రాజ్యంలో**
**అనంతత్వగర్భంలోనుండి వచ్చిన వానివలె**
**అతడు పునర్జన్మించి, శిశువై అనియతుడై వచ్చి,**
**ఆ కాలాతీత బాల ప్రజ్ఞలో వర్ధిల్లె;**
**ఆతడొక విస్తృతి, అచిరంబొక సూర్యుడాయె.**

అతనికింక చేయవలసియున్నది, అతీతమనోగ్రంథమును అధ్యయనం చేసి దాని సహకారంతో భూమిని రూపాంతరం చెందించటం. ఆతడదే చేయబోతూన్నాడు.

*A border of the empire of the Sun,*
*Attuned to the supernal harmonies,*
*He linked creation to the Eternal's sphere.*
*His finite parts approached their absolutes,*
*His actions framed the movements of the Gods,*
*His will took up the reins of cosmic Force.*

**ఆ సూర్యసామ్రాజ్యోపాంతభూమి యొకటి,**
**అయ్యూర్ధ్వమాధుర్యసంగతులకు శ్రుతిసేయబడి,**
**ఆతడు సృష్టిని నిత్యత్వసీమకు సంగతము జేసె.**
**వాని పరిచ్ఛేద్యభాగములు తమ అపరిచ్ఛేద్యముల చేరబోయె,**
**వాని చర్యలు దేవతాచేష్టితముల పచరించె,**
**వాని సంకల్పము విశ్వశక్తి పగ్గాల చేతబట్టె.**

❊ ❊ ❊

## 3వ కాండ - దివ్యమాతృకాండం

## 1వ సర్గ - అజ్ఞేయ మార్గణం

ధ్యానం ద్వారా మనస్సు లోపలి సీమలలోకి అశ్వపతి ప్రయాణం సుదీర్ఘమైనది. మనస్సు సహకారంతో సాధ్యమైనంత విజ్ఞానాన్ని సంపాదించికొని, ఇప్పుడతడు మానవజాతి యొక్క ఆరోహణానికి మాత్రమే కాక, భౌతిక జీవితాన్ని రూపాంతరం చెందించటం కోసం ఆ పరముని శక్తి అవరోహణాన్ని ఆవశ్యకం చెయ్యటానికి కూడా ముందుండటానికి సంసిద్ధుడు. యోగం అతనిని నిర్మలునిగా చేసింది. అతడిప్పుడు సుఖంగా గతంలోకి ప్రయాణించ గలుగుతూన్నాడు, అంతేకాక భవిష్యత్ దృష్టి కూడా వచ్చి చేరినది. కనుక ఇంకా ఆతడు పొందవలసినదేమైనా ఉన్నదా?

వ్యక్తిస్థాయిలో నిర్దోషమైన మానవుడు శిల్పంవలె చెక్కబడినవాడు. కాని, ఆతడు మర్త్యత్వం నుండి ముక్తుడైనాడా? అదిగాక, సంఘర్షణతో సతమతమవుతూన్న మిగత మానవజాతి మాటయేమిటి? అయితే, ఒక వ్యక్తి నిర్దోషిత లోకాన్నంతా రక్షించగల్గునా? ఇది సంభవం కావాలంటే, ఈ నిర్దోషవ్యక్తి ప్రయత్నించవలె, ఎదిరించి నిలువవలె, అచంచలమైన ఏకాగ్రతతో బాధను సహించవలె. ఇది అశ్వపతి యోగంలో మూడవ భాగం. ఇప్పుడతడు ఆ నిర్వికారుని తలుపు తట్టటానికి ప్రయత్నిస్తాడు. అందువలన ఆ పరముని శక్తి అవతరించి, మానవుని మర్త్యత్వము, అజ్ఞానము అనువాని బారినుండి రక్షించటం సంభవం. కాని వానికా నిర్వికారశక్తిని గురించి అది అజ్ఞేయమని తప్ప మరేమీ తెలియదు! అవును, అది అజ్ఞాతం కనుక అజ్ఞేయం. కనుక సాహసకృత్యం మొదలై, ఆ అజ్ఞేయశక్తి ఆ యాత్రికుని ఎట్లా ఆశపెట్టి నిరాశపరుస్తుందో అన్నది కూడ ఆకర్షణీయమే :

*Near, it retreated; far, it called him still.*
*Nothing could satisfy but its delight :*
*Its absence left the greatest actions dull,*
*Its presence made the smallest seem divine.*
*When it was there, the heart's abyss was filled;*
*But when the uplifting Deity witdrew,*
*Existence lost its aim in the Inane.*

**చేరువనుండియే దూరము బారునది;**
**దూరము బారియు చేర రమ్మని పిలచు.**
**తృప్తి నివ్వదు దాని హర్షము గాకేదియు:**

**అది లేని తరి మహత్కార్యముల్ నిష్ప్రభములు,**
**దాని ఉనికిచేత అల్పమున్ దివ్యమగును,**
**అది యున్న తరి హృదయాఖాతము నిండు;**
**ఉద్ధరించు దేవత నిష్క్రమించినవేళ,**
**ఉనికి లక్ష్యము శూన్యమున నడగు.**

గోదాదేవివంటి మార్మికుల జీవితాలలో ఈ అనుభవం మాటిమాటికి కనబడుతుంది. ఆ సన్నిధి జీవితాన్నంతా రవికాంతితోనూ అమృతంతోనూ నింపే సమయాలున్నాయి. కాని అటువంటప్పుడే వస్తుంది ఆత్మ నావరించే కటిక చీకటి రాత్రి. అప్పుడు వర్తమానాన్ని గురించి, భవిష్యత్తును గురించి నిరాశ హృదయాన్ని పట్టివేస్తుంది. అయినాసరే, హృదయం అన్వేషణ నుండి విరమించదు! ఒకవేళ దాని పర్యవసానం నిశ్శంకగా ఉన్మూలనమే అయినప్పటికిన్నీ, ఉద్బుద్ధహృదయం ఉజ్జ్వలమైన గతస్మృతుల తో చీకటి కూడ వెలుతురే అని గ్రహిస్తుంది. అశ్వపతి ఇదే మనఃస్థితిలో ఉన్నాడు. ఈ భౌతిక ప్రపంచావధి దాటి అతడు అడుగు వేసినాడు. ఇది వర్ణరూపసుఖాన్నిచ్చేది. ఇంక ఇప్పుడతడు ఉనికిలేని నిర్వాణంలో మునుగుతాడా? కాని తానెఱిగిన సుఖాలనన్వేషించ డతడు, అజ్ఞాతంలోనికి అడుగువేస్తాడు. ఇది ఒక దివ్యమైన ద్యూతం!

*Transcending every perishable support*
*And joining at last its mighty origin,*
*The separate self must melt or be reborn*
*Into a Truth beyond the mind's appeal.*
*All glory of outline, sweetness of harmony,*
*Rejected like a grace of trivial notes,*
*Expunged from being's silence nude, austere,*
*Died into a fine and blissful Nothingness.*

**నశ్యమైన సాహాయ్యములన్నిటి నధిగమించి,**
**నిజ బలవన్మూలము నెట్టకేలకు జేరి,**
**ప్రత్యగాత్మ కరిగిపోవలె లేదా జన్మించవలె మరల**
**మనః ప్రమాణమున కావలి సత్యములోనికి.**
**సమస్తాకారవైభవము, సంయోగ మాధుర్యము,**
**అకించిత్కరస్వరశ్రీవలె నిరాకృతమై,**
**జీవుని నగ్ననిష్ఠుర మౌనంబు నుండి విలుప్తమై,**
**ఒక పరమానందపూర్ణాసత్తులోన మడిసె.**

అశ్వపతి ప్రవేశించిన ఈ beyond 'ఆవలి'దేమిటి? మానుషోహ దానిని భావించలేదు, దాని రూపాన్ని వాచ్యము చేయనూలేదు. ఇక్కడ రూపములేదు. ఇంతదనుక చోదక శక్తిగా నిల్చిన 'ఆత్మ' (self) సైతము ఈ బృహదజ్ఞేయములో తననుదా కోల్పోయినది. అక్కడొక విస్తారమున్నది, ఒక అనంతత్వభావన, ఒక కాలరాహిత్యము. అది నిశ్చయముగా అవాఙ్మానసగోచరము!

అజ్ఞేయాన్ని గురించిన ఈ వర్ణన సత్యమైనట్లయితే, శ్రీ అరవిందులు అశ్వపతి ముఖతః దానిని వర్ణించటమెట్లా సాధ్యమయింది? ఇక్కడే మార్మికత చేయూత అవుతుంది. ఇక కవి విశేషాధికారం, అనిర్వాచ్యమైన దానిని సంకేతరూపాలతో వర్ణించటం అవుతుంది. ఆ వర్ణన పూర్తిగా సంతృప్తికరంగా ఎన్నటికి ఉండకపోయినా సరే : శ్రీ అరవిందులు తమ శిష్యుడొకరికి ఇంచుక హాస్యస్పర్శతో ఇట్లా వ్రాసినారు :

"మార్మిక కవి తానేది అనుభవించినాడో, తనలో లేక ఇతరులలో లేక ప్రపంచంలో చూచినాడో దానిని తాననుభవించినట్లు, చూచినట్లు లేక భావించినట్లు యథాతథంగా మాత్రమే చెప్పగలడు. ఇది నిశిత దృష్టితోనే, దగ్గరి సంబంధం ద్వారానో లేక పోలిక ద్వారానో జరుగుతుంది. ఇక దానిని అర్థం చేసికొనటం, చేసికొనకపోవటం లేక అపార్థం చేసికొనటం అన్నది సాధారణ పాఠకుని గ్రహణశక్తికి వదిలివేయవలసినదే."

శ్రీ అరవిందులు స్వయంగా, ఒక యోగి విశ్వాసం వెన్నుదన్నుతో, ఈ అజ్ఞాత భయాన్ని అనుభవించినాడు అన్న విషయాన్ని వారి సోనెట్స్ (sonnets) లో ఒకటైన ఈ దిగువ కవిత నుండి గ్రహించవచ్చు.

(సోనెట్ (sonnet) అన్నది పదునాలుగు పంక్తుల ఒక పద్యవిశేషం. ఇందలి రెండు రకాలలో శ్రీ అరవిందులిక్కడ షేక్స్పిరియన్ (shakespearien) లేక ఇంగ్లీష్ సోనెట్ ఛందాన్ని అనుసరించినారు.)

*I made an assignation with the Night;*
*In the abyss was fixed our rendezuous:*
*In my breast carrying God's deathless light*
*I came her dark and dangerous heart to woo.*
*I left the glory of the illumined Mind*
*And the calm rapture of the divinised soul*
*And travelled through a vastness dim and blind*
*To the grey shore where her ignorant waters roll.*
*I walk by the chill wave Through the dull shine*
*And still that weary journeying knows no end;*

*Lost is the lustrous godhead beyond Time,*
*There comes no voice of the celestial Friend,*
*And yet I know my footprints' track shall be*
*A pathway towards Immortality.*

**నిశీధితో నే నొక అభిసారమేర్పరచుకొంటి;**
**అయ్యగాధబిలము మా సమాగమ సంకేతితస్థలి :**
**హృదయాన దేవుని అమరజ్యోతిని దాల్చి**
**ఆమెదౌ తామసభయావహ హృదయంబు నర్థించ వచ్చినాను.**
**దీప్తమానసవైభవంబును విడిచి,**
**దైవీయాత్మ నిర్వికారానందమున్ వీడి,**
**నిష్ప్రభాంధవిస్తారమును ప్రయాణించితి**
**ఆమె అజ్ఞానపయస్సులు బారు నప్పాండురతీరమునకు.**
**ఆ శీతల తరంగముల ప్రక్క, మందపంకము దారి సాగుదు**
**ఈనాటి కా అలసాలసయాత్రకంతంబు గానరాదు;**
**కాంతిమత్కాలాతీతదేవత తప్పిపోయె,**
**ఆ దివ్యమిత్రుని గొంతు వినగరాదు,**
**అట్లయ్యు ఏ నెఱుంగుదు నా పాదముద్రలబాట**
**అమరత్వముం జేర్చు కాల్నడయౌను మున్ముందు.**

అజ్ఞాతమనీ అజ్ఞేయమనీకూడా పిలువబడే దానిని ముఖాముఖిగా చూచినప్పుడు అశ్వపతి స్థితి సరిగా ఇట్లాంటిదే. అయినప్పటికీ, యోగి శిక్షణ విశ్వాసాలు చివరకు ఫలవంతమవుతాయి. ఈ అజ్ఞాతం రూపరహితం, చలనరహితం, వాగ్రహితం అన్నది నిజమే. కాని అశ్వపతి, ఆ పరముడు వాని తీవ్రాక్రందనకు సమాధానం ఇస్తున్నాడన్నట్లు, ఒక సాన్నిధ్యాన్ని అనుభవంచగలిగినాడు.

*A stark companionless Reality*
*Answered at last to his soul's passionate search :*
*Passionless, wordless, absorbed in its fathomless hush,*
*Keeping the mystery none would ever pierce,*
*It brooded inscrutable and intangible*
*Facing him with its dumb tremendous calm.*

**కేవల సహచరరహితతత్త్వమొకటి**
**ఎట్టకేలకు వాని ఆత్మదౌ తీవ్రాన్వేషణకు సమాధానమిడియె :**

**తీవ్రతారహిత, వాగ్రహితాగాధనిశ్శబ్దమున మునిగి,**
**ఎవరికేనాడైన దుర్భేధ్యమౌ**
**అద్భుతతత్వం బదట్టెయుండ,**
**దుర్గ్రాహ్య దురాలభమై చింతావ్యగ్రమై**
**అతిబృహన్మూకప్రసన్నతతో వాని కట్టెదుట నిల్చె.**

ఆ మహాయోగికి ఆ విధంగా ఆ అజ్ఞేయము అజ్ఞాతమనరానిదైనది.

* * *

## 2వ సర్గ - దివ్యమాతృపూజనం

**సావిత్రి**లో ఏవో కొన్ని సర్గలు బాగున్నాయనిగాని తమకు ప్రీతిపాత్రమనిగాని ఎవరికైనా అనిపించకపోవచ్చు. అదెట్లాగున్నా, ఈ సర్గ సాధకులకు ప్రత్యేకమైనదే. ఎందుకంటే, ఇక్కడ దివ్యమాత ఇహపరాలకు మధ్య మధ్యవర్తిగా ఒక చక్కని వర్ణన ఉన్నది. ఆత్మద్యోతనం లభించిన తరువాత కూడ విశ్రమించరాదని నిశ్చయించి అశ్వపతి అజ్ఞాతాన్ని ప్రవేశించినాడు, అజ్ఞేయాన్ని అన్వేషిస్తూ. సర్వమూ శూన్యంలో లీనమైనట్లు కనిపిస్తూన్న సమయానికే అశ్వపతికొక సాన్నిధ్యం అనుభూతమవుతుంది. అతనికింక పరిత్యక్తుడననే భావం కలుగవలసిన ఆవశ్యకత లేదు! ఆతడు తాను క్షేమమని భావించవచ్చు, స్థిమితంగా ఉండవచ్చు, అనంతంగా ప్రగాఢశాంతిలోని ఆనందాన్ని ఆస్వాదించవచ్చు.

కాని అశ్వపతికిది కూడ తృప్తినివ్వలేదు. ఎందుకంటే, ఆతడొక రాజు, మానవజాతికొక ప్రతినిధి. ఈ ప్రగాఢశాంతిని మానవజాతిమొత్తంగా ఆస్వాదిస్తే తప్ప ఒక్క వ్యక్తి పలాయనం వలన ప్రయోజనం యేముంటుంది? అదిగాక, ఒకవేళ మానవులందఱూ ఆ శాశ్వతశాంతిని పొందినప్పటికిన్నీ, జీవితం వలన ప్రయోజనమేమిటి? మానవజాతి ఒక నిరంతరప్రగతి మార్గంలో సాగవలె!

This too is Truth at the mystic fount of Life.
A black veil has been lifted; we have seen
The mighty shadow of the omniscient Lord;
But who has lifted up the veil of light
And who has seen the body of the King?
The mystery of God's birth and acts remains
Leaving unbroken the last chapter's seal,
Unsolved the riddle of the unfinished play...

**జీవన మార్మికమూలమున నిదియు సత్యమే.**
**ఒక అసితావగుంఠనము పైకెత్తబడియె;**
**సర్వజ్ఞుడౌ ప్రభుని బలవచ్ఛాయను చూచినాము;**
**కాని కాంత్యవగుంఠనము నెత్తి**
**ప్రభుని తనువెల్ల గాంచిన వాడెవండు?**
**దేవుని జన్మక్రియాద్భుతతత్త్వము శేషించు**
**గతాధ్యాయంపు అధికారముద్ర నవిచ్ఛిన్నముగ నుంచి,**
**అసమాప్తక్రీడాకూటప్రశ్నము నపరిష్కృతముగ నుంచి...**

అశ్వపతి యొక్క అచంచల విశ్వాసము ఆతడెన్నుకొన్న ప్రపంచరూపాంతరీకరణ లక్ష్యాన్ని ఈ క్షణాన, ఆతడు వైయక్తికముక్తిని పొందినప్పుడు, ఫలవంతం చేస్తుంది. ఆతని తపస్సు దివ్యమాతను గూర్చి, ఆమె ఇప్పుడాతనికి చాల సమీపస్థయైనది.

Across the silence of the ultimate calm,
Out of a marvellous Transcendence core,
A body of wonder and translucency
As if a sweet mystic summary of her self
Escaping into the original Bliss
Had come enlarged out of eternity,
Someone came infinite and absolute.
A being of wisdom, power and delight,
Even as a mother draws her child to her arms,
Took to her breast Nature and world and soul.

**చరమ శాంతిగత నీరవతాతీరాంతరాన,**
**అద్భుత సర్వోత్కృష్టతాసారగర్భంబునుండి వోలె,**
**ఆశ్చర్యవిస్పష్టతా శరీరమొకటి**
**స్వీయాత్మ మాధుర్యమార్మిక సారమొకటి**
**ఆద్యానందములోనికి పారివచ్చి,**
**అనంతత్వమునుండి విస్తరించి,**
**ఎవ్వరో అనంతుడు సంపూర్ణుడు వచ్చె.**
**ఒక ప్రజ్ఞాశక్తి హర్షసత్తా**
**ఒక తల్లి తన బిడ్డనాదట కౌగిట బొదివినట్లు,**
**ప్రకృతింబ్రపంచమునాత్మను బొదివె కౌగిట.**

శ్రీవిద్యోపాసనలో మహాత్రిపురసుందరిగా జేజేలందుకునే ఆమెయే శ్రీ అరవిందుని మాటలలో సాకారమవుతున్నది. ఈ దేవియే జ్ఞానశక్తి ఆనందరూపిణి. ప్రతి సాధకునికి కేవలం వైయక్తికానుభవంగా భాసించే విషయాన్ని మాటలుగాని సంకేతాలుగాని ఆవిష్కరించగలవా? ఆమె ఈ తావున మాతృరూపంగా అశ్వపతిని ఒక తల్లివలె మెల్లగా తన బాహు దండముపైకెత్తుకుంటుంది. ఒక హఠాదనుభవంలోని కుదుపులేదిక్కడ, కేవలం సంరక్షక స్పర్శ మాత్రమే. ఆ సాన్నిధ్యమొక "ఆశ్చర్యకర కిరణం" (surprising beam). అది సమస్తావాసం, వాని హృదయంలోనికొక స్వర్ణప్రకాశంగా "సమస్తాభిలషిత సచేతన వస్తుజాలమును" (touching through him all longing sentient things) ప్రసరింప జేసింది. రోగమరణాల జీవనాన్నధిగమించవలెనన్న మానవజాతి ఆశయాన్ని తానెఱిగి గుర్తించినట్లు ఇది దివ్యమాత సూచన అన్నది స్పష్టం.

నూత్నదృశ్యాలతో మనల్ని ఉక్కిరిబిక్కిరి చేసే ఆ సాన్నిధ్యాన్ని ఎవరైనా వర్ణించటం సాధ్యమా? ఆ "ఆనందమయాస్ఖలితశక్తి" (rapturous and unstumbling Force) ని వాచ్యము జేయటమెట్లా? మహాసరస్వతి దర్శనం కాళిదాసుని "మాణిక్యవీణాం" దండకానికి ప్రేరణ అయింది; పూర్ణసౌందర్యవతి పార్వతి ఆదిశంకరుని "సౌందర్యలహరి" రచనకు ఉత్ప్రేరక మయింది. సావిత్రిలో, అశ్వపతికి తన దర్శనంలో ఇంతమాత్రం స్పష్టమయింది; "ఆమె హస్తాలు అసహాయలై కాలనాగమూలమున్ మార్చగలవు." (Alone her hands can change Time's dragon base.) దివ్యమాత సహాయయై ఉండగా, విధి శిక్షాతీతం కాదు. నిర్దిష్టవిధి కంటె ఉన్నతశక్తి ఒకటున్నది. అవసరమైన ప్రతికారక చర్యలు చేపట్టటానికి వైయక్తికమైన వివేచనాధికారం కావలసినంత ఉన్నది. ఇది సక్రియం కావలెనంటే, ఆ పరమునియందు సంపూర్ణ విశ్వాసం ఉండాలి. మనమెవరికి శరణాగతి చేయవలెనో ఆ మూర్తిని దోషరహితమైన స్పష్టతతో శ్రీ అరవిందుల దివ్యకవిత ఆవిష్కరించింది :

*She is the golden bridge, the wonderful fire*
*The luminous heart of the Unknown is she,*
*A power of silence in the depths of God;*
*She is the Force, the inevitable Word,*
*The magnet of our difficult ascent,*
*The sun from which we kindle all our suns,*
*The light that leans from the unrealised Vasts,*
*The joy that beckons from the impossible,*
*The Might of all that never yet came down.*
*All Nature dumbly calls to her alone*
*To heal with her feet the aching throb of life*

*And break the seals on the dim soul of man*
*And kindle her fire in the closed heart of things.*

**ఆమె సువర్ణవారధి, ఆశ్చర్యపూర్ణవహ్ని.**
**అజ్ఞాతపు దీప్తిమత్ హృదయమామె,**
**ప్రభుని అఖాతములోని నీరవశక్తి;**
**శక్తియామె, అపరిహార్యవచనమామె,**
**అస్మదీయసంక్లిష్టారోహణాకర్షకము,**
**అస్మత్సూర్యసమస్తదీపక సూర్యుడు,**
**అవ్యక్తవిస్తారలంబమానజ్యోతి,**
**అకరణీయతనుండి చేసంజ్ఞతో బిల్చు సంతోషము,**
**నేటికింకను నేలపై జారని సమస్తశక్తి.**
**ప్రకృతి సర్వమామెకై మాత్రమే మౌనాన ఎలుగెత్తు**
**ఆమె పాదస్పర్శతో పీడ్యమాన జీవస్పందన శమింప,**
**అస్పష్టమానవాత్మపై గల ముద్రలు ఛిన్నమై**
**బద్ధవస్తుహృదయాంతరాగ్ని రగుల్చుగాత యనుచు.**

దేవీమాహాత్మ్యంలోని సాంప్రదాయిక ప్రార్థనలు సరిగా తెలియని క్రొత్త తరానికి ఈ పంక్తులు వ్యక్తీకరణ, వర్ణన, ప్రార్థన, రెండూ ఒకటే, భాషమాత్రమే వేరు. భారతేదశపు సనాతనధర్మ వైభవం అటువంటిది. పూజ, జపం, శిక్షణ, నియంత్రణలు, అన్నీ తంత్రంలో తరతరాలుగా సాధకులు అనుసరిస్తూన్నందుకు ప్రయోజనం అర్హుడైనవానికి దర్శనం లభించటమే. సంవత్సరాల తరబడి అశ్వపతి శ్రమించినాడు, ఆతడు కూడ సాధకుల పరంపరకు చెందినవాడే. ఆ సమయం వచ్చినప్పుడు, శాశ్వతంగా సర్వం మారిపోతుంది:

*This was a seed cast into endless Time.*
*A word is spoken or a Light is shown,*
*A moment sees, the ages toil to express.*
*So flashing out of the Timeless leaped the worlds;*
*An eternal instant is the cause of the years.*
*All he had done was to prepare a field.*

**అనంతకాలగర్భాన నిక్షేపించబడిన బీజమిద్ది.**
**ఒక పదము వాచ్యమై, లేక ఒక వెల్గు దర్శితమై,**
**ఒక క్షణము దర్శించు, వ్యక్తీకరింప నొక యుగము శ్రమించు.**

**కాలాతీతమునుండి లోకము లారీతి తటిద్వ్యక్తమాయె;**
**ఒక నిరంతరక్షణమె సంవత్సరాలకు కారణంబు.**
**క్షేత్రమేర్పరించుటె వాని కర్తవ్యమాత్రమాయె....**

అశ్వపతి ఉక్కిరిబిక్కిరైనాడు కాని ముందు కురికి సాఫల్యం పొందేందుకు గతశ్రముడైనాడు. దివ్యమాతతో ఆతని ఈ క్షణమాత్రముఖాముఖి సమాగమం వాని ఆధ్యాత్మిక సాహసయాత్రలో వాస్తవారంభమనదగిన ఒక గమ్యము. ఆతడామెకే శరణాగతి చేస్తాడు. స్వార్థరహితుడైన బిడ్డను యే తల్లియైన నిరాకరించదు. ఈ "వ్యథితప్రపంచ తిమిరానికి" (the darkness of the suffering world.) ఆమె తప్పక తన చికిత్సక స్పర్శ నందిస్తుంది.

❊ ❊ ❊

## 3వ సర్గ - ఆత్మనివాసము, నూతన సృష్టి

తన హృదయంలో ఉవ్వెత్తున లేచిన ప్రార్థనావీచికలతో ఉక్కిరిబిక్కిరై, అశ్వపతి తాను భవిష్యత్తులో యే మార్గాన సాగవలసియున్నదో అనుదానిపై ధ్యానం చేయనారంభించినాడు. దాటశక్యం కానట్లు కనిపించే కష్టాలు, నిరాశలు, మరణం ఉన్నప్పటికిన్నీ మానవజాతిని ముందుకు నడిపించిన బంగారు భావన "ఆశ" అన్నది. పరిణామంలో మనం ముందుకు సాగి భూమ్మీద దివ్యజీవనాన్ని సాధించాలనుకుంటే, మనం ఇప్పుడున్న స్థితిగతులను బట్టి నిరాశకు తావివ్వకూడదు. ఒక గొప్ప భవిష్యత్తుకు ఎప్పుడూ అవకాశం ఉన్నది. ఆ భవిష్యత్తును సాకారం చేయవలెనంటే, మానవునకొక అతీతశక్తి సహాయం అవసరం. ఇప్పుడు అశ్వపతి స్వయంగా తానొక ఆశామూర్తియై అటువంటి సాయం కోసం ఆ దివ్యమాతను ప్రార్థిస్తూన్నాడు :

In the unapproachable stillness of his soul,
Intense, one-pointed, monumental, lone,
Patient he sat like an incarnate hope
Motionless on a pedestal of prayer.
A strength he sought that was not yet on earth,
Help from a Power too great for mortal will,
The light of a Truth now only seen afar,
A sanction from his high omnipotent Source.

**చేరరానట్టి వాని ఆత్మనిశ్చలత్వములోన,**
**ప్రబలైకాగ్ర స్మరణార్థకేకాకి సహిష్ణువై**
**రూపుదాల్చిన క్షమయై నిశ్చలతనుండె నతడు**
**ప్రార్థనాపీఠమ్ముపై.**
**ఇంకను భూమి నంటరాని యొక శక్తినతడు వేడె,**
**మర్త్యబుద్ధికతీతమౌ శక్తి సాయమపేక్షించె,**
**సుదూరముననిపుడున్న ఒక సత్యకాంతి,**
**తన ఉన్నత సర్వశక్తిమన్మూలంబునుండి**
**ఒక వరప్రసాదమును.**

సమాధానం సులభంగా రాదని తెలిసిన విషయమే. సులభంగా లభించింది యేదైనా సరే గౌరవాన్ని పొందదు, లేక తగురీతిగా పోషించబడదు. భౌతికంగా అనంతక్షమ, నైపుణ్యం, ఉపకరణాలూ దానిని నిర్మించటానికెంతగా అవసరమో అంతకంటె విస్తారమూ దీర్ఘతరమూ అయిన తపస్సు ఆధ్యాత్మికంగా అవసరమవుతుంది. అశ్వపతి చాల జాగరూకుడై అడుగు వేయవలసి ఉంటుంది. చేతనలోని ఉన్నతతరస్థరాల ద్వారాలను సంక్షుబ్ధం చేయవలెననే తపనలో వానికీ ప్రపంచంతో బంధాలు సడలిపోరాదు. వాని తపస్సు వానికోసం కాదు, మానవజాతి కోసం. అందుచేతనే, సమస్త పదార్థమూ జీవమూ తన స్పృహలో సదా నిలిచి ఉండటానికి వానికొక విశ్వజనీన దృక్పథం ఉండటం ముఖ్యమయింది. అతడిప్పుడు ప్రపంచంతో తన బంధాలను నిల్పుకుంటూనే దాని రూపాంతరీకరణకు తానొక వాహకమై నిలవటంలో కృతకృత్యుడైనాడు. దీనినతడు తనలోని అహంకారమూలాలను పెకలించివేయటం ద్వారా సాధించినాడు. ఎందుకంటే, అహంకారాన్ని నిర్మూలించటం అంత సులభమేమీ కాదు. తమిళ సిద్ధసాహిత్యంలో 'అహందైకిజంగు', ('అహందైకిజంగు' అన్నదానిలోని జ తెలుగు ఉచ్చారణతో కాక తెలుగులోలేని, తమిళంలో ఉన్న, ఆంగ్ల ధ్వనిని (treasure, measure), ఈ ఆంగ్ల పదాలలో సూచింపబడిన ధ్వనిని పోలి ఉంటుంది.) అహంకారమూలం, అంటారు. వేళ్ళను ఓర్పుతో త్రవ్వితీయాలని ప్రయత్నిస్తూ, ప్రయత్నిస్తూ, ఒకప్పటికి తల్లివేరును చేరుకుంటాం. ఇప్పుడిక ఎవరైనా తనకున్న బలాన్నంతా ఉపయోగించి పెకలిస్తే తప్ప అది భూమిలోనుండి పూర్తిగా రాదు. శ్రీ అరవిందులిప్పుడు అహంకారనాశనంలోని ఆ చివరి ఘట్టాన్ని ఇట్లా వర్ణిస్తారు:

For the Inconscient too is infinite;
The more its abysses we insist to sound,
The more it stretches, stretches endlessly.

*Then lest a human cry should spoil the Truth*
*He tore desire up from its bleeding roots*
*And offered to the gods the vacant place.*
*Thus could he bear the touch immaculate.*

**ఏలన, అసంజ్ఞానము సైత మనంతమే;**
**తదఖాతముల గొలువ మనమెంత యత్నింతుమో,**
**అంతగా అనంతమున కది మరిమరి విస్తరించు.**
**కనుక మానుషాక్రందనము సత్యముంజెరుపకుండ**
**కోర్కెనాతడు దాని మూలముల్ నెత్తురోడబెఱికి,**
**తద్రిక్తస్థలిన్ వేల్పులకర్పణము జేసె,**
**ఆ రీతినాతడు తన్నిష్కలంక స్పర్శనూనె.**

ఆతడిప్పుడు కాంతికేవల శుద్ధాత్మ. కనుక అతీత శక్తితో మానవుని భవిష్యత్తులోనికి, మున్ముందు అతిమానసచేతన నతడు సాధించినవైనమును, చూడగలిగినాడు. మానవజాతని విభజించి ఖండఖండములుగ జేయు అహంకారమను పెంకును బద్దలుజేసినప్పుడు, అందరు సములై, సుఖులై దివ్యమార్గోన్ముఖులైన ఒక దివ్య ప్రజాస్వామ్యము అవతరించగలదు. ఇదంతా శ్రీ అరవిందుల భావనాప్రపంచం అనుకోండి, మరేమైనా అనుకోండి కాని, అశ్వపతి దర్శనం భవిష్యత్తును గురించి మన అందరిలోనూ ఆశను నింపుతుంది, ఉగ్రవాదులున్నూ మరొక కోటి సమస్యలు మానవుని ముట్టడిస్తే ఈనాడు ముట్టడించుగాక. ఆ భవిష్యత్తులో, ఆతడు దర్శించిన రీతిలో, మంచి చెట్టలు చేతులు వెనక్కి లాక్కోవు, ప్రేమతో సందేహం సాహచర్యం చేయ్యదు, మానవుడు వక్రమార్గాల్లో ప్రయాణించడు, జీవనయాత్రలో ద్యూతక్రీడకు తావివ్వడు. ఇది రూపాంతరీకరణ కంటె అధికతరమే : ఇది నూతనసృష్టి.

*There was no sob of suffering anywhere;*
*Experience ran from point to point of joy:*
*Bliss was the pure undying truth of things.*
*All Nature was a conscious front of God:*
*A wisdom worked in all, self-moved, self-sure,*
*A plenitude of illimitable Light*
*An authenticity of intuitive Truth,*
*A glory and passion of creative Force.*

**ఎక్కడనైన సగద్గదబాధామయరోదనలేదు;**
**అనుభవము అడుగడుగున హర్షమై పారె :**
**ఆనందము శుద్ధామరవస్తుసత్యమాయె.**
**సమస్త ప్రకృతి భగవత్ బోధాముఖమాయె:**
**ఎల్లరిలో స్వయంచోదకమై, ఆత్మవిశ్వాసమై,**
**నిరవధి ప్రకాశపూర్ణత్వమొకటి,**
**సహజోపలబ్ధసత్యాధికారమొకటి,**
**సృజనాత్మకశక్తివైభవోద్రేకమొకటి,**
**ఒక ప్రజ్ఞ సత్క్రియమై నిలిచె.**

భౌతిక పరివర్తన గురించి స్పష్టతలేదుకాని, శ్రీ అరవిందులు మనః పరివర్తన కలుగబోవుటను వర్ణించినారు. ఇక్కడ మనస్సు విస్తారంగా కలలు గనటమొకటే కాదు, ఆ కలలు సాకారమయ్యేట్లు కూడా చేస్తుంది. దాని మహద్భావాలను వెన్నంటి ఛాయలేవీ రావు, సాఫల్యాన్ని గురించి యే చింతా ఉండదు. వ్యర్థంగా ఒక్క మాట కూడా ఎవరూ మాట్లాడరు, కనుక అన్ని వాక్కులూ వేదవాక్కులై సత్యమే పలుకుతాయి.

*The world that ushers divine experience.*
*And the Ideas that crowd the Infinite.*
*There was no gulf between the thought and fact,*
*Ever they replied like bird to calling bird;*
*The will obeyed the thought, the act the will.*
*There was a harmony woven twixt soul and soul.*
*A marriage with eternity divinised Time.*

**దివ్యానుభవాన్ని వాక్ప్రకాశనం చేసే ఆ వచనం**
**అనంతత్వంలో క్రిక్కిరిసి నిండిన ఆ భావాలు.**
**భావయాథార్థ్యాల మధ్య యే అఖాతమూ లేదక్కడ,**
**సదా వారి సంభాషణ పిట్టకూతకు బదులు పిట్ట కూసినట్లై;**
**ఆలోచనకు సంకల్పము, సంకల్పమునకు చేత విధేయముల్.**
**ఆత్మకాత్మకు మధ్య అవిరోధ మల్లుకొనియె.**
**దివ్యత్వమందిన కాలమునకు అనంతముతో**
**నదియొక కళ్యాణ మగును.**

ఆ జీవితం ఎప్పటికీ అలసిపోనిది. అది ఒకవేళ చర్వితచర్వణమే అయినప్పటికిన్నీ, దాని అనుభవం మాత్రం నిత్యనూతన హర్షోద్రేకమే. అంతా ఆనందమే : **రసో వై సః!**

అయినాగాని, ఇక్కడసైతం ఆ రెండు నిషేధాలకూ అవకాశం ఉంటుందని గ్రహించాలి : "భౌతికవాది నిరాకరణ" "యోగి నిరాకరణ". ఈ నిషేధాలు ఇంతవరకు ఎప్పుడూ మానవజాతి ప్రగతిని నిరోధిస్తూనే ఉన్నాయి. ఆ కారణంగానే, ఆ రెండిటిని మనం తప్పించుకోవాలి; పదార్థము, ద్రవ్యమూ ఈ రెండిటి సహకారాన్నీ పొందాలి, నూతన సృష్టిని సాకారం చేసేందుకు. పరిణామ పరివర్తనశక్తి ఈ రెండు నిషేధాలూ నిషేధింపబడేవిధంగా శాశ్వత పరిష్కారం తప్పక సాధిస్తుంది.

*A new creation from the old shall rise,*
*A knowledge inarticulate find speech,*
*Beauty suppressed burst into paradise bloom,*
*Pleasure and pain dive into Absolute bliss.*
*A tongueless oracle shall speak at last,*
*the superconscient conscious grow on earth,*
*The Eternal's wonders join the dance of Time.*

**ఒక అధునాతన సృష్టి పురాతనము నుండి ఉద్భవించును,**
**అనిర్వాచ్యమైన ఒక జ్ఞానము భాషను కన్గొనును,**
**నియంత్రిత సౌందర్యము స్వర్గపుష్పముగ నుత్ఫుల్లమగును,**
**సంతోషము బాధయు విశుద్ధానందమున మునుంగు.**
**నాల్కలేని యొక భవిష్యవాణి పలుకు నెట్టకేలకు,**
**అతిచేతన భూమిపై సతర్కమై వృద్ధినొందు,**
**అనంతత్వపు అద్భుతముల్ కాలనాట్యాన జేరు.**

మానవజాతికి ప్రతినిధిగా, ఒక ఆధ్యాత్మిక శిఖరారోహణం చేసినవాడుగా, అశ్వపతి ఇప్పుడా పరముని వాగ్దానం కోసం, వచనం కోసం ఎదురు చూస్తున్నాడు.

* * *

## 4వ సర్గ - దర్శనము, వరదానం.

చివరికి మనం శిఖరాలు చేరుకున్నాం. అక్కడ భక్తుడు వ్యక్తిగతమైన సమాగమంలో తన ఆరాధ్యదేవతను ముఖాముఖిగా దర్శిస్తాడు. ఇక్కడ మనకు కనిపించే దృశ్యం పూర్తిగా వాస్తవం. ఎందుకంటే భక్తులు, మానవజాతి ప్రతినిధులు గతకాలంలో అనుభవించినదే ఇది. ఒక ఉదాహరణ సరిపోతుంది. రామానుజాచార్యుల వారి శరణాగతి గద్యను భక్తులు చాల ప్రీతితో చదువుతారు. ఎందుకంటే, ఆ దివ్యమాతతో రామానుజులకు

ఈ కాలపు సైకత తీరాన కలిగిన ముఖాముఖి దర్శనాన్ని మానస దర్శనం చేసి వారు ఆనందిస్తారు కనుక. భక్తుని ఆ పరమునివైపునకు ఆకర్షించే ఆ ప్రేమ (పరాభక్తి), ఆ భక్తునకు ప్రసాదించిన దర్శనము (పరజ్ఞానము), ఆ దర్శనము నుండి దూరం కావటానికి అశక్తత (పరమభక్తి) ఇందులో మనకు కనిపిస్తాయి. రామానుజులు ఈ సంయుతతత్వం ఎప్పటికీ విచ్ఛిన్నం కాకూడదని (అవిరతాస్తు మే) ప్రార్థిస్తారు. ఆ దివ్యమాత రామానుజుని వాత్సల్యంతో చూచి ఇట్లా అంటుంది : తథాస్తు. నీ ఆకాంక్షలన్నీ నెరవేరు గాక! (అస్తు తే తథైవ సర్వం సంపత్స్యతే). ఇంకా, ఆ దివ్యమాత ఇట్లా ఆతడు కోరినదంతా లభిస్తుందని నమ్మబలుకుతుంది. శ్రీరంగంలో సుఖంగా నివసించమని కోరుతుంది. (అథైవ శ్రీరంగే సుఖమాస్వ).

ఈవిధమైన ప్రీతికరమైన, ప్రముఖమైన తల్లి–బిడ్డల సంవాదాన్ని శ్రీ అరవిందులు ఈ సర్గలో మనకందించినారు. రామానుజుల విషయంలో వలెనే, అశ్వపతి హృదయమే రంగస్థలం, "ఆత్మశ్రవణసీమలు" (the listening spaces of the soul). ఇక్కడి ఆ దివ్యమాతృవర్ణనం, సాంప్రదాయిక శారీరక వర్ణనాశిల్పరీతిని కాకుండా, వైభవోపేతంగా ఉంటుంది :

The one he worshipped was within him now :
Flame-pure, ethereal-tressed, a mighty Face
Appeared and lips moved by immortal words;
Lids, wisdom's leaves, drooped over rapture's orbs.
A marble monument of ponderings, shone
A forehead, sight's crypt, and large like ocean's gaze
Towards Heaven, two tranquil eyes of boundless thought
Looked into man's and saw the god to come.

**వాని ఆరాధ్యదైవమిప్పుడు వానిలో నుండె :**
**జ్వాలాశుద్ధము, గగనకబరీ, బలవన్ముఖంబు**
**కన్పించె, పెదవుల్ కదలె నమర్త్యవచనాలతో;**
**ప్రజ్ఞాపత్రముల్ కనుఱెప్పలు ఆనందమండలాలపై వంగె,**
**మణిశిలా నిర్మిత చింతనాస్థూపమై వెలిగె**
**నొక ఫాలము, దృగ్గుహాగుహ, సాగరదృగ్విశాలమై**
**స్వర్లక్షితమై, అనంతయోచనా శాంతిలోచనద్వయంబు**
**మర్త్యుని లోనికింజూచె, చూచె భవితవ్యదేవతన్.**

ఆ దివ్యమాత వాక్కులను అశ్వపతి స్పష్టంగా తన ఆత్మలో విన్నాడు. ఆమెకు తన నియోగం తెలుసు సుమా! ఈ లోకంలో బాధ, మరణం అన్నవి అంతరించిపోవాలి, అన్నది ఆతని ఆకాంక్ష. అహంకారము, భౌతిక సంతోషాలు అన్న తన సాలెగూటిలో తానే బందీ అయిన మానవజాతి పక్షాన మాట్లాడటానికి అతడు వచ్చినాడు. మానవుడిప్పుడున్న స్థితిలో, మరణాన్ని జయించటానికి వలసిన దైవానుగ్రహాన్ని పొందగలిగినంత బలవంతుడు కాడు. అశ్వపతి వంటివారు కొందరు తపస్సు చేసి ముందకు సాగినారు, కాని అది చాలినంత కాదు. మానవుడు తాను తరువాత మరియొక అడుగు వేయవలసిఉన్నదని తెలుసుకున్నాడు. అది శుభపరిణామం అయినాగాని, అప్పుడే మరణాన్ని నశింపజెయ్యటాన్ని గురించి ఆలోచింపకూడదు. అశ్వపతి పూర్వం వలెనే తాను సాగిపోవాలి, తన స్వంత పూదోటను సమృద్ధం చేసికొనవలె, పరిణామ ప్రేరణ మిగత పని చేస్తుందని నమ్మి సాగవలె. అంతవరకు, వాని తపస్సు వృథా కాదు. తనకోసం ఆతడొక వరాన్ని కోరవలె :

*Only one boon, to greaten thy spirit, demand;*
*Only one joy, to raise thy kind, desire.*
*Above blind fate and the antagonist powers*
*Moveless there stands a high unchanging Will;*
*To its omnipotence leave thy work's result.*
*All things shall change in God's transfiguring hour.*

**కోరు మొక్క వరము త్వదాత్మోన్నతికై :**
**కోరుమొక్క హర్షము మానవోన్నతికై.**
**అంధవిధికిం బ్రతీపశక్తులకు పైన**
**ఒక నిర్వికారోన్నత సంకల్పమచంచలమై నిల్చు;**
**త్వదీయ కర్మఫలంబు నా సర్వశక్తిమత్తకు విడుము.**
**దైవరూపాంతరీకరణవేళ పరివర్తనము జెందునెల్ల.**

కాని ఇప్పుడతడు తన వంశం నిలవటానికొక కొడుకు కావాలని తపస్సు నారంభించిన ఆనాటి అశ్వపతి కాడు. వాని తపస్సు విశ్వజనీనమయింది. ఇప్పుడతని లక్ష్యం తనకోసమొక బిడ్డడు కాదు, విశ్వజనీనమైన పరివర్తనకోసం ఒక అవతారం కావాలన్నది. ఇతర లోకాలున్నాయనీ, మానవజాతి భవిష్యత్తుకు వేరే అవకాశాలున్నాయనీ, అతడు గుర్తించినాడు. మానవుడు కోట్ల సంవత్సరాలు వ్యధ చెందినాడు. ఇప్పుడా బాధలన్నీ అంతం కావలసిన సమయం వచ్చింది. అతనికీ భవిష్యత్తు ఇవ్వబడింది. 'ఆశ' అన్నది

ఇంకెంతకాలం పోషకంగా ఉండగలదు? నిశ్చయంగా అశ్వపతి కలగన్నది కేవలమొక గొప్ప భవిష్యత్తు కోసమేనా? కాదు కాదు?

*I saw the omnipotent's flaming pioneers*
*Over the heavenly verge which turns towards life*
*Come crowding down the amber stairs of birth;*
*Forerunners of a divine multitude,*
*Out of the paths of the morning star they came*
*Into the little room of mortal life.*
*I saw them cross the twilight of an age,*
*The sun-eyed children of a marvellous dawn,*
*The great creations with wide brows of calm,*
*The massive barrier-breakers of the world*
*And wrestlers with destiny in her lists of will,*
*The labourers in the quarries of the gods,*
*The messengers of the Incommunicable,*
*The architects of Immortality.*

**ఆ సర్వశక్తిమంతుని ఉజ్జ్వల మార్గదర్శకుల జూచితి**
**జీవంబు కడకు మరలు ఆకాశపుటంచుమీద**
**జననతృణమణిసోపానముల్ దిగి మూగి రాగ;**
**ఒక దివ్యసముచ్చయ వైతాళికుల్,**
**వేగుచుక్క పుంతల వెడలి వచ్చిరి వారు**
**మర్త్య జీవితపు నీషత్కక్షలోనికి.**
**వారొక యుగసంధ్యను దాటి రాగ నే జూచితి,**
**ఒక మహదాశ్చర్యకర సూర్యనేత్ర ప్రత్యూషసంతతి,**
**విశాల ప్రశాంత లలాటులౌ మహత్ స్రష్టలు,**
**ప్రాపంచిక ప్రాకారబలభేదకుల్,**
**తత్సంకల్ప నామావళిలోని నియతి నెదిరించు మల్లురు,**
**సురఖనీశ్రామికుల్, అబోధ్య సందేశవాహకుల్,**
**అమర్త్యత్వవాస్తు శిల్పులు.**

ఇది ఒక కవి దర్శనం, ఒక ద్రష్ట దర్శనం, శ్రీ అరవిందుల అనుభవం. జాగ్రత్తగా గతాన్ని పరిశీలించినట్లయితే, 'దర్శన'మే రాబోవు వాస్తవికతను ప్రకటించినట్లు తెలుస్తుంది. ఒక కళాకారుడు ఒక పెద్ద శిలను చూచి, దానిలో ఒక సత్పురుషుని మూర్తిని దర్శించి,

ఆ దర్శనాన్ని సాకారంచేసి ఆవిష్కరిస్తాడు. ఫలస్వరూపంగా, సహస్రవత్సరాలకు పైగా మనం శ్రావణబెల్గోలా వద్ద గోమతేశ్వరుని అరవై అడుగుల పూజ్య విగ్రహాన్ని చూస్తున్నాము. వేల సంవత్సరాల తరబడి వేనవేల మంది **రామాయణ మహాభారతాలను** చదువుతూ ఉన్నారు. కాని చాలా కొద్దిమంది మేధస్సులకు మాత్రమే ఒక **ప్రతిమా** నాటకం (భాసమహాకవి రచన), లేక, శ్రీ అరవిందుల **సావిత్రి** ని పోలిన ఒక మహాకావ్యం వ్రాయాలన్న మెఱుపులాంటి ఆలోచన వచ్చింది. అశ్వపతి ప్రార్థన యేమంటే, ఈ "అబోధ్యసందేశవాహకులు" (messengers of the Incommunicable.) అపవాదాలుగా ఉండిపోక, సిద్ధాంతసత్యం కావాలని. ఇదియొక మహత్ సంభాషణ. దివ్యమాత కరుణించి, తన అవతారాన్ని అశ్వపతికి వరప్రసాదంగా అనుగ్రహిస్తుంది :

One shall descend and break the iron Law...
Fate shall be changed by an unchanging Will.

**ఒక్క రవతరించి బలవచ్ఛాసనము భిన్నము జేయును...**
**ఒక నిర్వికార సంకల్పము విధిని మార్చివేయు.**

❊ ❊ ❊

## 4వ కాండము - జన్మం, అన్వేషణం

## 1వ సర్గ - జ్వాలాజననం, బాల్యం

భారతీయ న్యాయబుద్ధికి దివ్యుల అవతారముల జననమును బాల్యమును చిత్రించుట క్రొత్తకాదు. రాముడు, వాని సోదరులు జన్మించినప్పటి పరిస్థితుల చిత్రీకరణ మనమెఱిగినదే. విష్ణుపురాణమాదిగా ఎన్నో పురాణాలలో కృష్ణుని బాల్యమును, కౌమారమును, యౌవనమును గురించిన కథలెన్నో ఉన్నాయి. కాని సీత, రుక్మిణి, రాధ ఇత్యాదులను గూర్చి ఒక్క కథ కూడా లేదు. ఇది నిజంగా పరస్పర విరోధాంశమే, భారతీయ పురాతన సాహిత్యంలో కథానాయికలు శక్తివైభవాలతో ప్రకాశిస్తున్నారు, అన్నది. శ్రీ అరవిందులు ఈ ఖాళీని, సావిత్రి మానవరూపాన్ని సంతరించికొని దైవీవ్యక్తిగా ఎదగటాన్ని ఒక చక్కని వర్ణనాత్మక చిత్రంగా ఇవ్వటం ద్వారా భర్తీ చేసినారు. ఇందుమూలంగా శ్రీ అరవిందుల తత్త్వసిద్ధాంతమైన పరిణామం అన్నదానికి విధిగా ఫలరూపమైన వ్యతికరణం (involution) ఉంటుందన్నదాన్ని కవితాభాషలో వివరించటం కూడా సిద్ధించింది.

కాళిదాసుని మెచ్చే శ్రీ అరవిందులు ఈ సర్గారంభంలో ఒక అద్భుతమైన ఋతుసంహారమును ఆవిష్కరించినారు. మొదట వస్తుంది వేసవి, మహోష్ణంగానూ కనులు మిఱుమిట్లు గొలిపే విధంగాను; వర్షర్తువు ఒక యుద్ధరంగంగా చిత్రించబడింది :

Thick now the emissary javelins :
Enormous lightnings split the horizon's rim
And, hurled from the quarters as from contending camps,
Married heavens edges steep and bare and blind.

**"ఇప్పుడిక దట్టమైన వార్తావహకుంతముల్:**
**బృహత్తటిల్లతల్ క్షితిజరేఖాభేదకులై,**
**దిక్కులందుండి వైరి శిబిరాలనుండివోలె విసరె,**
**దురారోహనగ్నాంధ గగనాంచలముల కుద్వాహమయ్యె."**

శరదృతువు రాకతో, "ఒక ప్రశాంతి చేరువాయె భగవానుడు చేరవచ్చినట్లు" (a calmness neared as of the approach of God.) ఇక హేమంతము ఒక నిద్రాయుత కాలము. ఇక వసంతాగమము, సమస్తం రంగు రంగులే, అది పొదయైనా, మొక్కయైనా, వృక్షమైనా. కోయిల పాట, తెలతెలనౌ మామిడి పూత. "ప్రకృతియంతయు సౌందర్య మహోత్సవమునందె'' (All Nature was at beauty's festival.) అవతరణ కుశలరేఖాచిత్రమే:

*Answering Earth's yearning and her cry for bliss,*
*A greatness from our other countries came.*
*A silence in the noise of earthly things*
*Immutably revealed the secret word,*
*A mightier influx filled the oblivious clay.*
*A lamp was lit, a sacred image made.*
*A mediating ray had touched the earth*
*Bridging the gulf between man's mind and God's;*
*Its brightness linked our transcience to the Unknown.*

**ఆనందమునకై పృథ్వీస్పృహాక్రోశముల సఫలమొనరించుచు,**
**ఒక మహత్త మన సీమాంతరములనుండి వచ్చె.**
**లౌకిక వస్తుజాల నిఃస్వనములో నొక నీరవత**
**నిర్వికారత నావిష్కరించె తద్రహస్యవాణిన్,**
**ఒక శక్తితరాగమ మా విస్మారక మృత్తికన్ పూరించె.**
**ఒక దీప ముద్దీప్తమయ్యె, ఒక పవిత్ర మూర్తి సాకారమయ్యె.**
**ఒక మాధ్యస్థకిరణము పుడమి దాకె**
**మానుషదైవమానసాఖాతముపై వారధినిల్పె;**
**తత్ప్రభల్ మన అపరిచ్ఛేద్యత నజ్ఞాతముతో సంధించె.**

సావిత్రి జన్మించింది. అందరు శిశువులను పోలిన శిశువే, అయినా అప్పుడప్పుడామె తానెక్కడనుండి దిగివచ్చెనో ఆ మహద్గగనాల స్మృతిప్రయత్నంలో ధ్యానమగ్నమైనట్లు కన్పించింది. **సావిత్రి**లోని ఈ పంక్తులను చదివినప్పుడు మనకు శ్రీ అరవిందాశ్రమ మాత గుర్తుకు రాక మానదు : ఆమె తన బాల్యంలో అప్పుడప్పుడు ధ్యానమగ్నయై ఉండేది.

"ఆమె ఒక మెత్తలు జాలరులమర్చిన చేతుల కుర్చీలో ప్రశాంతంగా కూర్చొనటం అలవాటుగా ఉండేది. ఆ కుర్చీ ఆమెకోసమే ప్రత్యేకంగా చేయబడింది. ఆమె అలా ధ్యానం చేస్తూండగా ఆమెకొక గొప్ప వెలుగు మిఱుమిట్లు గొల్పుతూ ఆమె శిరస్సుపైకి దిగివచ్చినట్లు అనుభవం కలిగేది. అది ఆమె మెదడులో ఏదో అలజడి కలిగించేది. ఆ వెలుగు నిరంతరాయంగా వృద్ధి అవుతూన్నట్లు అనిపించేది. అది తనను పూర్తిగా ఆక్రమించివేస్తే బాగుండునని ఆమె కనిపించేది. హేతువాదియైన ఆమె తల్లికి ఆమెకు అటువంటి ఏకాంతతపట్ల గల ప్రవణత, ఆమె మనఃస్థితులలోని ఆతత తీవ్రత, అత్యంతానురాగమూ, చింతాకారణంగా ఉండేవి."

[ కె.ఆర్.శ్రీనివాస అయ్యంగార్, మాతను గురించి (On the Mother : the chronicle of a Manifestation and Ministry, 1994 edition, P.4.) ]

సావిత్రి యువతిగా పెరిగే సమయానికి ఆమె ప్రభాకిరణమన్న సంగతి స్పష్టమయింది. ఆమె చిన్న వయసులోనే అందమూ, మేధస్సూ, అభౌతికతా ఉన్న ఒక అద్వితీయవ్యక్తిగా కనిపిస్తుంది. సావిత్రిని చిత్రించటంలో శ్రీ అరవిందులు తమ కల్పనాశక్తిని క్రుమ్మరించి వర్ణనలు చేసినారు. ఆధిభౌతికలోకాలలోని (the divinities in the occult worlds) దేవతలు ఆమెకు విశ్వజనీనమైన భావాలు ప్రసాదించి ఆమెకు సృష్టి సమస్తం తన బంధువులే అనిపించటానికి దోహదం చేసి, ఆమె పెంపునకు తోడ్పడినారు :

Nothing was alien or inanimate,
Nothing without its meaning or its call.
For with a great Nature she was one.
As from the soil sprang glory of branch and flower,
As from the animal's life rose thinking man,
A new epiphany appeared in her.
A mind of light, a life of rhythmic force,
A body instinct with hidden divinity
Prepared an image of the coming god.

**ఏదియైనను అనాత్మీయమో నిర్జీవమో కాదు**
**తనదైన అర్థము ప్రయోజనమున్ లేనిదేది లేదు.**
**ఏలన ఆమెయొక మహత్ప్రకృతితో మమేకమాయె.**
**మట్టినుండి శాఖాపుష్పవైభవము జనించినట్లు,**
**బుద్ధిజీవుడు మానవుడు జంతుజీవితోద్భవుడైనట్లు,**
**ఆమెయందొక క్రొత్త తాపసి ఉద్భవంబందె.**
**ఒక కాంతి మేధస్సు, ఒక లయాన్వితశక్తి జీవంబు,**
**ప్రచ్ఛన్నదైవత్వసహితదైహిక సహజావబోధము**
**భవిష్యద్దేవతామూర్తినొక్కటి చికిలిచేసె.**

ఒక జాగరూకత గల బాలిక కనుక సావిత్రి, ఒక జాగరూకతగల సైన్యాధిపతి వలె, మెలకువగా “తన క్షేత్రము” ను (her field) కనిపెట్టి ఉంటుంది. ప్రాపంచిక దృశ్యాలు సుఖదుఃఖ సమ్మిశ్రితాలు కనుక బుద్ధుని పోలి, ఒక అరాజత్వ స్థితి ఉంటుంది. అందువలన “ఆలోచనాపరదృష్టి ఆమెలో మధుర గంభీర భావవృద్ధి గాంచె” (sweet and solemn grew her musing gaze.) సావిత్రి ప్రపంచ దుఃఖాలనే కాక, వాని

నివారణోపాయాలను గూడ, వార్ధక్యదోషాలను, రోగాన్ని, అనివార్య మనిపించే మరణాన్ని గురించి గూడ, ఆలోచింపసాగింది. బుద్ధుడు కూడా వయసుతో వంగిన వృద్ధుని స్ఫోటబాధితుని, శవయానంపై శవాన్ని చూచి నిస్సహాయంగా రోదించలేదు. సరళంగా, కౌటుంబిక సంతోషాలను విడిచి, వీటికేమి సమాధానమని అన్వేషిస్తూ ఇల్లు వదలి వెళ్ళినాడు.

సావిత్రి జన్మ అందుకోసం కాదు. సంకల్పమున్న చోట, పరిస్థితుల నధిగమించేందుకొక మార్గం కూడా ఉండి తీరాలి! సావిత్రి ఒక దుర్దమ సంకల్పంతో మలచబడింది :

Celestial - human deep warm slumberous fires
Woke in the long fringed glory of her eyes
Like altar-burnings in a mysteried shrine.
Out of those crystal windows gleamed a will
That brought a large significance of life.

**దివ్యమానుషాగాధతప్తనిద్రాయుతాగ్నులు**
**తదాయతాంచలవైభవ నేత్రాలలో మేల్కొనె**
**ఒక నిగూఢదేవాయతనంలో వేదీదహనంబులట్లు,**
**ఆ స్వచ్ఛగవాక్షముల నుండి ఒక సంకల్పము వెలిగె**
**అది జీవితమున కొక మహద్గౌరవముందెచ్చె.**

కాలక్రమంలో, ఈ కోమలార్చిస్సు ఒక జ్వలిస్తూన్న అంగారపాత్రమై, ఆమె సంకల్పశక్తి మృత్యువు నెదిరించి తరిమివేయటానికి, సత్యవంతుని పునరుజ్జీవితుని చేయటానికి సంసిద్ధమవుతుంది. సత్యవంతుడు "ఈ ప్రపంచాత్మ" (the soul of the world).

* * *

## 2వ సర్గ – జ్వాలావృద్ధి

శ్రీ అరవిందులను అధ్యయనం చేస్తూ మనసులో ఎల్లవేళలా గుర్తుంచుకోవలసిన విషయం, వారి మహాకావ్యం **సావిత్రి** వ్యాసుని ఉపాఖ్యానానికి విస్తరణ అన్నది. ఈ మహాకావ్యంలో ఉన్నదంతా ఆ ఉపాఖ్యానంలో బీజరూపంలో ఉన్నది. ఆ మూలపాఠంలోని ప్రతి పదాన్నీ శ్రీ అరవిందులు ఎంతగా తపోధ్యాననిరతులై దర్శించినారో, దాని వివిధ

రీతుల ప్రధానార్థాలను ఆంగ్లంలో సాకారం చేసినారో, అది మహాశ్చర్యకరం. సావిత్రి పెద్దదయ్యే అంశం ఉపాఖ్యానంలో ఒకే ఒక్క పంక్తిలో సంక్షిప్తంగా ఇట్లా చెప్పబడింది : కాలేన చాపి సా కన్యా యౌవనస్థా బభూవ హ । (కాలం గడువగా ఆ కన్య యౌవనవతి అయినది.)

శ్రీ అరవిందులీ పంక్తిని ఒక పూర్తి సర్గగా విస్తరించినారు. ఈ విస్తరణ భవిష్యన్మృత్యువిజేత వృద్ధికి తగినట్లు చేయబడింది. సీత మహాజ్ఞానియైన జనకుని కుమార్తె యైనట్లు, సావిత్రి తండ్రి కూడ ఒక పూర్ణయోగియే. వాని రాజప్రాసాదవాతావరణం వాని ఆలోచనా విధానానికి, జీవన విధానానికి అనుకూలంగానే ఉండి ఉంటుంది. పెరియాళ్వార్ పెంపకంలో గోదాదేవి పెరిగి పెద్దయైనట్లే, సావిత్రి ఆ రాజప్రాసాదంలోని యౌగికస్ఫురణలను తనలో ఇముడ్చుకొన్నది, ఆమె ఆలోచనాక్రమం ఐహికం కానే కాదు. ఆమె "అదర్శితమును దర్శించినది, అచింత్యమును చింతించినది" (saw the unseen and thought the unthinkable.) ఐనప్పటికి, ఆమె భారతీయ గతములో దృఢంగా వేళ్ళూనియున్నది. Foundations of Indian Culture లో శ్రీ అరవిందులు మన పూర్వులు సాధించిన వానిని గురించి ఒక ఉజ్జ్వల చిత్రాన్ని అందించి యున్నారు. మతధర్మం, ఆధ్యాత్మికత, కళ, తాత్త్వికత, గృహవాస్తు, సారస్వతము, రాజకీయ నియంత్రణము... భారతీయుడు సాధికారతను సాధించని విషయమంటూ ఒకటున్నదా!? కనుక సావిత్రిని గురించి మనం ఇట్లా చదివినప్పుడు, అది యోగ్యమే అనిపిస్తుంది :

A shoreless sweep was lent to the mortal's acts,
And art and beauty sprang from the human depths;
Nature and soul vied in nobility.
Ethics the human keyed to imitate heaven;
The harmony of a rich culture's tones
Refined the sense and magnified its reach
To hear the unheard and glimpse the invisible
And taught the soul to soar beyond things known.

**మర్త్యచేష్టితములకొక అపారప్రసరంబొనరె,**
**కళయు సౌందర్యమున్ గలిగె మానుషాగాధములనుండి;**
**ప్రకృతియు నాత్మయున్ ఉదాత్తతలో ప్రతికక్షులాయె.**
**నైతిక మానవత స్వర్గానుగామిగా ప్రేరణనొందె;**
**ఒక సంపన్న సంస్కృతి వర్ణసంతులన**

**ఇంద్రియాలను సంస్కరించి తద్వ్యాప్తి విభూతిమంతమై**
**అశ్రుతమున్ వినునట్లు, అదృశ్యమున్ చూచునట్లు జేసి**
**జ్ఞాతవస్తుజాల సీమల కావలి దాక ఆత్మ నెగురజేసె.**

సావిత్రికి విద్యారీతి యొక సృజనరీతియైనది. ఆమె చింతనలు పరివర్తన అవసరమైన వానిని పరివర్తించు మార్గములను అన్వేషింపబూనినవి. చింతన, వాక్కు, చేష్ట, మూడును ఐక్యతతో మెలిగి, మంచిని నిర్దోషముగ జేసి, అవసరమైన చోట్ల మార్పును ప్రచోదించినవి :

Her arts became gestures of sacrifice,
Invested with a rhythm of higher spheres
The word was used as a hieratic means
For the release of the imprisoned spirit
Into communion with its comrade gods,
Or it helped to beat out new expressive forms
Of that which labours in the heart of life...

**త్వదీయ చేష్టల్ యాజ్ఞిక హస్తాక్షేపముల్గాగ**
**ఊర్ధ్వతరలోకలయగతీలసితంబులయ్యె,**
**సమవేల్పులంగూడ బద్ధాత్మమోక్షంబు**
**సాధింప తద్వాణి పౌరోహితార్థమరసె,**
**కాదేని జీవహృదయాయాససాహాయ్యమయ్యె**
**నవ్యభావవ్యంజక రూపసాధనలందు....**

పరిణామము సమాప్తం కాలేదు; సృష్టి వట్టిబోలేదు. కళాసాధనలో సావిత్రి ఈ విషయాన్ని చక్కగా గ్రహించిందని శ్రీ అరవిందులు వ్రాస్తారు. ఆమె శిల్పము చిత్రలేఖనము "కనరాని యొక మూర్తిని" (a figure of the invisible) ఆత్మనా భావించినదానిని ప్రతిభాయుతమైన లేఖప్రమాణాలు; ఒక ఆలయపు ఊర్ధ్వగామి శిలానిర్మిత స్థరాలు, లేక ఒక కట్టడపు అంతస్థులు, "అనంతత్వపు వాస్తుశిల్ప" మునకు (architecture of the infinite) తీసిపోవు; మానవతను దైవత్వంతో అనుసంధానం చేసే ఒక వారధి సంగీతం; అట్లే నృత్తనాట్యాల పదవిక్షేపం సృష్టియొక్క లయకు ప్రతిధ్వని. శ్రీ అరవిందులు సావిత్రిని కవిత్వాన్ని గూర్చి ప్రసంగించే సమయంలో, తమ కవితాశైలీ వర్ణనను పోలిన ధ్వని యేర్పడుతుంది.

*Poems in largeness cast like moving worlds*
*And metres surging with the ocean's voice*
*Translated by grandeurs locked in Nature's heart*
*But thrown now into a crowded glory of speech*
*The beauty and sublimity of her forms...*

**చలల్లోకముల బోలి పద్యముల్ బృహత్వము వహించె**
**సాగరఘోషతో నుప్పొంగు ఛందముల్**
**ప్రకృతి హృదయబద్ధవైభవాలనువదింప**
**సాంద్రవాక్శోభలో నిక్షిప్తమై**
**తద్రూపసౌందర్య సమున్నతి...**

శైలియే వ్యక్తి! కాని ఇవన్నీ సావిత్రి ఆశయాలను నిశ్శేషం చేయలేదు. ఉదాహరణకు, ఆమెకు "మానుషాలోచనకు మించిన అపార జ్ఞానం" ఉన్నది. (a boundless knowledge greater than man's thought) ఈ విషయంలో ఆమెతో సరితూగగల వయస్యులు ఉన్నారా? ఆశయబాహుళ్యం, మాధుర్యం, ప్రేమ, ఆనందములతో నిండిన సావిత్రి "అత్యుత్తమ కర్మక్షేత్రాన్ని గూర్చి కలగన్నది." (dreamed of a transcendent action's sphere.) ఆమెను చేరుకోవాలని ప్రయత్నించినవారు కొద్దిమంది. కాని వారు ఆమెతో ఉన్నతస్థరాలలో నిలువలేక "జీవితపు మందసాధారణ స్థాయికి మరల పడిపోయినారు" (fell back to life's dull ordinary tone.) ఆమెను ఆరాధించటానికి, ఆమె చూపిన వెలుగు బాటలో ఆమె ననుసరించటానికి కూడ సిద్ధమైన వారున్నారు లెండి. కొందరు ఆమెను పూర్తిగా తమ సొత్తుగా చేసికొనవలెనని కోరుకున్నవారు, మరి కొందరు ఆమె తేజస్సుకు ఉక్కిరిబిక్కిరై వెనక్కి తగ్గినవారున్నారు. కాని ఆమెకు తగిన నేస్తం మానవజాతి మొత్తంలో ఎక్కడ? పుడమికి దివ్యత్వాన్ని ప్రసాదించగల ఆమె ఉత్తమత్వంతో, ఆశయంతో ఆమెతో అడుగులో అడుగు కలిపి నడువగల సఖుడు ఎక్కడున్నాడు?

*None could stand up her equal and her mate.*
*In vain she stooped to equal them with her heights,*
*Too pure that air was to small souls to breathe...*
*Among the many who came drawn to her*
*Nowhere she found her partner to high tasks,*
*The comrade of her soul, her other self*
*Who was made with her, like God and Nature, one.*

**ఆమెకు సముడై సంగియై నిలువరైరెవ్వరున్.**
**తన ఉన్నతి వినమ్రమై వారికిన్ సమమౌ యత్నము వ్యర్థమౌ,**
**అల్పాత్ములోపజాల రంతటి శుద్ధప్రాణముచ్ఛ్వసింప...**
**ఆకృష్టులై వచ్చిన బహుసంఖ్యాకులలో నామె,**
**ఉన్నత కార్యదక్షతన్ దన సమభాగి కాగలవాని,**
**తన ఆత్మభాగిన్, తన పరాత్మన్, తనతో**
**పురుషుడు ప్రకృతియువోలె, ఒక్కటియగువాని గానదయ్యె.**

ఆమె హృదయాంతరాలలో ప్రతిస్పందన కలిగించు వారెవరూ ఇప్పటికింకా లేరు. అంతలో మద్రరాజ్యం దివ్యప్రతిభావంతురాలైన ఈ రాకుమారి గురించి విని సచేతనమయింది. ఆమె పేరే, సావిత్రి, పురుషుల జపమంత్రమై, "ఒక ప్రాణితశ్లోకం వలె ఉన్నతమూ మధురమూ" (exalted and sweet like an inspired verse) అయింది. ఆమెను సౌందర్యవతిగా చూచినవారు భావించినారు. దానితోబాటు ఆమె ఒక "ఉజ్జ్వలమైన శక్తి" (flaming strength) ని పొందియున్నదని స్పష్టమయినది. క్లుప్తంగా, ఆమె ఒక "అనుపగమ్య దివ్యశోభ" (a glory unapproachably divine.) గా కనిపించింది. ఆ కారణంగా ఆమె పాణిగ్రహణాన్ని కోరి ఎవ్వరూ రాలేదు.

Whoever is too great must lonely live.
Adored he walks in mighty solitude.
Vain is his labour to create his kind.
His only comrade is the Strength within.
Thus was it for a while with Savitri.

**అతిమహనీయులైనవారు ఏకాంతవాసము చేయవలె.**
**ఆరాధితుడై అతడు బలవదేకాంతమున జీవించును.**
**ఆత్మసంకాశులన్ సృజింప వ్యర్థప్రయత్నుడతడు.**
**అంతఃశక్తియే వాని ఏకైక సఖుడు.**
**కొంత కాలము సావిత్రి అట్లె యుండె.**

కనుక ఇప్పుడామె "విధిఘంటిక" (hour of fate) కోసం నిరీక్షించింది, తన దోషరహిత సఖునితో కలయికకు దారితీసి వానిని తనవానిగా చేసికొని, తాను వాని స్వత్వం కాగల సమయం కోసం.

* * *

## 3వ సర్గ - మార్గణ నిమంత్రణం

దాదాపు సృష్ట్యాదినుండి, జీవితభాగస్వామిని తన కంటె అధికురాలయితే, ఆమె తన వ్యక్తిత్వానికీ అభ్యుదయానికీ ఆటంకం కాగలదన్న ఆలోచనా విధానంతో పురుషుడు సదమదమవుతున్నట్లు కనిపిస్తుంది. ఈ రోజు అదే పరిస్థితి ఉన్నది. రామాయణ మహాభారత రచనా కాలానికి ముందు కూడా పరిస్థితి భిన్నం కానట్లే కనిపిస్తుంది. ఈ రచనలు ప్రాచీనాలే. వ్యాసుని ఉపాఖ్యానం, సావిత్రిని నాటి యువత ఆరాధనాభావంతో చూచి తృప్తి చెందినారే తప్ప ఆమెను వివాహం చేసికొనటానికి భయపడినారని చెబుతుంది. కుమార్తెను సకాలంలో యోగ్యుడైన పురుషునకిచ్చి వివాహం చేయవలసినవాడు కనుక ఈ స్థితికి అశ్వపతి బాధపబడినాడు. మరి శ్రీ అరవిందుల అశ్వపతి ఈ పరిస్థితికెట్లా ప్రతిస్పందించినాడు?

అశ్వపతి ఒక మహాయోగి అయిన ఉదంతాన్ని వర్ణించి చెప్పటానికి కవి అనేక సర్గలు శ్రమించినాడు. ఒక యోగి ప్రతిస్పందన భిన్నంగానే ఉండాలి. మౌనధ్యానంలో సుదీర్ఘ సమయాలు గడపటానికి అలవాటుపడినవాడు కనుక ఆతడు సామాన్యుడైన తండ్రివలె చింతించకూడదని అర్థం చేసికొనినాడు. ఎందుకంటే, మానవజాతి నవ్యభవిష్యపు ఆగమనాన్ని ఆతడు 'విన'గలడు.

*Across this cyclic tramp of eager lives,*
*Across the deep urgency of present cares,*
*Earth's wordless hymn to the Ineffable*
*Arose from the silent heart of the cosmic Void;*
*He heard the voice repressed of unborn Powers*
*Murmuring behind the luminous bars of Time.*
*Again the mighty yearning raised its flame*
*That asks a perfect life on earth for men*
*And prays for certainty in the uncertain mind*
*And shadowless bliss for suffering human hearts*
*And Truth embodied in an ignorant world*
*And godhead divinising mortal forms.*

**ఏతల్లాలసజీవితచక్రభ్రమణగమనపారాంతరాన,**
**వర్తమాన చింతాగాఢావశ్యకతా పారాంతరాన,**
**అనిర్వచనీయునకు ధరణీమౌన ప్రార్థన**
**విశ్వాంతరాళ శూన్యనీరవహృదయాన వెడలె;**

**అజనీశక్తుల నిరుద్ధవాణి నతడు విన్నాడు**
**ఉజ్జ్వలకాలార్గళమర్మరధ్వనుల వెనుక.**
**ధరణీజనస్వచ్ఛజీవనమునకై**
**సంశయబుద్ధినిశ్చయమునకై**
**వ్యధితమానవహృదయభాస్వరానందమునకై**
**అనభిజ్ఞప్రపంచమున మూర్తీభూతసత్యమునకై**
**మర్త్యాకృతుల దైవీకరించు దేవతకై**
**బలవదాకాంక్ష మరల జాజ్జ్వల్యమానమాయె.**

కాని అశ్వపతివలె తపోధనులైనవారు లోకంలో ఎందరున్నారు? కనుక వారు సామాన్యజీవన చర్యలను పునశ్చరణ చేస్తూ, సదా తమ అల్పస్వార్థాలలో, ఆకర్షణ వికర్షణలలో పంజరబద్ధులై, మహత్ఫలాన్ని అందుకోవటాని కెన్నడూ సాహసించరు. 'మాయ' అనే మేలిముసుగు తగిలించికొని (దాన్ని మహామాయ లేక విష్ణుమాయ, మీకు నచ్చినట్లు పిలవండి), తన ఉనికికే ప్రమాదమని భయపడి, మానవులు తమ నాయకుని / నాయికను, అవతారమూర్తిని గుర్తించలేరు. మానవజాతికి మార్గదర్శనం చేయవచ్చిన ఆ వెలుగు నిరాశపడి, తన స్వస్థానానికి మరలిపోతుంది. మానవజాతి తన భవితవ్యాన్ని ఎప్పటికి గ్రహిస్తుంది?

ఈ విధంగా అశ్వపతి, తన అంతర్వాణిని వింటూ అంతర్ముఖుడై ఉండగా, ఒక దీప్తిమద్దేవతా మూర్తి వలె, వానికొక ప్రత్యుత్తరం లభిస్తుంది.

But like a shining answer from the gods
Approached through sun-bright spaces Savitri.
Advancing amid tall heaven-pillaring trees,
Apparelled in her flickering-coloured robe
She seemed, burning towards the eternal realms,
A bright moved torch of incense and of flame
That from the sky-roofed temple-soil of earth
A pilgrim hand lifts in an invisible shrine.

**దేవతలనుండి ఒక దీప్తిమత్ ప్రత్యుత్తరము వలె**
**సూర్యప్రభాయుతసీమల దాటి సావిత్రి వచ్చె.**
**చేరవచ్చుచు గగనస్తంభాయిత వృక్షరాజి మధ్య,**
**చలద్వర్ణవస్త్రాలంకృతయై,**

**శాశ్వత సీమలజాడ వెల్గుచు ఆమె కన్పించె**
**ఒక భాస్వరచలత్సుగంధికరదీపికా జ్వాలగా**
**గగనాచ్ఛాదిత ధారుణీదేవాలయభూమినుండి**
**ఒక యాత్రిక హస్తము అదృశ్యచైత్యమున నెత్తినట్లు.**

తన కుమార్తె సావిత్రి భవిష్యత్తును గురించిగాని మానవజాతి భవిష్యత్తును గురించి గాని తాను చింతించనక్కరలేదని అశ్వపతి గ్రహిస్తాడు. అటువంటి వ్యక్తి భూమిపై నుండగా, భయసంశయాలెందుకు? “శాశ్వతుని ఆనందపు ఈ సజీవవేదం” (this breathing Scripture of the Eternal's joy) భూమిపై నుండగా, ఎవరైనా సంశయాలను ప్రక్కనపెట్టి ప్రశాంతంగా భవిష్యత్తు వంక చూస్తూ, మానవజాతికి అన్ని విధాలా బాగుంటుందని నమ్మటం నేర్చుకోవాలి.

ఎందుకంటే, సావిత్రిని తన కుమార్తెగానే కాక అమర్త్యత్వానికొక వాహకంగా కూడా, “అజ్ఞాతమహదాత్మ” (great unknown spirit) గా అశ్వపతి భావించినాడు. కృష్ణుడు నోరు తెరువగా అందులో భువనాలను చూచిన యశోద దర్శనం లాంటిదే ఇది. నిశ్చయంగా ఒక మర్త్యుని పెండ్లాడి, పునరపి జననం, పునరపి మరణం, పునరపి జననీ జఠరే శయనం అంటూ ఒక చర్వితచర్వణ జీవితాన్ని గడపటానికి ఈ బాలిక జన్మించలేదు. మహాయోగి అశ్వపతి మాటలు ఈ అమర్త్యాత్మను దాని మహాలక్ష్యం వైపు నడిపించే విధంగా వెలువడిన దివ్యశాసనంగా భావించదగినవి. ఆతడు ఆమెను లోకంలోకి వెళ్ళి తన భర్తను తానే వరించి తెమ్మని శాసించినాడు. తాను ఎంచుకున్నవాడు సరియైన వాడవుతాడో కాడో అని ఆమెకు విచారం అక్కర్లేదు. ఎందుకంటే, ఆ వ్యక్తి పూర్తిగా అజ్ఞాతవ్యక్తి అయి ఉంటాడు కనుక. ఆమెలోని ఆ కేవలుడు ఆమెను నిశ్చయంగా సరియైన వ్యక్తివద్దకే, ఆమెతో కలిసి కేవల భౌతిక మానసిక ప్రకృతిని అతిక్రమించగలవాని వద్దకే, నడిపిస్తాడు. ఆమె “ప్రకృతినుండి దైవత్వపు ఉన్నతికి అధిరోహించ” గోరునది (ascend from Nature to divinity's heights) వాని సమాపన వచనం ఆమెతో, ఆ వ్యక్తి ఆమె జీవవిత సమభాగియై ఆమెనెప్పటికీ విడువని వాడు కాగలడు, “ఎవడు నీ దేహాంతము వరకు నీ సహచారి యగునో అతడు” (he who shall walk until thy body's end.), అను ఆశీర్వచనం.

ఆ ఋషియొక్క మృదువైన వాక్కులు ఒక గురువు మంత్రోపదేశ సమయంలో తన శిష్యునకు చెప్పే మాటలను పోలినవి. మంత్రం ఒక మానవుని పరివర్తన చెందించటానికి ఎట్లా పనిచేస్తుంది? ఆ క్రమాన్ని శ్రీ అరవిందులు అద్భుతంగా వర్ణించినారు:

*As when the mantra sinks in Yogi's ear*
*Its message enters stirring the blind brain*
*And keeps in the dim ignorant cells its sound;*
*The hearer understands a form of words*
*And, musing on the index thought it holds,*
*He strives to read it with the labouring mind,*
*But finds bright hints, not the embodied truth*
*Then, falling silent in himself to know*
*He meets the deeper listening of his soul:*
*The Word repeats itself in rhythmic strains:*
*Thought, vision, feeling, sense, the body's self*
*Are seized unutterably and he endures*
*An ecstasy and an immortal change.*

**మంత్రము యోగి చెవిలోని కింకు నపుడు,**
**దాని సందేశ మా గ్రుడ్డి మెదడును కలంచి,**
**ఆ ధ్వని దాని నిష్ప్రభానభిజ్ఞ జీవాణువులందు నిలచు;**
**శ్రోతకొక పదముల పొందిక బోధపడును,**
**దాని సూచ్యార్థభావనలోన మునిగి,**
**మేధాపరిశ్రమతోడ దాని నెఱుగజూచు నతడు,**
**కాని స్ఫురత్ సంకేతములె తప్ప మూర్తిమత్ సత్యమెఱుగరాదు:**
**అపుడు మౌనము వహించి తనలోనె తెలియగా**
**తన ఆత్మశ్రవణంబు గాఢతరముగ జూచు:**
**ఆ పదము లయబద్ధమై పునశ్చరణయగును:**
**చింతన, దర్శనము, భావనము, ఇంద్రియము, దేహమున్**
**వర్ణనాతీతముగ తదావిష్టమగును, ఆతడోర్చు**
**నొక మహానందమున్, ఒకానొక అమర్త్యపరివర్తనంబు.**

అశ్వపతికి తనయందున్న విశ్వాసంతో, వాని ఆశీస్సులతో బలవంతురాలై, సావిత్రి మద్రరాజధానిని విడిచి భారతదేశమంతటా పర్యటించాలని, తన "మహత్తర దైవం" (greater God) కోసం అన్వేషణకు బయలుదేరుతుంది.

❊ ❊ ❊

## 4వ సర్గ - అన్వేషణ

వేగంగా మారుతూన్న పరిస్థితుల్లో, సావిత్రి మద్రరాజప్రాసాదాల సుఖాలను వదలి, అజ్ఞాతము నన్వేషించనారంభించింది. ఈ అన్వేషణ ఎంత కాలం సాగింది? సావిత్రి ఏయే దేశాలు పర్యటించింది? ఈ విషయాలన్నీ మన ఊహకే వదలివేయబడినవి. శ్రీ అరవిందులు ఇంత మాత్రమే చెప్పినారు, ఈ అజ్ఞాతాన్వేషణయాత్ర మద్రరాజ్యానికి బైట ఉన్న విశాలతర ప్రపంచ సీమల తాలూకు ఉజ్జ్వలమైన అనుభవాన్ని ఆమెకు కలిగించింది, అని. మొదట ఈ క్రొత్తదనాన్ని ఆస్వాదించటంతో ఆమెకు సరిపోయింది. రాజప్రాసాదపు రక్షిత జీవితం నుండి వెలుగుచీకట్ల నగరప్రాంతాలకు, అక్కడ నుండి ప్రాచీన భారతదేశపు అసంఖ్యాకమైన అడవులకు, ఈ పర్యటన పెద్ద మార్పులను గుర్తించింది. త్వరలోనే ఆమెకు అన్ని తావులూ సుఖప్రదాలుగానే అనిపించినవి. ఎందుకంటే, ఈ విశాల ప్రపంచంలో క్రొత్తదేదీ లేదు, ఇక్కడ మన నివాసమూ క్రొత్త కాదు. జన్మ వెంట జన్మ ఈ చలనం సాగుతూనే ఉన్నది. అందుచేత, తన యాత్రలో సావిత్రి తాను చూచిన ప్రజాసమూహాలలో పూర్వపరిచయం ఉండి తనకు మరుపు దగిలిన వ్యక్తులను గుర్తించగలగటం మనం అర్థం చేసికోగలిగిన విషయమే. మానవుడు తాను నాటిన పంటనే కోసుకుంటాడు, అందుకే  భూజీవనయాత్ర నిరంతరం సాగటం.

Nothing we think or do is void or vain;
Each is energy loosed and holds its course.
The shadowy keepers of our deathless past
Have made our fate the child of our own acts,
And from the furrows laboured by our will
We reap the fruit of our forgotten deeds.

**మనం ఆలోచించేది, చేసేది, యేదీ శూన్యం, వ్యర్థం కాదు;**
**ప్రతిదీ ముక్తశక్తియే, ప్రతిదీ పరిణామశీలమే.**
**మన అమరగతాన్ని భద్రపరిచే రహస్సులు**
**మన విధిని మన కర్మసంతానంగా చేసినవి,**
**మన సంకల్పం చేసిన నాగటి చాళ్ళ నుండి**
**విస్మృత కర్మల ఫలాన్ని మనం అనుభవిస్తాము.**

వ్యక్తులనూ ప్రదేశాలనూ సావిత్రి తనవిగా గుర్తించటమూ, మన కర్మలే మన జీవితాలలోని మంచి చెడ్డలకు కారణమని శ్రీ అరవిందులు వ్యాఖ్యానించటమూ, ప్రాచీన తమిళ సంగం కవి మాటలను గుర్తుతెస్తుంది : "ప్రతి దేశమూ నాదే; అందరూ నా

బంధువులే. మంచీ చెడూ ఇతరులనుండి కాదు, మననుండే యేర్పడతాయి." ("Every country is mine; all are my relations. The good and the bad accrue not from others but from ourselves") అటువంటి సమగ్రమైన దృష్టితో, ఈ జన్మ, స్మృతి, కర్మ పరంపరకు ఒక అర్థం ఉన్నదని సావిత్రి గ్రహించింది. ఆమె ఒక సాధారణ యువతి కాదు కనుకనూ, రాజకుమారిగా కూడా ఆమె యోగసాధన చేస్తూనే ఉన్నది కనుకనూ, ఆమె కది సాధ్యమయింది :

Upon her silent heights she was aware
Of a calm Presence throned above her brows
Who saw the god and chose each fateful curve;
It used the body for its pedestal;
The eyes that wandered were its searchlight fires,
The hands that held the reins its living tools;
All was the working of an ancient plan,
A way proposed by an unerring Guide.

**తన మౌన ఉన్నతోన్నతులపై, తన భ్రువులపై**
**సింహాసనస్థుడై, లక్ష్యమెఱిగి విధిపరిణామమెన్ని,**
**కొలువైన ఒక శాంతసాన్నిధ్యముందానెఱుగు;**
**తదుపయోగార్థమౌ పాదపీఠ మీ శరీరము;**
**చలన్నేత్రముల్ తదన్విషద్దీప కాంతులు,**
**పగ్గముల్ బట్టిన చేతులు తజ్జీవత్పరికరములు;**
**సమస్తమొక సనాతనప్రణాళికాబద్ధక్రియయే,**
**ఒక దోషరహితమార్గనిర్దేశకుని ప్రతిపాదనంబె.**

తనలోని కేవలుడు తన వరాన్వేషణలో మార్గనిర్దేశకుడు కాగలడని అశ్వపతి చెప్పనే చెప్పినాడు కదా! శ్రీ అరవిందులు బాలయోగిని సావిత్రిని మన ముందుంచుతారు:

Upon her silent heights she was aware
Of a calm Presence throned above her brows
Who saw the god and chose each fateful curve;
It used the body for its pedestal;
The eyes that wandered were its searchlight fires,
The hands that held the reins its living tools;
All was the working of an ancient plan,
A way proposed by an unerring Guide.

**తన మౌన ఉన్నతోన్నతులపై, తన భ్రువులపై**
**సింహాసనస్థుడై, లక్ష్యమెఱిగి విధిపరిణామమెన్ని,**
**కొలువైన ఒక శాంతసాన్నిధ్యముందానెఱుగు;**
**తదుపయోగార్థమౌ పాదపీఠ మీ శరీరము;**
**చలన్నేత్రముల్ తదన్విషద్దీప కాంతులు,**
**పగ్గముల్ బట్టిన చేతులు తజ్జీవత్పరికరములు;**
**సమస్తమొక సనాతనప్రణాళికాబద్ధక్రియయే,**
**ఒక దోషరహితమార్గనిర్దేశకుని ప్రతిపాదనంబె.**

సావిత్రి వయసులో చిన్నదే, కాని తన అంతశ్శక్తుల నుండి మార్గదర్శనం పొందటానికామె సుశిక్షితురాలు. ఆమె మేధాశక్తి కూడా పదునెక్కింది. ఆమె కన్నులు నిరర్థకంగా చూడవు; చూచిన ప్రతిదానినీ జాగ్రత్తగా పరిశీలిస్తుంది. కనుకే అరణ్యంలో ఆశ్రమాల వలన సర్వోత్తమమైన అవకాశాలను పొందిందామె. నగరాల ఉన్మత్తసమూహాలకు దూరంగా, తన రథాన్నామె సాధారణంగా గుఱ్ఱాలు నడవని నిశ్శబ్దప్రదేశాలకు నడిపించింది. అశ్వపతి కుమార్తెగా, ధ్యానమౌనం ఆమెకు జనసమ్మర్దమున్న ప్రదేశాలలో ప్రియమైనది, కాని మౌనం వాచ్యమైన సందేశమైన ఈ తావులలో ధ్యానమొక జీవన విధానం. అటువంటి అడవులలో కాలం నిల్చిపోయినట్లు తోస్తుంది. ఆ నిశ్చలత్వంలో మనస్సును చలింపజేసే దేమీ ఉండదు. అదే సమయంలో, అడపాదడపా ఆమె క్రొత్త పరిచయస్థులతో ఆనందాన్ని పంచుకున్నది. వీరు అత్యధికంగా, తాపసులు లేక వానప్రస్థాశ్రమంలో ఉన్న రాజులు. వీరిలో కొందరు ఆమెతో సంభాషించి, తమ అనుభవాలను పంచుకున్నారు. మరి కొందరు అద్వైతానందంలో మునిగిపోయిన మౌనులు. అక్కడ పిన్నవయసువారు కూడా ఉన్నారు ఆశ్రమాలలో. ఎందుకంటే పూర్వం అడవులలోని ఆశ్రమాలు విద్యాలయాలు కూడా. రాజకుమారులు, సామాన్యులు కలిసి ఇక్కడ యుద్ధకళలతో సహా అన్ని విద్యలనూ అభ్యసించటానికి వచ్చేవారు.

*The infants of the monarchy of the worlds,*
*The heroic leaders of a coming time,*
*King-children nurtured in that spacious air*
*Like lions gamboling in sky and sun*
*Received half-consciously their god-like stamp:*
*Formed in the type of the high thoughts they sang*
*They learned the wide magnificence of mood*
*That makes us comrades of the cosmic urge,*
*No longer chained to their small separate selves...*

**లోకాల రాజరిక శిశువులు, భవిష్యత్కాల ధీరనాయకులు,**
**ఆ విశాల వాయువులో రాచబిడ్డలు వర్ధిల్లినారు,**
**సింహములట్లు సూర్యాతపగగనాలక్రింద విహరించుచు**
**తమ దేవతాసకాశముద్రలన్ జ్ఞాతాజ్ఞాతముగ గ్రహించినారు**
**వారు పాడిన ఉన్నత భావాల మూసలో రూపు దాల్చి**
**భావ విస్తర మహిమను నేర్చినారు,**
**అదియె విశ్వప్రచోదనసఖుల జేయు,**
**అల్ప ప్రత్యగాత్మల కింక కట్టువడకుండ...**

అదేమీ ఆశ్చర్యకరం కాదు. ఎందుకంటే, వారికి ఆదర్శంగా నిల్చినవారు ఋషులున్నూ జనకునివంటి రాజర్షులున్నూ, వారు హర్మ్యాలలో బందీలుకాక, తానే స్వయంగా ఒక ఆదర్శ గురువైన ప్రకృతిమాతతో మమేకం కావటాన్ని అంగీకరించేవారు. ప్రకృతి ఇక్కడ పూర్తిగా భయంకరం కాదు. ఎందుకంటే, అక్కడి సమభావం పులినీ జింకనూ బద్ధస్నేహంలో ఉంచేది. అట్టి సమతౌల్యం ఉన్నచోట గురువులు నవమానవుని తీర్చి సాకారం చెయ్యటం సులభం. వారి "లేత మనస్సులలో అమర్త్యభావాలను బీజావాపం చేయటం" ("sowing in young minds immortal thoughts.") సులభం.

సావిత్రి ఇక్కడా అక్కడా తిరగటంలో ప్రతి ఒక్కరినీ పరిశీలించింది. ఆపై తన మహదన్వేషణలో ముందుకు సాగింది. వసంతం గడిచింది, "ఆకాశం పిత్తలవర్ణమయింది." (the skywas set like bronze.)

❊ ❊ ❊

## 5వ కాండ - ప్రేమ కాండ

## 1వ సర్గ - నియుక్త సమాగమప్రదేశము.

వ్యాసుని ఉపాఖ్యానంలో సావిత్రి అన్వేషణయాత్రలో సత్యవంతుని కలిసిన ఉదంతం లేదని గుర్తుచేసికోవచ్చు. ఆమె అన్వేషణకు వెళ్ళటం చెప్పి, వెంటనే తిరిగి వచ్చి అశ్వపతినీ నారదునీ కలిసినట్లున్నది. ఒక కాండ మొత్తం ప్రేమకాండగా శ్రీ అరవిందులు రూపొందించటానికి వారికి ప్రేరణ యేమిటి?

ఈ ప్రశ్నతో మనం తమిళ నైతికత "కలవు ఒజుక్కమ్" (వివాహానికి ముందు ప్రేమికుల కలయిక), ప్రాచీన సంగం వాఙ్మయంలో ఇవ్వబడిన విపుల వర్ణనను పరిశీలించాలి. ఒక సజీవానుభవంగా తమిళులు చూచిన ఈ సాంస్కృతిక భావనను కంబన్ కవి వాల్మీకి మహాకావ్యాన్ని తమిళంలో మరల చెప్పాలనుకున్నప్పుడు, తన రామాయణంలో కూడా చొప్పించినాడు. తమిళ పాఠంలో చాల సర్గల్లో సీతారాములు ఒక క్షణం పాటు మాత్రం కలుసుకొని, ఆ రాత్రి పూర్తిగా ఒండొరుల గూర్చి ఆలోచిస్తూ గడిపిన విషయం సుందరంగా చెప్పబడింది. కంబన్ రచనలోనూ శ్రీ అరవిందుల సావిత్రి కథారచనలోనూ కూడా, వివాహనిశ్చయానికి ముందే నాయికా నాయకులు కలుసుకునే విషయాన్ని గట్టిగా చెప్పినారు. వ్యాసుని రచనలో, సావిత్రీ సత్యవంతులు వివాహాత్పూర్వమే కలిసి మాట్లాడుకొని ఉంటారన్నది గ్రాహ్యం.

1910 తరువాత పాండిచేరిలో ఉంటూండగా, శ్రీ అరవిందులకు చాలమంది తమిళమిత్రులు, పండితులుండేవారు. వారిలో ఒకరు వి.వి.యస్.అయ్యర్, ప్రసిద్ధ విప్లవకారుడు. అయ్యర్ నిశ్చితకంబన్ అభిమాని. ఆయన ఆ తమిళమహాకావ్యంలో చాల భాగాలు శక్తివంతమైన ఆంగ్లంలో బ్లాంక్ వర్స్ (blank verse) ఛందంలో అనువదించినారు. ఆ తమిళ కావ్యంలోని ముఖ్యపాత్రలను గురించి కూడా పండిత వ్యాఖ్య చేసినారు. ఈ అయ్యర్ గారి సీతారాముల వివాహపూర్వసమాగమం వర్ణన వలన శ్రీ అరవిందులు ప్రభావితులై ఉంటారు. కారణమేమైనా, మనకొక మంచి 'ప్రేమకాండ' లభించింది.

ఆ దృశ్యం సూటిగా మన ముందుంటుంది. శ్రీ అరవిందులు ఆలస్యం లేకుండా, అటువంటి కలయికలు కేవలం గ్రుడ్డిగా యాదృచ్ఛికంగా జరిగేవి కావని స్పష్టం చేస్తారు:

For though a dress of blind and devious chance
Is laid upon the work of all-wise Fate,
Our acts interpret an omniscient Force

*That dwells in the compelling stuff of things,*
*And nothing happens in the cosmic play*
*But at its time and in its foreseen place.*

**సర్వవివేకివిధిపై నొక అంధకుటిలయాదృచ్ఛికతా**
**వస్త్రాచ్ఛాదన ముంచిన నుంచవచ్చుగాని,**
**మన చేతలొక సర్వజ్ఞశక్తి అన్వయించు**
**వస్తుగతమైన ఒక బలవత్ప్రకృతికి,**
**విశ్వనాటకమం దేయొక్కటైన సంభవించదు**
**తన నిర్ణీత కాలమందు, పూర్వవిజ్ఞాతదేశాన తప్ప.**

వివిధ ప్రదేశాలలో పర్యటించిన తరువాత, ఇప్పుడు సావిత్రి ప్రకృతిమాత పూర్ణ యౌవనవతియైయున్న ఒక సుందర మందిరాన్ని చేరుకుంటుంది. అది వేసవీ కాదు, వసంతర్తువూ కాదు. అదొక ఆనందర్తువు. పుడమి లేలేత పసిమితో భాగ్యవంతమైనది. అక్కడ పర్వతశ్రేణులున్నవి; అట్టడుగునగల ఊళ్ళను ప్రదర్శించగల నిర్మలమైన జలములున్న సెలయేళ్ళున్నవి; శకుంతానీకాము, వివిధవర్ణాల పూలగుత్తులున్నవి. ఆపై, దేవతల నిశ్శబ్దత అనదగిన ప్రశాంతి! పక్షుల పాటలు వినబడతవి. అప్పుడే విరిసిన పూవులనుండి గుబాళించు సుగంధంతో ప్రాణితమై ఉన్నది.

*The white crane stood, a vivid motionless streak,*
*Peacock and parrot jewelled soil and tree,*
*The dove's soft moan enriched the enamoured air*
*And fire-winged wild-drakes swan in silvery pools.*

**ఒక విశిష్ట నిశ్చలరేఖయై శ్వేతబకము నిల్చె,**
**మయూరశుకముల్ భూమి వృక్షమున్ రత్నవతుల జేసె,**
**పావురపు మృదుకూజితము**
**సంపన్న మొనరించె ప్రేమమయ వాయువున్**
**అగ్నిపక్షాల వన్యహంసలు**
**రాజతసరస్సులం దీదులాడె.**

శ్రీ అరవిందుల ప్రకృతి కవిత్వం మంత్రముగ్ధుల్ని చేస్తుంది. వారు ప్రకృతినొక సెంటౌర్ (centaur), కల్పితరాకాసిగా, మానవశిరస్సు, కరములు, మొండెము, శరీరము, కాళ్ళూ ఒక గుఱ్ఱానివీ కలిగినదానిగా మూర్తిమంతము జేయటం ఆశ్చర్యకరంగా వాస్తవికత కలిగి ఉన్నది. ఆ పురాణరాకాసి centaur వలె ప్రకృతి అంతటా గంతులు వేస్తూన్నట్లు

కనిపిస్తుంది. అయినా, ఆ ఆకారంలో ఒక అచంచలమైన ప్రశాంతత ఉన్నది. గలగలమనే చెట్లు, గడ్డి, పక్షులు, సీతాకోకచిలుకలు, ఇవన్నీ ఒక నిరంతరాయమైన చలనంతో బాటు నిర్వికారమైన శిలాశ్రేణులు పొలిమేరగా!

*In a luxurious ecstasy of joy*
*She squandered the love-music of her notes,*
*Wasting the passionate pattern of her blooms*
*And festival riot of her scents and hues.*
*A cry and leap and hurry was around,*
*The steadily footfalls of her chasing things,*
*The shaggy emerald of her centaur mane,*
*The gold and sapphire of her warmth and blaze.*

**ఒక సుఖభోగానందాతిరేకమున**
**ఆమె తన ప్రేమసంగీతస్వరముల విక్షేపించె**
**తన భావనిదర్శనవిరులగంధవర్ణోత్సవము వృథగా.**
**ఒక కేరింత, ఒక గంతు, ఒక త్వర సర్వత్ర నుండె,**
**తన అనుధావద్వస్తునిభృతపదవిక్షేపముల్,**
**లోమశమరకత కేశరముల**
**సువర్ణ మహానీలంబె ఉత్తాపదీప్తిగా.**

భూమ్యాకాశాల కొక దోషరహితమైన సంగమ ప్రదేశం, ప్రేమసౌందర్యాల మనుగడకూ వృద్ధికీ తగిన సీమ, ఆత్మపూర్ణమైన ధ్యానానికి అనుకూలమైన ఒక సువర్ణ శాంతత, లయైక్యతగల భావాల నిచ్చిపుచ్చుకొనటానికి సరియైన నిర్జన స్థానం, ఒక క్రొత్త సృష్టినిర్మాణానికి ఒక గ్రహము. ఒక దట్టమైన అడవి, దాని కావల, ఒక మైదానం,

*Armoured, remote and desolately grand*
*Like the thought - screened infinities that lie*
*Behind the rapt smile of the Almighty's dance.*

**సర్వశక్తిమంతుని నాట్యానందస్మితము వెనుక**
**దాగిన భావాచ్ఛాదితానంత్యముల బోలి**
**సురక్షితము, సుదూరస్థము, నిర్జనమహితము.**

చిరునవ్వు ముఖంగల నటరాజుని ఆనందతాండవాన్ని చూస్తూ ఉండిపోతాం, కాని ఆ చిరునవ్వుకున్న సూచ్యార్థమేమిటో మనకేమైనా తెలుసునా? నిరీక్షిస్తూ, ఆశిస్తూ

ఉన్న దయనీయ మర్త్యులనుద్దేశించి ఆ స్వామి నవ్వుతూన్నాడా? లేక సర్వవిధముల పదార్థాలూ బాగుంటవని అది ఒక ఆశీర్వచనరూపమా? స్వర్గశాఖయొకటి ఈ మానుషభూమిపై నాటబడుననియా? మానవుడు నికటతమ భవిష్యత్తులో ఒక ఉన్నతతర చేతన నందుకొనుననియా? శివుని నాట్యాన్ని, స్రష్ట మందస్మితాన్ని ఎట్లా విశ్లేషించటం? సావిత్రిలో మనకింతమాత్రం స్పష్టమవుతుంది. తన జీవిత భాగస్వామికోసం సావిత్రి అన్వేషణ ముగిసింది. సావిత్రి ఉదంతం అంతా, ప్రేమ, వివాహం, దుర్విధి, విజయం, అన్నీ శ్రీ అరవిందుల దివ్యకవిత్వంలో అందించబడినాయి :

*A stranger on the sorrowful roads of Time,*
*Immortal under the yoke of death and fate,*
*A sacrificant of the bliss and pain of the spheres,*
*Love in the wilderness met Savitri.*

**చింతాక్రాంత కాలపథములపై నొక ఆగంతకుండు,**
**మరణవిధియుగలాధీనుడౌ అమర్త్యమూర్తి,**
**లోకసంతోషబాధాయాజ్ఞికుండు,**
**అరణ్యమున ప్రేమమూర్తి గలిసె సావిత్రి.**

* * *

## 2వ సర్గ - సత్యవంతుడు

వ్యాసుని ఉపాఖ్యానంలో సత్యవంతుడొక రూపవంతుడు, విద్యాధికుడు, ఆదర్శప్రాయుడైన యువకుడుగా కనిపిస్తాడు. శ్రీ అరవిందులు ఈ సాల్వరాజకుమారుని ప్రాధాన్యాన్ని గురించి ఆలోచించి, "తనలోనే ఆస్తియొక్క దివ్యసత్యాన్ని వహిస్తూన్న ఆత్మ, మృత్యు అజ్ఞానబంధంలోనికి అవతరించినది" ("the soul carrying the divine truth of being within itself but descended into the grip of death and ignorance.") అంటారు. ఫలతః, సత్యవంతుడు "అమృతస్య పుత్రాః", సత్యచేతనను తమలో వహించి, విజ్ఞానమయులైన అమృతత్వ సంతానమైన మానవులకు ప్రాతినిధ్యం వహిస్తాడు. ఇప్పటికిన్నీ మనం మరణాజ్ఞానాల జాలంలో చిక్కువడి ఉన్నాము. సత్యవంతుని తొలి దర్శనం సావిత్రికీ మనకూ కూడ ఒక అమృతపుత్రుని, అమరత్వపుత్రుని రూపంలో కలుగుతుంది :

*As if a weapon of the living Light,*
*Erect and lofty like a spear of God*
*His figure led the splendour of the morn.*

*Noble and clear as the broad peaceful heavens*
*A tablet of young wisdom was his brow;*
*Freedom's imperious beauty curved his limbs,*
*The joy of life was on his open face.*

**జీవజ్యోతిదైన ఒక శస్త్రం దేవకుంతము వలె**
**ఉన్నతోత్తమమై, వాని రూపముషఃప్రభదాల్చె.**
**విశాలప్రశాంతనభస్సులట్లుత్తమ నిష్కలంకమై**
**వాని ఫాలము యువవివేక ఫలకమయ్యె;**
**వాని అంగాల దీర్చె స్వేచ్ఛారాజససౌందర్యము,**
**వాని ముఖంబు దాల్చె జీవనానందమున్.**

ఈ రూపం చాల ఆకర్షకం! అందమైనవాడు, ఉదాత్తుడు, వివేకాన్ని సూచించే నుదురు, అన్నిటికీ మించి, మూర్తీభవించిన స్వేచ్ఛ. ఇంక సావిత్రి దృష్టి అతనిమీదకు మళ్ళటంలో ఆశ్చర్యపడవలసిందేమున్నది? ఆమె తన రథంలో చెప్పుకోదగినంత కాలంగా ప్రయాణిస్తూన్నది. తనకు ఆత్మీయుడైన వానిని ముఖాముఖి కలుసుకోవాలని. ఇప్పుడు కనుగొన్నది "ఏకైక మార్గమున్, శరాయణకృశ శరసంకాశన్" (*"a single path, shot-thin and arrowlike"*) ఆ మార్గాన ఆమె రథాన్ని నడుపుతూ, హఠాత్తుగా అడవి అంచున, ఆ ప్రదేశపు పచ్చదనమంతా తనకు నేపథ్యంగా, పైనుండి సూర్యకిరణాలు వాని రూపాన్ని బంగారు కాంతిలో తడిపివేయగా, వానిని చూస్తుంది. ఆతడు నగరంలో పుట్టినవాడైనా, అడవిలో పెరిగినవాడు. చుట్టూ గల ప్రకృతియే వాని గురువు :

*A veda-knower of the unwritten book*
*Perusing the mystic scripture of her forms,*
*He had caught her hierophant significances,*
*Her sphered immense imaginations learned,*
*Taught by sublimities of stream and wood*
*And Voices of the sun and star and flame*
*And chant of the magic singers on the boughs*
*And the dumb teaching of four-footed things.*

**అకర్తృకగ్రంథవేదవేత్త తద్రూపాద్భుత వేదాధ్యాయియై**
**ఆతడామె పురోహితాత్మ సూచ్యార్థముల్ గ్రహించె,**
**ఆమె గోళాకృతి విస్తారభావనల్**
**ఝరీవనగౌరవముల్, రవితారాగ్నికంఠస్వరముల్,**

**శాఖాగతగాయకమంత్రగానముల్,**
**చతుష్పాజ్జీవమూకబోధనల్ దెలిసె.**

ఇట్టి బోధన ప్రభావాన్ని 'The Tables Turned' అన్న పద్యంలో విలియం వర్డ్స్‌వర్త్ ఇట్లా వర్ణిస్తాడు.

*One impulse from a vernal wood*
*May teach you more of man,*
*Of moral evil and of good,*
*Than all the sages can.*

**పచ్చని అడవినుండి ఒక ప్రేరణ**
**మానవుని గూర్చి అధికముగ బోధించు,**
**నైతిక పాపపుణ్యముల గూర్చి,**
**ఋషులు చెప్పజాలిన దానికంటె.**

ఆమె ఏకాగ్రతతో ఒక్క క్షణకాలం ఆతనిని పరిశీలనగా చూస్తుండగానే పరసవేది లాంటి ప్రేమ అంకురించింది. "ఆమె దృష్టి నిలిచింది, పట్టుబడి, ఇంక సర్వం మారిపోయింది." ఆమె ఆశ్చర్యపడినది. ఆతడు "ఈ సీమ స్థలదేవతయా?" (the genius of the spot?) ఆతడీ భూలోకవాసి కాడేమో? అయి యుండడు. ఎందుకంటే, ఆమె ఒక అసాధారణానందాన్ని పొందుతూన్నది, "ఆమె ఆత్మ ఈ నవ్యసూర్యునికై దడాలని తలుపులు తెరచినది" (her soul flung its doors to this new sun) ఆమె పగ్గాలు లాగి గుఱ్ఱాల నాపింది. అదే సమయంలో సత్యవంతుడు కూడా ఆమెవంక తదేకంగా చూస్తాడు, "తన ఆత్మ ద్వారాలనుండి." ఒక దివ్యశక్తి అతనిని ముందుకు నడిపిస్తుంది. ఆతడు రథము దిక్కుగా నడుస్తాడు. అంతట వారిద్దరున్నూ తమ గత జన్మలన్నిటా ఎప్పుడూ ఉన్న ఒక ఐక్యతను గుర్తిస్తారు. ఈ ఐక్యత అన్నది భూమ్మీద అందరి స్నేహాలకూ, సంగాలకూ అన్వయించే ఒక సత్యం :

*On the dumb bosom of this oblivious globe*
*Although as unknown beings we seem to meet,*
*Our lives are not aliens nor as strangers join,*
*Moved to each other by a causeless force.*
*The soul can recognoze its answering soul*
*Across dividing Time...*

**ఈ విస్మృతిపూర్ణప్రపంచపు మూకహృదయముపై**
**అజ్ఞాతవ్యక్తులు కలిసినట్లుగ తోచినప్పటికి,**
**మన జీవితాలు అన్యములు కావు, తెలియనివారమై కలియుటలేదు,**
**అజ్ఞాతశక్తిచే ఆకర్షితులము కాలేదు.**
**భేద్యమాన కాలాంతరమున**
**ఆత్మ తనకు బదులాడు ఆత్మను గుర్తించగలదు.**

ప్రేమ వైభవాన్ని సూచించటానికి శ్రీ అరవిందులీ సందర్భాన్ని ఉపయోగించుకుంటారు. ప్రేమ దివ్యమైనది, స్వయంగా బాలకృష్ణుడే!

The child-god is at play, he seeks himself
In many hearts and minds and living forms :
He lingers for a sign that he can know
And, when it comes, wakes blindly to a voice,
A look, a touch, the meaning of a face.

**బాలదైవంబు క్రీడాలోలుడయ్యె,**
**తనను దానెన్నొ హృదయాలలో మేధలలో**
**సజీవరూపాలలో వెదకికొనుచున్నాడు:**
**తాను గుర్తించగల్గిన అభిజ్ఞకై తచ్చాడు నతడు,**
**తల్లబ్ధి కలిగి, ఒక కంఠధ్వనికి మేల్కొను నంధుడై,**
**ఒక దృష్టి, ఒక స్పర్శ, ఒక ముఖభావమునకు.**

ప్రేమను గూర్చిన సత్యమిది. క్షుద్రబుద్ధులు ఈ దివ్యభావాన్ని మట్టిపాలు చేసిన చేతురు గాక.

Too far from the Divine, Love seeks his truth
And life is blind and the instruments device
And Powers are there that labour to debase.

**దైవానికి దూరస్థమై ప్రేమ వాని సత్యమన్వేషించు,**
**జీవితమంధము, సాధనంబుల మోసగించు,**
**నీచకృచ్ఛక్తులు నిరతము శ్రమించుచుండు.**

సర్వదా కాదనుకోండి. వేల సంవత్సరాల నిరీక్షణ, సంఘర్షణ, ఆకాంక్షలతో రాటుదేలి, కట్టకడపట ఒక ఆత్మ అవతారసామర్థ్యంతో సంసిద్ధమవుతుంది. అట్టి ఆత్మలు రెండు అడవిలో కలిసికొన్నవి. ఒక నూత్న భవిష్యత్తునకు సూచన.

*Attracted as in heaven star by star,*
*They wondered at each other and rejoiced*
*And wove affinity in a silent gaze.*
*A moment passed that was eternity's ray,*
*An hour began, the matrix of new Time.*

**తార తారాకృష్టమై దివిలో వలె**
**చకితులైరి వారు ఒండొరుల జూచి హర్షమందిరి**
**ఒక మూకదృగ్యోగబంధుత్వ మల్లిరి.**
**ఆనంత్యకిరణమౌ నొక క్షణము గడిచె,**
**ఒక గడియ మొదలాయె నూత్నకాలపు మాత్రికయై.**

***

## 3వ సర్గ - సత్యవంతుడు, సావిత్రి

పరస్పరం ఒక నిండైన చూపుతో సావిత్రీ సత్యవంతులకు తాము అపరిచితులం కామని స్పష్టమయింది. పూర్వం కూడా ఒకరికొకరు తెలిసినవారే అయియుండాలి. కాని, ఎక్కడ? ఏ జన్మలో? అది అలా ఉండగా, వారు "బాహ్యస్పృహాతిరస్కరిణి" (*the screen of external sense*) చేత బద్ధులైయున్నారు కనుక, ఆ గ్రహింపు వారిలో కావలసిన సాన్నిహిత్యాన్ని తేలేకపోయింది. అప్పుడే కాదు. మొదట మాటలు ఆగి ఆగి వచ్చినవి. సావిత్రి స్వభావతః మౌనం వహించింది. బహుశః ఆమె అతని గురించి మరింత తెలియవలసి ఉన్నది. సత్యవంతున కామె ఒక దివ్యదర్శనం. చకితుడై ఆతడిట్లా అడుగుతాడామెను :

*O thou who com'st to me out of Times silences,*
*Yet thy voice has wakened my heart to an unknown bliss,*
*Immortal or mortal only in thy frame,*
*For more than earth speaks to me from thy soul*
*And more than earth surrounds me in thy gaze,*
*How art thou named among the sons of men?*

**కాలనిశ్శబ్దతలనుండి నను జేరుదానా!**
**నీ స్వరము నా హృదయముననజ్ఞాతానందమున్**
**మేలుకొలిపె, మర్త్యమో అమర్త్యమో నీ శరీరము,**

**ఏలన నీ ఆత్మనుండి నాతో అతీతధారుణి భాషించు**
**అతీతధారుణి నన్‌జుట్టుకొను నీ చూపులో,**
**మానవులు నిన్నేపేరున ఎఱుగుదురు?**

ఆమె సమాధానంకోసం అగక, తన వృత్తాంతాన్ని చెప్పుకుపోతాడతడు. వాని మాటలు మెత్తనివి, సరళమైనవి, నిష్కపటమైనవి. అవి శుద్ధిచేయబడిన గాజు వలె వాని ఆత్మను సాక్షాత్కరింపజేస్తున్నవి.

*Earth could not hide from me the powers she veils*
*Even though moving mid an earthly scene*
*And the common surfaces of terrestrial things,*
*My vision saw unblinded by her forms;*
*The Godhead looked at me from familiar scenes.*

**తదీయ సమాచ్ఛాదితశక్తులన్**
**ధరణి నానుండి దాచగలేదు :**
**భౌమదృశ్యమధ్యగతయయ్యు**
**భౌమవస్తూపరితలసామాన్యయయ్యు,**
**ఆమె రూపాంధముగాక నాదృష్టి చూచె;**
**సుపరిచితదృశ్యములనుండి ఆ దేవత నన్ను జూచె.**

సావిత్రి తన మర్త్యదేహమున కతీతమగు ఒక శక్తియా? మానుషమైనను దివ్యమైనను, కొద్దిసేపు నిలిచి వానితో మాటాడవచ్చునుకదా. ఆమె దివ్యురాలైనట్లు కనిపిస్తున్ననూ, ఆమె తనవంటిదే అయియుండునని ఆతడాశించినాడు :

*Although to heaven thy beauty seems allied,*
*Much rather would my thoughts rejoice to know*
*That mortal sweetness smiles between thy lids*
*And thy heart can beat beneath a human gaze*
*And thy aureate bosom quiver with look*
*And its tumult answer to an earth-born voice.*

**నీ సౌందర్యము స్వర్లోకసంబంధిగా తోచినను,**
**నా భావనల్ హర్షాన నెంతయు తెలియగోరు**
**నీ కనుఱెప్పల మధ్యగల మధురస్మితములు మానుషమ్ములని,**
**నీ హృదయ మొక మానుషదృగ్గతి క్రింద స్పందిచునని,**

**నీ దేవతాదీప్త వక్షఃస్థలమొక చూపుతో కంపించునని,**
**దాని ఉద్ఘోష ఒక ధరణీజనితస్వరమునకు ప్రతిస్పందించునని.**

అంత సహజమూ, సరళమూ, నిష్కపటమూ! ఆమె నాతడు రథము దిగివచ్చి తమ ఆతిథ్యాన్ని స్వీకరించుమని ఆహ్వానిస్తాడు. తన తండ్రి ఆశ్రమం చేరువలోనే ఉన్నదనీ, పొడవైన వృక్షాలతో అది నిండి ఉన్నదనీ, పూలమొక్కలూ పక్షుల పాటలూ ఉన్నాయని అంటాడు. పట్టణాలకు దూరంగా ఉంటూన్నమాట నిజమే. "మౌని జీవితం నిరాడంబరం, నిర్వ్యాజం, వన్యం." ("bare, simple is the sylvan hermit-life.") అయినప్పటికీ ప్రకృతి మాత ప్రసాదించినవన్నీ సమృద్ధిగా వారికున్నాయి కదా? సావిత్రి తమ కుటీరంలో కొంతసేపు విశ్రమించవచ్చునంటాడు. నిష్కల్మషమూ పారదర్శకమూ అయిన ఈ యువకుని మాటలు సావిత్రిని గాఢంగా తాకినవి. ఆమె సమాధానం వాని ప్రశ్నలకు దీటుగా ఉన్నది. ఆమె ఇలా అంటుంది : "నేను సావిత్రిని, మద్రరాజకుమారిని." తనను గురించి ఇంతమాత్రమే ఆమె చెప్పవలసింది. ఆమె అతనికొక ప్రశ్నపరంపరను సంధిస్తుంది. ఎవరతడు? వాని పేరేమి? వాని కుటుంబమెవరు?

సత్యవంతుడు సంతోషంగా ఆ వివరాలు చెబుతాడు. తాను ఒకప్పుడు సాల్వదేశానికి రాజైన ద్యుమత్సేనుని కుమారుడు. కాని తండ్రి అంధుడైపోవటం వలన వారికి కష్టాలు కలిగినవి :

*A living night enclosed the strong man's paths,*
*Heaven's brilliant gods recalled their careless gifts,*
*Took from blank eyes their glad and helping ray*
*And led the uncertain goddess from his side.*
*Outcast from empire of the outer light,*
*Lost of the comradeship of seeing men,*
*He sojourus in two solitudes, within,*
*And in the solemn rustle of the woods.*
*Son of that king, I, Satyavan, have lived contented...*

**ఆ బలవంతుని బాటల నావరించెనొక జీవద్రాత్రి,**
**కాంతిమత్ స్వర్లోకదేవతలు తమ నిరపేక్షప్రదానాల నివర్తించినారు,**
**శూన్యనేత్రాల నుండి తమ హర్షోపకారికిరణాలనూడ్చి**
**చంచలదేవతన్ వానినుండి తప్పించినారు.**
**బాహ్యకాంతిసామ్రాజ్యబహిష్కృతుండై,**
**కనులు గలవారి స్నేహంబు గోలుపోయి,**

**ఏకాంతద్వయమందతండు ప్రవాసియయ్యె,**
**అంతరంగానను, పుణ్యాటవీ మర్మరధ్వనిలో.**
**ఆ రాజు కొమరుండ సత్యవంతుడ నేను**
**సర్వదా సంతుష్టుడై జీవించువాడ...**

సత్యవంతుని సుదీర్ఘోపన్యాసము వాని ఆశయాలను, ప్రకృతిపుత్రుడుగా అనుభవాలను చెప్పి, సావిత్రి రాకతో తాను నిశ్చయంగా జీవనయోగాన్ని మరల పొందగలనని ముగింపునిస్తుంది. "అది మృత్యువు నుండి అజ్ఞానము నుండియున్ ముక్తమగును." (*It shall escape from Death and Ignorance.*) వెంటనే సావిత్రి ఆతనిని మాట్లాడుతూ ఉండమని కోరుతుంది. ఎందుకంటే, ఇన్నాళ్ళూ తా నాతనికోసమే అన్వేషిస్తూన్నట్లు గుర్తించింది. సత్యవంతుడు హర్షాతిరేకంలో దివ్యత్వస్పర్శగల ప్రేమ కవిత్వవిస్ఫోటం చేసి, ఆమె కాహ్వానం పలుకుతాడు : "నా జీవితంలోనికి ప్రవేశించుము." (*Enter my life*). ఆమె సమాధానం దృఢమైనది, సరళమైనది, నిశ్చితమైనది :

*O Satyavan, I have heard thee and I know;*
*I know that thou and only thou art he.*

**హే సత్యవాన్ । నిన్ విన్నాను, తెలిసికొన్నాను;**
**తెలిసికొన్నాను నీవే, నీవు మాత్రమె, ఆతడని.**

ఆమె మరేమీ మాటాడకుండ వేగంగా దగ్గరలో ఉన్న కొన్నిపూలను ఏరుకొని, మాల కడుతుంది, "తన సమర్పిత జీవితమునకు పుష్పసంకేతము" (*a flower symbol of her offered life.*). ఆమె అతని మెడలో ఆ పూలదండవేసి, వంగి, పాదములంటి నమస్కరించటం అన్న సాంప్రదాయికపుటాచారం పాటించబడగా, ఆమె తన సమస్త సత్తను సత్యవంతునకు సమర్పిస్తుంది. ఆతడు వంగి ఆమెను పైకి లేవనెత్తి స్వీకరిస్తాడు. శ్రీ అరవిందుని మంత్రాక్షరాలు చక్కగా వివరిస్తాయి :

*On the high glowing cupola of the day*
*Fated tied a knot with morning's halo threads*
*While by the ministry of an auspice-hour*
*Heart-bound before the sun, their marriage-fire,*
*The wedding of the eternal Lord and Spouse*
*Took place again on earth in human forms :*
*In a new act of the drama of the world*
*The united Two began a greater age.*

ఉన్నత ప్రకాశమానదివోగోపురముపై
ప్రాభాతపరివేషసూత్రములతో ముడివేసె నవ్విధి
ఒక శుభముహూర్తకర్తృత్వమున,
తద్వాహాగ్నియౌ సూర్యసమక్షమున,
హృదయబంధమై నిరంతరప్రభూవధువుల పెండ్లి
మానుషరూపములలో పుడమిపై పునస్సంభవమాయె :
జగన్నాటక నూతనాంకముగ
ఒకరైన ఇద్దరు మహత్తరశకము నారంభించినారు.

* * *

## 6వ కాండ - విధికాండ

## 1వ సర్గ - విధి వచనము

విధికాండకు కొంత ప్రత్యేకత ఉన్నది. దీనిని శ్రీ అరవిందుల సునిశ్చిత సందేశంగా పరిగణించవచ్చు. వారు చెప్పి వ్రాయించిన కావ్యభాగాలలో కొన్ని ఈ కాండకు చెందినవి. ఇందలి రెండు సర్గల విషయం కూడా చాలా గంభీరమైనది, మానవుడెదుర్కొంటూన్న అంతం లేని సమస్యతో పోరాడేది. మానవుడు పూర్వనిర్ణీతమైన విధికి బద్ధుడై యున్నాడా? అతడు కేవలం విధి ఆడించే ఒక స్వయం చలన యంత్రామా? లేక తన ఇచ్ఛననుసరించి ప్రవర్తించగల స్వేచ్ఛాసంకల్పం వానికి ఉన్నదా? ఒక్క మాటలో, ఆతడొక పట్టుబడిన ఖైదీయా? లేక స్వేచ్ఛగల వ్యక్తియా?

సావిత్రీ సత్యవంతులను అరణ్యంలో విడిచి, మనం మళ్ళీ వెనక్కి అశ్వపతి రాజగృహానికి వచ్చాం, వానిని కలుసుకోవాలని నారదమహర్షి గగనసంచారియై వచ్చియున్నాడు. ఆ మహర్షి ఆకాశం నుండి దిగుతుండగా, వాని రాగాలు వాని అవరోహణలోని స్థాయిల వర్ణాలను ప్రతిఫలిస్తాయి.

He passed from the immortal's happy paths
To a world of toil and quest and grief and hope,
To those rooms of the see-saw game of death with life.

**అమర్త్యసంతోషమార్గాలు గడచి వచ్చెనతడు**
**శ్రమాన్వేషణదుఃఖాశాయుతప్రపంచమునకు,**
**మరణజీవన ఊర్ధ్వాధశ్చలనక్రీడా కక్షలకు.**

విష్ణుదేవుని ఈ సృష్టిని గురించి అతడు గానంచేస్తాడు, "ఈ గహన ప్రపంచపు పుట్టుకను గూర్చియు సంతోషమును గూర్చియు", భక్తి ప్రపంచమును గూర్చి. అశ్వపతి తన రాణితో సంభాషిస్తూండగా సావిత్రి, "ప్రేమప్రకాశపరివేష పరివర్తితయై" (changed by the halo of her love), మండపం ప్రవేశిస్తుంది. ఋషి నారదుని "విశాల దివ్యదృష్టి"కి (vast immortal look) సర్వం విదితమవుతుంది, కాని ఏమీ తెలియనివానివలె మాట్లాడుతాడు :

Who is this that comes, the bride,
The flame-born, and round her illumined head
Pouring thier lights her hymeneal pomps
Move flashing about her? From what green glimmer of glades
Retreating into dewy silences

*Or half-seen verge of waters moon-betrayed*
*Bringest thou this glory of enchanted eyes?*

**"ఈ వచ్చువారెవ్వరు? పెండ్లికూతురు,**
**జ్వాలాప్రసవ, తదీయ కాంతిమన్మస్తకము చుట్టు**
**తద్వైవాహికవైభవ కాంతులు వెల్లువగా తటిచ్చరించు.**
**ఏ వనతరు మార్గహరిత్ప్రకాశమునుండి**
**తుషారమూకభావనలలోనికి విరమింతువో**
**లేక చంద్రికోన్మిషితార్థదర్శితనీరధారలనుండి**
**ఈ మంత్రముగ్ధాక్షిప్రభన్ దెత్తువో నీవు?**

శృంగారాన్నీ దర్శనాన్నీ సమ్మిళితం చేసిన ప్రసన్న కవితావృష్టి సందిగ్ధార్థంలో ముగింపు పలుకుతూన్నదిక్కడ : "శాశ్వతంగా ప్రళయాన్ని నిద్రించనిచ్చినట్లయితే!" (*If for all time doom could be left to sleep!*) ఒక మహావ్యక్తిగా మనోహరమైన సావిత్రి వర్ణనం, ఆమె తల్లితండ్రులకు కర్ణామృతంగా ఉన్నప్పటికీ, అది ఒక అపశకునంగా తోచి యుంటుంది. వింటూన్న అశ్వపతి శ్రవణేంద్రియం శ్రద్ధాళువైయున్నది. ఆత్మదర్శనం గలవాడైన అశ్వపతి తన ఆకులతను కప్పిపుచ్చుతూ తన కుమార్తెను ఆశీర్వదించుమని ఆ మహర్షిని కోరినాడు. ఆ క్షణం మాత్రమే తాను సావిత్రి అశ్వపతి కుమార్తెయని తెలుసుకున్నట్లు, నారదమహర్షి ఆమె ఇంతకాలంగా ఏమి చేస్తూన్నదని తెలియగోరినాడు. ఆమె అభిలాషను తెలుసుకుంటాడు. ఏదో అవాంఛనీయ విషయం ఉన్నదని అశ్వపతి గ్రహిస్తాడు, కాని ఏమీ లేనట్లే ఇట్లా అంటాడు :

*If this is all, then all is surely well;*
*If there is more, then all can still be well.*
*Whether it seem good or evil to men's eyes,*
*Only for good the secret Will can work.*

**ఇంతమాత్రమెయైన, అంతయు మేలగు నిశ్చయముగ;**
**ఇంతకు మించియున్నను, అంతయు మేలేకాగలదప్పుడైన.**
**మానుషదృష్టికిం గీడో లేక మేలో యనిపించినన్**
**ఎఱుగరాని ఆ సంకల్పము మేలుమాత్రమె జేయనుద్యమించు.**

అయినప్పటికిని, నారదర్షిముఖంలో అశ్వపతి గమనించినదాని బట్టి సావిత్రి కాతడు హెచ్చరికలు జెప్పగోరినాడు. రాజాతనిని వివరాలేమీ చెప్పవద్దంటాడు. ఎందుకంటే, భవిష్యత్తును తెలిసికొని దానిని గురించి ముందే చింతించటం కంటె అది తెలియకుండటం

మేలు కదా. ఇంతలో మాతృహృదయానికి నారదాశ్వపతుల మాటలలోని విషాదచ్ఛాయలు గోచరిస్తాయి. సత్యవంతుని తల్లితండ్రులు అడవులలో ఉంటూన్నారని ఆమె విన్నది కనుక తన కుమార్తెకు కఠోరజీవనం తప్పదనుకున్నది. ఆ మగవారిని బాధిస్తూన్న విషయం అదే అయితే, స్త్రీలెంత కఠినులో ఆమె వారికి చెప్పదలచింది.

Here is no cause for dread, no chance for grief
To raise her ominous head and stare at love.
A single spirit in a multitude,
Happy is Satyavan mid earthly men
Whom Savitri has chosen for her mate,
And fortunate the forest hermitage
Where leaving her palace and riches and a throne
My Savitri will dwell and bring in Heaven.

**భయమునకిట కారణములేదు, అవకాశమున్ లేదు**
**శోకమునకు తన అశుభశిరమెత్తి ప్రేమను మిట్టి చూడ.**
**ఒక సమూహమందేకైక చైతన్యమై**
**భూమి జనులందు సత్యవంతుండు సంతుష్టుడగును.**
**వాని వరియించె సావిత్రి తన వరునిగా,**
**భాగ్యశాలియౌ తదరణ్యాశ్రమంబు :**
**రాజసౌధంబు, సంపద, సింహాసనంబు విడిచి**
**నా సావిత్రి ఎచ్చోట వసించు నట స్వర్లోక మవతరించు.**

తన కుమార్తె ఎట్టి పరిస్థితులలోనైన సమర్థించుకుపోగలదన్న ఆమె మాతృగర్వం చూడముచ్చటవుతుంది. అయినాగాని, తన కుమార్తె సత్యవంతుని పెండ్లాడినట్లయితే, సంపదలు కోల్పడిన గృహవాసము గాక, అంతకు మించిన భయకారణమేదైనా ఉన్నదా అని ఆమె ఆశ్చర్యపడుతుంది. నారదుడు అశ్వపతికి సత్యం తెలియటం ఇష్టం లేదు కనుక, సమాధానం దాటేస్తాడు, "భవిష్యద్జ్ఞానము మరింత బాధాకరము" (a future knowledge is an added pain.) కాని ఆమె వానిని ప్రార్థిస్తుంది. ఆతడు చివరకు విశదం చేస్తాడు. అన్ని విధాలా సత్యవంతుడు యోగ్యుడు. ఈ ప్రస్తావనకు ఒక్కటే ఇబ్బంది ఉన్నది :

Heaven's greatness came, but was too great to stay.
Twelve swift-winged months are given to him and her;
This day returning Satyavan must die.

**దివ్యమహత్వము వచ్చె, కాని నిలువరానంత మహత్వమాయె.**
**ఆమె కాతనికి గూఢత్వరమాణవత్సరమె వ్యవధియాయె;**
**ఈ రోజు మరలిరాగా, సత్యవంతుడు మరణించు.**

రాణి శోకాకులయైనది. సావిత్రిని మనసు మార్చుకొమ్మనినది. సావిత్రి సమాధానం గుర్తుంచుకొని జీవితకాలమంతా హృదయస్థంగా కాపాడుకోవలసినది :

*Once my heart chose and chooses not again.*
*The word I have spoken can never be erased,*
*It is written in the record book of God...*
*Death's grip can break our bodies, not our souls;*
*If death take him, I too know how to die.*
*Let fate do with me what she will or can;*
*I am stronger than death and greater than my fate;*
*My love shall outlast the world, doom falls from me*
*Helpless against my immortality.*
*Fate's law may change, but not my spirit's will.*

**నా హృదయ మొకపరి వరియించె,**
**వరియింప బోదు మరియొక్క సారి.**
**నే నాడిన మాట చెఱుపరాని దేనాటికైన,**
**అది లిఖితమాయెను దైవశాసనముగ...**
**ఒడిసి పట్టిన మృత్యువు దేహాల నెడబాపు,**
**విడదీయ జాలదు మా ఆత్మయుగము;**
**మృత్యువాతని గ్రసించిన నేమాయె?!**
**ఎఱుగనా నేనును మరణించుటెట్లో?**
**చేయనెంచినంత, చేయగల్గినంత చేయనిమ్ము విధిని;**
**నేను మృత్యువుకంటె, నా విధికంటెను బలవత్తర నౌదు;**
**నాప్రేమ లోకంబులెడల నిల్చు, ప్రళయము నా కోడి**
**నా అమర్త్యత్వము నెదుర నిరవలంబమగును.**
**విధి శాసనము మారవచ్చు, కాని**
**మారబోదు నా ఆత్మసంకల్పమెపుడు.**

❊ ❊ ❊

## 2వ సర్గ – విధి పథము, యాతనా సమస్య

సావిత్రి దృఢంగా ఉన్నది. ఆమె మరల వరించదు. ఆమెకు సత్యవంతుడే తప్ప వేరొకరు కాదు. నారదర్షి, మహాయోగి అశ్వపతి వారి వారి ఆత్మల స్వేచ్ఛలలో మౌనం వహించినారు. కాని రాణీ మాళవి మానుషబంధనాలలో చిక్కికొన్నది, కనుక తన భగ్నాశను మాటల రూపంలో వెలువరించక తీరదు. ఆ మాటలు మాతృహృదయానివి, తన బిడ్డ బాధను చూడలేని తల్లివి. నిత్యజీవితంలో తారసిల్లే ఒక సాధారణ మానవ హృదయోద్వేగమిది. ఇది నాకెందుకు జరగాలి? ఇట్లా నా బిడ్డ కెందుకు జరగాలి? నా కుటుంబమొక్కటే ఈ బాధాభారాన్నీ, మృత్యుభారాన్నీ ఎందుకు భరించాలి?

*Voicing earth's question to the inscrutable power*
*The queen now turned to the still immobile seer :*
*Assailed by the discontent in Nature's depths,*
*Partner in the agony of dumb driven things*
*And all the misery, all the ignorant cry,*
*Passionate like sorrow questioning heaven she spoke.*

**అయ్యచింత్యశక్తికి పుడమి ప్రశ్నను సంధించుచు**
**ఆ రాణి నిశ్చలాచ్యుత ద్రష్టవైపిపుడు మరలె :**
**ప్రకృతి అగాధములలోని అసంతృప్తి తాకున**
**వాగ్రహితవస్తువేదనలో భాగస్వామినియై**
**సమస్తదుఃఖములో, సమస్త అజ్ఞాతాక్రందనలో,**
**ఉద్వేజితయై దుఃఖమువలె దైవము ప్రశ్నించెనామె.**

అందమైన ఈ భూమిని సృష్టించినది దేవుడేనా? దానిని ధ్వంసం చేసినది రాక్షసుడా? స్పష్టంగా, ప్రారంభంలోనే, ఒక ప్రాణాంతక బీజం నాటబడింది. దాని ఫలితంగా అసత్తు సత్తును శాశ్వతంగా పెనవేసికొన్నది. ఈ అనిష్ట వివాహ ఫలాలను అందరూ చూస్తూనే ఉన్నారు. విధికృతమైన ఈ వినాశం కాక, మానవుడు తన స్వభావం నుండి ఉదయించిన అశుభాల (కోరికలు, ఉద్వేగాలు) వలన పీడితుడై, తన ఇంటిని తానే తగులబెట్టుకునే స్థితికి చేరినాడు. వాని మేధస్సు ప్రకృతిని వదిలిపెట్టదు, నిప్పుతో చెలగాటం తప్పదు.

*This mortal creature is his own worst foe.*
*His science is an artificer of doom;*
*He ransacks earth for means to harm his kind;*
*He slays his happiness and other's good.*

*Nothing has he learned from Time and its history.*

**ఈ మర్త్యజీవుడు తనకుదానె బద్ధశత్రువు.**
**వాని విజ్ఞానము వాని వినాశ శిల్పి;**
**స్వజాత్యపకారకోపకరణాల ధాత్రి గాలించి పట్టు;**
**స్వీయసంతోషమున్ పరహితంబు త్రుంచు.**
**కాలగతి చరిత్రలనుండి ఆతడు నేర్చినదేమి లేదు.**

ఇట్లా ఎందుకు జరగాలి, అని రాణి అడుగుతుంది. శాంతి సౌభాగ్యాలు ప్రపంచంలో ఎందుకుండకూడదు? బాధ, మరణం మానవజీవితాన్ని, మానవ సాఫల్యతలను నవ్వులపాలు చేస్తూ ఉండవలసిందేనా? బహుశః ఈ ప్రపంచం నిజంగానే మాయగాబోలు. ఇప్పుడామె ఒక శూన్యవాది వలె మాట్లాడుతుంది :

*Perhaps the soul we feel is only a dream,*
*Eternal self of fiction sensed in trance.*

**మనము భావించు ఆత్మ కేవలమొక స్వప్నమేమొ,**
**ఆత్మ శాశ్వతత్వము తన్మయావస్థలో గ్రహించు**
**నొక కల్పన మాత్రమేమొ.**

ఇదొక దీర్ఘోపన్యాసం. అశ్వపతి ఒక ముక్తిప్రదాతకైన లోకాశయానికి ప్రతినిధి అయినట్లయితే, వాని రాణి మానవ కుటుంబమంతా, జీవన్మరణాలతో, నిశ్చేష్టులైనవారి ప్రశ్నలకు ప్రతినిధి. ఆతడున్నత చేతనకు ప్రతినిధి, ఆమె సాధారణ మానుషస్థాయికి. నారదర్షి నిదానంగా ప్రారంభించాడు.

*Was then the sun a dream because there is night?*
*Hidden in the mortal's heart the Eternal lives.*
*He lives secret in the chamber of thy soul,*
*A light shines there nor pain nor grief can cross.*
*A darkness stands between thyself and him,*
*Thou canst not hear or feel the marvellous Guest,*
*Thou canst not see the beatific sun.*
*O queen, thy thought is a light of the Ignorance,*
*Its brilliant curtain hides from the God's face.*

**రాత్రియున్నదిగాన సూర్యండు స్వప్నమా?**
**శాశ్వతుడు మర్త్యహృదయాలలో దాగి యుండు :**

**వాడు నీ ఆత్మరహోమందిరాన నుండు,**
**అటనొక్క జ్యోతివెల్గు, బాధాదుఃఖముల్ రావు.**
**నీకున్ వానికి మధ్య నిల్చునొక అంధతమస్సు,**
**అయ్యద్భుతాతిథి ఉనికిన్ సర్వం బెరుగలేవు,**
**తన్మోక్షప్రదసూర్యుని గాంచలేవు నీవు.**
**ఓ రాజ్ఞి, నీ చింతన మజ్ఞానకాంతిరేఖ,**
**తత్ప్రకాశయవనికాభ్యంతరమున దాగు**
**దేవుని ముఖము.**

ఎవరైన పూర్ణసత్యాన్వేషణ చేయవలె గాని పాక్షిక సత్యమును కాదు, అని ఆ ఋషి ఆమె నుద్బోధిస్తాడు. భారతదేశంలో రాత్రి యున్నది కనుక, అప్పుడిక సూర్యుడే లేడనగలమా? మరియొక చోట ఆతడున్నాడు. దైవ విషయముగూడ ఇట్టిదే. కాని, పాక్షిక జ్ఞానంతో మనం తొందరపాటుగా సిద్ధాంతం చేస్తాము. అలెగ్జాండర్ పోప్ (Alexander Pope) అన్నది నిజం :

*A little learning is a dangerous thing;*
*Drink deep, or taste not the Pierian spring;*
*There shall droughts intoxicate the brain,*
*And drinking largely sobers us again.*

**అల్పజ్ఞానము ప్రమాదహేతువగు;**
**పూర్ణాస్వాదనమో లేక తద్వారధీజల–**
**మానకుండుటయొ తగున్.**
**గండూషమాత్రజలమట మేధనున్మత్తముజేయు,**
**గాఢపానంబు మరల అమత్తుల జేయు.**

ఆ రీతి ఆ ఋషి రాణి మోహాన్ని శాంతింపజేయాలని ప్రయత్నిస్తాడు. లోకం అంతా బాధా మరణాలతో నిండి ఉన్నదనటం కాదనలేము. అది కూడా సృష్టిలో భాగమే. కాని, ఎవరైనా సరే, మన హృదయకుహరాలలో ఆ దైవం ప్రకాశిస్తున్నాడు, అన్నదానిని కాదనలేరు. ఒక విషాదాన్ని మనం బాధగా అనుభవిస్తున్నామంటే, అది పూర్తిగా మన అజ్ఞానం కారణంగానే. ఈ బాధ చాల అవసరమైన ఒక ఉపకరణం, తాను పరిపూర్ణుడుగా రూపొందాలని భావించే వ్యక్తికి. సృష్టిలోని పరిణామ దశలకు నిజానికి బాధ నిమిత్త కారణం అవుతుంది. మనం ఇప్పటికే మేధోదశకు చేరుకున్నాము. ఇప్పుడింక మేధస్సు కంటె ఉన్నత స్థరాలలోనికి పరిణామం సాగాలి, కనుక బాధ, "దేవతల సమ్మెట" (the

*hammer of the Gods*), అవసరమైనంత కాలం ఉంటుంది.

మార్గదర్శనం చేయటానికి దివ్యుడు అవతారాలను ధరించి, ఈ సత్యాన్ని మానవునకు బోధించే నిమిత్తం బాధననుభవిస్తాడు. ఆశ్చర్యపరచే ఒక కావ్యఖండంలో, నారదర్షి శిలువమీద యేసు ఉదాహరణను రాణి ముందుంచుతాడు :

*The Eternal suffers in a human form,*
*He has signed salvation's testament with his blood...*
*It is finished, the dread mysterious sacrifice,*
*Offered by God's martyred body for the world;*
*Gethsemane and Calvary are his lot,*
*He carries the cross on which man's soul is nailed.*

**ఆ శాశ్వతుడొక మానుషరూపంలో**
**తన రక్తంతో మరణశాసనానికి సంతకం చేసినాడు...**
**ఆ భయంకరాద్భుతయజ్ఞం సమాప్తమైనది,**
**ప్రపంచంకోసం దేవుని పరిత్యక్తదేహం సమర్పితమైనది;**
**గెత్సెమనె, కల్వరి, వాని విధి,**
**మానవుని ఆత్మ కీలితమైన శిలువనాతడు వహించు.**

ఇదంతా పరిణామంలో ముందడుగుకు బాట పరుస్తుంది. ఋషి, సావిత్రికి బాధలు తప్పవని సూచిస్తూనే, ఆమె విజయం కూడా తథ్యమని సూచిస్తాడు. సావిత్రి ఒక మహాశక్తిరూపం అన్న అశ్వపతితో తాను ఏకీభవిస్తాడు. ఒకవేళ ఆమె మృత్యువు నెదుర్కొనవలసి వచ్చినప్పటికి, మానవజాతి భవిష్యత్తు కోసం ఆమె గెలిచి తీరుతుంది. నారదర్షి, ఒక అభయం లాంటి ఆశీర్వచనం ప్రసాదించి సెలవంది వెళ్ళిపోతాడు :

*For out of danger and pain heaven-bliss shall come,*
*Time's unforeseen event, God's secret plan.*

ఏలన, అపాయమునుండి, బాధనుండి
స్వర్గానందముదయించును,
అది యనూహ్యకాలఘటన, దేవుని రహస్యోపాయము.

ఇది కూడ, అసంభావ్యపీడ, ఉగ్రవాదం, మృత్యువు, వీనితో నిండిన ఈ అనిశ్చిత ప్రపంచంలో చిక్కుపడిన మనకు శ్రీ అరవిందులిచ్చిన ఒక అభయం.

* * *

## 7వ కాండ - యోగకాండము.

## 1వ సర్గ - సమాగమ సంతోషము; మరణమును గూర్చి పూర్వజ్ఞానము; హృదయవేదన, బాధ.

మనమిప్పుడు మహావాగ్వాదంలో ప్రవేశిస్తున్నాము. పూర్వనిర్ణీతవిధియా? లేక స్వేచ్ఛాసంకల్పమా? మన జీవితాలలో సమస్తమూ ముందే నిర్ణయింపబడినదా? లేక, మన జీవిత గమనాన్ని మార్చుకోవటానికేదైనా మార్గమున్నదా? మానవునికి ఎంపిక చేసికొనే అవకాశమైతే ఉన్నదికాని, ఆ ప్రాధమ్యం కూడా పూర్వనిర్ణీతమేనా? అంటే, దాని అర్థం వానికి నిజమైన స్వేచ్ఛాసంకల్పం లేదనియేనా? అయినాగాని, అట్టి ఆశలు వంచనలన్నింటికీ పైన ఒక నిర్వివాద సన్నిధి ఉన్నది : దేవుని అనుగ్రహం. నారదర్షి ఒకవేళ సత్యవంతుడొక సంవత్సర కాలంలో మరణిస్తాడని చెప్పినట్లయితే, ఏమీ పరవాలేదు. విధి యేవిధంగా అనుల్లంఘనీయమో, అదేవిధంగా అనుగ్రహం కూడా అనివార్యమే. ఇది శ్రీ అరవిందుల సందేశం.

దైవానుగ్రహాన్ని పొందేదెట్లా? నిరంతరం ప్రసరించే దైవానుగ్రహాన్ని పొందటానికి తగిన పాత్రతను పొందేవిధంగా మనల్ని మనం శక్తివంతులుగా చేసుకోవటం ఎట్లా? ఈ విషయం గురించి 'యోగకాండ' (The book of Yoga) విచారణ చేపట్టింది. సావిత్రి సత్యవంతుని పెండ్లాడి అరణ్యం లోని ముని ఆశ్రమంలో, సాళ్వరాజ్యం పొలిమేరల్లో, నివసించటానికి వచ్చింది. ఆమె అడవిని గూర్చి ఎవరితోనూ మాట్లాడదు. బాహ్యంగా, ఆమె అంతరంగంలోని కల్లోలం ఎవరికీ తెలియదు. ఎందుకంటే, ఆమె గృహంలో దోషరహితమైన ఒక కోడలుగా జీవిస్తుంది.

The sorrowing woman they saw not within.
No change was in her beautiful motions seen :
She made herself the diligent serf of all,
Nor spread the labour of broom and jar and well,
Or close gentle tending or to heap the fire
Of alter and kitchen, no slight task allowed
To others that her woman's strength might do.
In all her acts a strange divinity shone :
Into a simplest movement she could bring
A oneness with earth's glowing robe of light,
A lifting up of common acts by love.

**చింతాంతరంగస్త్రీని దర్శింపరైరి వారు.**
**తత్సుందర చలనంబు లవికారంబులై కన్పించె :**
**ఒకనాటి ఆరాధ్యసామ్రాజ్ఞి సేవామగ్నయయ్యె,**
**సర్వేషాం జాగృతదాసిగా తనంత దానాయె,**
**కసవూడ్చ, కుండతో నీరు దేగ వెనుకాడదాయె,**
**సన్నిహితభద్రసేవలన్, స్త్రీయోగ్యకార్యములన్,**
**అల్పంబులైన, నొరుల దాక రానీదు,**
**దేవగృహ పాకగృహాగ్నిజ్వాలనల్ విడదు.**
**తత్కార్యములం దెల్లెడ నొక దివ్యత్వము వెల్గ :**
**సరళతమచలనమందైన నొక ధరావసనకాంతి,**
**సామాన్యకార్యముల్ ప్రేమోదాత్తత దాల్చె.**

సత్యవంతునితో ఆమె వైవాహిక జీవితం సుందరంగా సాగింది. అప్పుడప్పుడు తన అంతరంగంలోని భారాన్ని అతనితో పంచుకోవలెనన్న ఊహ కలిగినప్పటికీ, ఆ ఆలోచననామె నెట్టివేసింది. తాను ప్రేమించిన సత్యవంతునకు ఆందోళన కలిగించటాని కామె ఇష్టపడలేదు. ఆతని కామె చెప్పకపోయినప్పటికీ, అంతా సవ్యంగా లేదని అతడు గ్రహించినాడు. ఆమె ముఖంలో ఏదో నీడ కదల్తూండటాన్ని అతడు గమనించే ఉంటాడు.

*All of his speeding days that he could spare*
*From labour in the forest hewing wood*
*And hunting food in the wild sylvan glades*
*And service to his father's sightless life.*

**ధావదాయుర్దివంబు లెల్ల నతడు**
**కట్టెల గొట్టుచు, వన్యపథముల**
**నాహారమున్ వేటాడుచున్ గడిపె**
**నిజాంధపితృజీవనసేవాంకితుడై.**

ఆతడంత ప్రేమపూర్ణుడైయున్నప్పుడు, సావిత్రి వారి సంయోగమును మేఘావృతమెట్లా చేయగలదు?

ఆతడు మరణభీతుడు కాకపోవచ్చునని ఆమె తెలిసికొన్నది. కాని తన తల్లిదండ్రులను నిస్సహాయులుగాను సావిత్రిని దుఃఖములోనూ వదిలి వెళ్ళుటకు తప్పక బాధపడును.

అదే సమయంలో ఆమె భవితవ్యాన్ని గురించి చేయదగిన దానిని గురించి ఆలోచన చేస్తూన్నది. దానికొక సులభపరిష్కారం ఉండనేఉన్నది, హేతుబద్ధం కాకపోయినా సంప్రదాయసిద్ధమైన 'సతి' అనే ఆచారం. కాని 'సహగమనం' అనే ఆ చిత్రమైన సంతోషాన్నామె నిరాకరించింది. ఎందుకంటే, ఆమె మాతృహృదయానికి "ఆ విచారగ్రస్తులైన తల్లిదండ్రులకు తన అవసరం ఇంకా ఉన్నదని" తెలుసు.

శ్రీ అరవిందులు వివాహితులైన దంపతుల సహవాసంలోని 'ధర్మకామా'న్ని చక్కగా చిత్రించినారు. అది దివ్యప్రేమయోగానికి బంధువు "సాక్షాత్ యోగసారం". భక్తి యోగంలోని ఉత్తమస్థితి అద్వైతంలోని ద్వైతభావం, నాయక-నాయకీ లేక రాధాకృష్ణ భావం. వారు తమ "సంయోగాత్మక యోగం" లో ఇట్లా అంటారు.

"ఇక్కడ కోరబడింది ప్రేమమాత్రమే, భయంకరమైనది ప్రేమభంగము మాత్రమే, ఒకే ఒక దుఃఖము విరహమే; ఎందుకంటే మిగతావన్నీ ప్రేమించేవారి విషయంలో లేనే లేవు, లేదా సంఘటనలుగా, ఫలితాలుగా వచ్చేవే, అంతే తప్ప ప్రేమకు లక్ష్యాలుగానో నిబంధనలుగానో ఉన్నవి కాదు. ....ప్రేమ ఒక ఉద్వేగం, దానికి కావలసినవి రెండు విషయాలు : శాశ్వతత్వం, తీవ్రత. ప్రేయసీప్రియుల బాంధవ్యంలో ఈ రెండిటికై అన్వేషణ సహజావబోధంగానూ ఆత్మజాతంగానూ ఉంటుంది. ఒకరినొకరు స్వకీయం చేసికొనటమే ప్రేమ, ఈ ప్రయత్నంలోనే ఈ స్వకీయబావం సంపూర్ణత్వాన్ని పొందుతుంది."

సావిత్రీ సత్యవంతుల వైవాహిక దంపత్ప్రేమ సీతారాములు, నలదమయంతులు, సుకన్యాచ్యవనులు సందీప్తం చేసిన గొప్ప సంప్రదాయ పరంపరకు చెందినది. సావిత్రీ సత్యవంతులు, శరీరమూ ఆత్మా కూడా, ఎంతగా మమేకమైనారంటే, వారింకెప్పటికీ విడదీయరానివారే అన్నంతగా :

For when he wandered in the forest, out
Her conscious spirit walked with him and knew
His actions as if in herself he moved;
He, less aware, thrilled with her from afar.

**ఏలన నాతడు వనమున తిరుగాడు చుండ, తఱచుగ**
**ఆమె చేతనాత్మ వానితో నడచె, వాని చేష్టలెఱిగె**
**తనలోనె ఆతడు సంచరించినయట్లు;**
**ఆతడో, అల్పతర జ్ఞానాన, దూరస్థయైన**
**ఆయమతో పులకించె.**

వ్యాసుని ఉపాఖ్యానంలో, సంవత్సరం పూర్తి కావస్తూండగా సావిత్రి త్రిరాత్ర వ్రతం చేసిందని చెప్పబడింది. ఆమె ఉపవాసముండి, ప్రార్థన చేసి, ఒక కొయ్య దుంగవలె నిశ్చలంగా నిలబడి ఉన్నది. వ్రతపు మూడవనాటి రాత్రి గడిచిపోతూండగా, సావిత్రి అగ్నికి నిషేకం సమర్పించి, వ్రత సమాప్తి చేసి, ఆ అరణ్యాశ్రమంలో పెద్దలకు నమస్కరిస్తుంది. వారందరు ఆమెకు చిరకాలవైవాహిక జీవితం లభించుగాక, అని ఆశీర్వదిస్తారు. వ్రత సమాప్తి అయిన తరువాతనే సావిత్రి సత్యవంతుని అనుసరించి అడవికి వెళ్ళుతుంది.

శ్రీ అరవిందులు ఈ త్రిరాత్రివ్రతాన్ని 'యోగకాండ'గా మార్చినారు. ఇందులో వారు తన విషమపరీక్షను ఎదుర్కొనే నిమిత్తం సావిత్రి చేసిన రహస్యసాధనకు గల ప్రాముఖ్యాన్ని వివరించినారు. మనమిప్పుడు ఈ భాగ్యవంతమైన, సాధనానుకూలమైన, కాలపరీక్షకు నిల్చిన, సత్యవంతుని ప్రేయసిచే ఆచరింపబడిన యోగం వైపు దృష్టి సారింతము.

* * *

## 2వ సర్గ – ఆత్మాన్వేషణ దృష్టాంతం

రోజులు గడిచిపోతాయి, అవిరతంగా విధి నిర్ణీతమైన ఆరోజు దిశగా, సావిత్రి గమనిస్తూన్నది. ఆమె నిద్రలేని రాత్రులు గడుపుతూ, తన ఈ జన్మకు భూమ్మీద యే ప్రయోజనమైనా ఉన్నదా? అని ఆశ్చర్యచకితురాలవుతూన్నది. అప్పుడొక స్వరం ఆమె ఆజ్ఞాచక్రస్థానం నుండి (కనుబొమలపైన) వినబడుతుంది. అది ఆమెను కార్యోన్ముఖంగా ప్రేరేపిస్తూన్నట్లున్నది : "ఉత్తిష్ఠ హే ఆత్మన్ కాలం చ మృత్యుం పరాజితౌ కురు." (Arise, O soul, and vanquish Time and Death.) ఆమె జన్మ రోదించటానికి కాదు, నాయకత్వం వహించి మానవ కుటుంబాన్ని బాధ నుండి మరణం నుండి స్వేచ్ఛలోనికి నడిపించటానికి! సావిత్రి సమాధిలో, విధి నెదిరించటానికి ప్రయత్నించటం వలన తనకేమీ ప్రయోజనం కనబడటం లేదని సమాధానమిస్తుంది. జరిగేదేమో జరుగుతుంది! కాని ఆ అంతర్వాణి స్పష్టంగా అంటుంది, ఆమె ధాత్రీజీవితంలో పెనుమార్పును చేయటానికే జన్మించింది కనుక ఇప్పుడామె కార్యరంగంలోకి ప్రవేశించవలె, అని :

Shall there be no new tables, no new Word,
No greater light come down upon the earth
Delivering her from her unconsciousness,
Man's spirit from unalterable Fate?

**నవవేదము, నవలోకము, మహత్తరకాంతుల్**
**పుడమిపై నవతరించరాదా?**
**అచేతనావస్థన్ ధరణికి బాపరాదా?**
**అపరివర్తనీయవిధి నుండి మానవాత్మన్ విడిపింపరాదా?**

ఆ వాణి ఆమెనాశ్వాసిస్తుంది : “కనుగొనుము నీ యాత్మన్, దాగిన నీ వ్యక్తిని పునరుద్ధరించు.” (Find out thy soul, recover thy hid self) ప్రశ్నించే మనస్సు మౌనం వహిస్తుంది. సావిత్రి ఆ ఆహ్వానాన్ని స్వీకరిస్తుంది. ఆమె యౌగిక నిశ్శబ్దతలో ప్రవేశించి, నిద్రిస్తూన్న సత్యవంతుని ప్రక్కన “తన సువర్ణ నిశ్చల భంగిమలో దృఢయై” (rigid in her gold motionless pose) కూర్చొని ఉంటుంది. ఆమె ఇప్పుడు మానవియైన తన శక్తి ఎంతటిదో, మానవునిలో నిక్షిప్తమైయున్న దివ్యశక్తులేమో, తెలియగోరినది. మొదట నామె పరిణామాత్మకగతాన్ని గురించి ఒక అవగాహన కలిగి ఉన్నది :

*In the indeterminate formlessness of Self*
*Creation took its first mysterious steps,*
*It made the body's shape a house of soul*
*And Matter learned to think and person grew;*
*She saw Space peopled with the seeds of life*
*And saw the human creature born in Time.*

**ఆత్మదౌ అనిశ్చిత నిరాకారతలో**
**సృష్టి ప్రథమాద్భుత పాదవిక్షేపమాయె,**
**ఆదిశరీరాకారమున్ ఆత్మ నిలయంబు జేసె:**
**పదార్థము చింతింప నేర్చె నంత వర్థిల్లె వ్యక్తి;**
**ఆమె దిగంతరంబు జీవబీజాలు నిండగ జూచె,**
**కాలాంతరాన మానుషజీవి జన్మించ గాంచె.**

అచిరకాలంలోనే మనస్సు అసాధ్యాన్ని జయించిన శక్తివంతమైన విజేత అయింది. ఊహాకల్పనల సహాయంతో మనస్సు మానవశాసనానికి విశాలమైన క్షేత్రాలను కల్పించింది. ఎంత సాఫల్యవైభవం! “మానవుడు ప్రాపంచిక జీవితాన భగవంతుని స్వప్నాలను సాకారం చేస్తాడు” (Man in the world's life works out the dreams of God.) అయిననూ, అదే మనస్సు వర్ణించలేనంత చెడును కూడా సృష్టించింది. ఈ రీతిలోనే మానవుడు మంచి చెడులు రెండిటికీ సమర్థుడంటూన్నాం. దురదృష్టవశాన మానవుడు చెడువైపుకే మొగ్గుచూపుతూన్నాడు. ఆతడు తమఃస్సంతతిగా మారిపోతూన్నాడు. దాని ఫలితం సర్వత్ర

కనబడుతూనే ఉన్నది. గతంలో చింఘిజ్‌ఖాన్‌లు, ఔరంగజేబ్‌లు, గడచిన శతాబ్దంలో హిట్లర్ ముస్సోలినీలు ఉంటే, ఇప్పుడు ఉగ్రవాద సైన్యం దేవాలయాలను, హోటళ్ళను (hotels), వేలకు వేలుగా అమాయక ప్రజలను ప్రపంచం అంతటా నాశనం చేస్తూ ఉన్నారు.

*Hell's companies are loosed to do their work,*
*Into the earth-ways they break out from all doors,*
*Invade with blood-lust and the will to slay*
*And fill with horror and carnage God's fair world.*
*Death and his hunters stalk with a victim earth.*

**నారకసమూహముల్ విశృంఖలక్రియాశీలురై,**
**సర్వద్వారప్రవిష్ఠులైరి ప్రపంచవీధులన్,**
**రక్తలాలసాఘాతకసంకల్పయోద్ధలై**
**ఈశ్వరుని సుందరలోకమున్ భయహింసా**
**పూర్ణము జేతురు. మృత్యుమృగయావినోదులు**
**బలిభూమి న్నడయాడుదురు ధీరోద్ధతన్.**

మానవుని గతాన్ని, పదార్థంనుండి జీవం విరిసే పర్యంతం గతాన్నంతా, మనం చిత్రించ గలుగుతూన్నాము. వర్తమానంలో వానికి వరంగా లభించినది శక్తివంతమైన మనస్సనే ఉపకరణం. దానితో నతడొక వైభవోపేతమైన భవిష్యత్తును నిర్మించుకోగలడు. దురదృష్టవశాత్తు, అదే మనస్సు వానిని తప్పుత్రోవ పట్టించగలదు కూడా. త్యాగరాజు ప్రశ్నించినట్లు : 'చక్కని రాజమార్గమెయుండగ' మానవుడు మాలిన్యంలోకి చేర్చే సందుల దూరనేల?' సరైన మార్గాన్ని మానవుడెన్నుకోవలెనంటే, వానికి జీవితాన్ని గురించి, గతం వర్తమానం భవిష్యత్తుల గురించి, ఒక పవిత్రదృక్పథం ఉండితీరాలి :

*Above us dwells a superconscient God*
*Hidden in the mystery of his own light :*
*Around us is a vast of ignorance*
*Lit by the uncertain ray of human mind,*
*Below us sleeps the Inconscient dark and mute.*

**మనపై నొక విశుద్ధచేతనామయుడైన**
**దేవుడున్నాడు, స్వీయాద్భుతప్రకాశమున దాగి :**
**మన చుట్టు గలదొక అజ్ఞానవిస్తారము**

**అనిశ్చితమానుషమనః కాంతిదీప్తమై,**
**మనకథోదిశం నిద్రితమై కలదు**
**అంధీభూత నిర్వచస్క సాక్షీ రహితావిద్య.**

ఏదియేమైన, దీని అర్థం మన భవిష్యత్తుకు ప్రణాళికను మనం రచించుకునేందుకు మార్గదర్శక సూత్రాలు లేవని కాదు. ఈ సృష్టికి జన్మనిచ్చినది "అంధప్రకృతిశక్తి" (blind Nature Force) మాత్రమే కాదు కదా, ఒక ప్రణాళికాసహిత దివ్యచైతన్యము కదా :

*Our greater self of knowledge waits for us,*
*A supreme light in the truth-conscious Vast :*
*It sees from summits beyond thinking mind,*
*It moves in a splendid air transcending life.*
*It shall descend and make earth's life divine.*

**జ్ఞానమయమహద్వ్యక్తి నిరీక్షించు మనలో,**
**సత్యప్రజ్ఞావిస్తారమున నొక పరమప్రకాశము :**
**చింతనామయమనఃపారమును జూచునది**
**శిఖరాగ్రములనుండి, జీవాతిక్రమదుజ్జ్వలప్రాణమున**
**చరించునది. అవతరించు పుడమి జీవితమున్**
**దివ్యమొనరించునది.**

దివ్యజీవనాన్ని ఇంద్రజాలంతో సాధించలేము. మానవుడు దానికోసం ఆకాంక్షించవలె, సావధానంగా కష్టించవలె. దానిని సాధించటానికి ఏకాగ్రమైన నిరంతర తపస్సు చేయవలె. నిస్సంశయంగా ఆ పరమాత్మ దేవప్రసాదాన్ని అనుగ్రహిస్తాడు. మనస్సు అంతరాలలోనికి లోతుగా ప్రవేశించి, గాఢతర మనస్సులోనికి ప్రవేశించవలె. అక్కడ దివ్యస్ఫురణ ఉన్నది. మనకు అక్కడ భవిష్యత్ కార్యాచరణకు మార్గదర్శనం చేయగల కాంతి లభిస్తుంది.

*Our inner Mind dwells in a larger light,*
*Its brightness looks at us through hidden doors;*
*Our members luminous grow and Wisdom's face*
*Appears in the doorway of the mystic ward;*
*When she enters into our house of outward sense,*
*Then we look up and see, above, her sun.*

**మన అంతర్మనస్సులో నొక బృహత్తర జ్యోతి కలదు,**
**దాని ప్రభ గుప్తద్వారాలనుండి చూచు;**
**మన అంగంబులు కాంతివంతమై వివేకముఖంబు**
**రాహఃకక్షాద్వారాన గన్పించు :**
**తాను మన బహిరింద్రియగృహాన ప్రవేశించు తరి,**
**మనమూర్ధ్వముఖంబై తద్రవిం గాంతుము.**

శ్రీ అరవిందులు, ఎన్ని అవాంతరములున్నను, మానవుడు వెలుగులోని కెదుగుతూనే ఉన్నాడని నమ్మబలకటం ద్వారా, మహత్తరమైన నైతికబలాన్నిస్తూన్నారు. తాను మృత్యువుకు భయపడనక్కర్లేదని సావిత్రి గుర్తిస్తుంది. ఎందుకంటే, అది సత్యం కాదు కదా. ఆమె మానవునిలో బద్ధమైయున్న ఆత్మను కనుగొనవలసిన సమయమిది. అది మనోయవనికచే దాచబడినది. కనుక సావిత్రి గాఢతర ధ్యానావస్థను చేరుకోవటానికి సిద్ధపడుతుంది.

* * *

## 3వ సర్గ - అంతర్దేశ ప్రవేశము

ఈ సర్గలో, సావిత్రి తన అంతర్వ్యక్తిని లక్షించి చేపట్టిన యోగంలో ఒక కీలకమైన ఘటనలోకి మనం ప్రవేశిస్తాము. సారభూతంగా, తనను తాను తెలిసికోవటానికి ఉద్దేశింపబడిన ప్రయాణమిది. రమణమహర్షి తన శిష్యులను "నే నెవరు?" అన్న ప్రశ్నకు సమాధానం తెలుసుకొమ్మని చెప్పినారు. ఇది కేవలం వేదశాస్త్రాలను అధ్యయనం చెయ్యటం వలన సాధ్యం కాదు. ఏకాగ్రతతో అహం - చైతన్యం (I-activity) ఎక్కడనుండి ఉద్భవిస్తూన్నదో అన్వేషించటం ద్వారా సాధ్యమవుతుంది. శ్రీ వశిష్ఠగణపతి ముని గారి శ్రీరమణగీత, మనస్సువైన అంతర్దేశాలలో సంచరించే ఈ ఆత్మాన్వేషణలో, రమణ మహర్షి బోధించినట్లు, ఒక్కొక్క అడుగు ముందుకెట్లా సాగవలెనో స్పష్టంగా వర్ణించింది.

"ఇంద్రియవిషయాలనుండి సమస్త క్రియలను ఉపసంహరించి, శుద్ధచింతనలో నిలిచి, ఫలాపేక్ష లేకుండా నిశ్చలంగా ఉండవలె. క్లుప్తంగా, తన సత్యరూపమేమిటో తెలిసికోవటానికిది మార్గం. ఈ మార్గంలో మాత్రమే మహితమైన అంతర్‌దృష్టి సాధ్యమవుతుంది."

వ్యాసుని ఉపాఖ్యానంలో, సావిత్రి త్రిరాత్రవ్రతం చేస్తూ (కాష్టభూతేవ) కొయ్యి దుంగవలె, నిశ్చలంగా కూర్చున్న యోగి భంగిమను తలపిస్తూ, నిల్చి ఉన్నదని

గమనించినాము. బాహ్యాప్రపంచం నుండి విముఖం కావటం సులభం కాదు, కాని సావిత్రి దానిని సులభంగానే సాధించినది. శ్రీ అరవిందులు ఈ సంకేతాన్ని గ్రహించి, ఈ మహాకావ్యంలో ఒక దృష్టాంతాన్ని, మనలో నిద్రాణంగా ఉన్న వివిధ శక్తులను, చేతనలో అభ్యుదయావకాశాలనూ, అనేకమైన ఆటంకాలు ఆత్మజ్ఞానమార్గాన్ని మూసివేసే విధానమూ, అన్నిటినీ సంకేతిస్తారు.

బాహ్యం నుండి అంతరంగంలోకి మరలినంతనే, ఆమెకొక విధమైన నిరుత్సాహకరమైన శూన్యం ఎదురయింది. హఠాత్, ఒక వాణి, ఆమె కేవలం సత్యవంతుని మృత్యువునుండి కాపాడటానికే ఈ అన్వేషణలో సాగటం లేదని, ఆమెకు చెబుతుంది. ఆమె నిజంగా మానవుని భవిష్యత్తును కాపాడటానికి నేలకు దిగి వచ్చిన ఒక అవతారం:

Man, human, follows in God's human steps.
Accepting his darkness thou must bring to him light,
Accepting his sorrow thou must bring to him bliss.
In Matter's body find thy heaven-born soul.

**దేవుని మానుష పాదముద్రల ననుసరించు**
**మానవీయ మానవుండు.**
**వాని తమస్సు నంగీకరించి వెలుగులోనికీవు తేవలెను వాని,**
**వాని దుఃఖ మంగీకరించి వాని కానందము తేవలెను నీవు.**
**భౌతిక శరీరమున దివ్యమౌ నీ ఆత్మ నెఱుగ జూడు.**

సావిత్రి ఆ స్పర్ధకు సిద్ధంగా ఉన్నది. మొదట ఆమెకొక తమోద్వారమెదురైనది. ఒక ద్వారపాలకుని వాణి ఆమెను హెచ్చరిస్తుంది : "మరలుము ధాత్రీ జీవుడా, లేదేని పీడితవై, ఖండితవై, మ్రందెదీవు." (Back, creature of earth, lest tortured and torn thou die.) సర్పములు, పిశాచములు ఆమె ముందు సాక్షాత్కరిస్తాయి కాని ఆమె నిర్భయంగా లోనికి నడుస్తుంది. ఆమె అంతటి దృఢత్వాన్ని ప్రదర్శించగనే, ఆ ఆకారాలు, కంఠస్వరాలు, అన్నీ అంతర్ధానమైనాయి. ఇప్పుడామె అంతరప్రపంచంలోని వివిధమైన స్థరాలగుండా సంచరిస్తుంది, ప్రపంచసోపానంపైకి ప్రయాణించిన అశ్వపతి వలెనే, అది ఒక క్రమమో లక్ష్యమో లేని, ఇంద్రియాధిపత్యంలోని, జీవమున్న సంకుల ప్రపంచం. అక్కడ శాంతీ లేదు, సంతృప్తీ లేదు. ఇంద్రియాలకు సురతదౌత్యం చేస్తే, శాశ్వతానందం, లేదా, మనశ్శాంతి లభించదు. ఇంద్రియాకర్షణ నుండి బైటబడి, మనస్సును శాంతపరిచేందుకు సావిత్రి నామజపాన్ని సహాయంగా స్వీకరిస్తుంది :

*Hour after hour she trod without release*
*Holding by her will the senseless meute at bay;*
*Out of the dreadful press she dragged her will*
*And fixed her thought upon the saviour Name;*
*Then all grew still and empty; she was free.*
*A large deliverance came, a vast calm space.*

**గంటలు గడువగా ఆమె నడచె విడువకుండ**
**తన సంకల్పమున అబుద్ధ సంకులము నిలువరించి;**
**ఆ భయంకరపీడ నుండి తన సంకల్పము మరలించి**
**తన చింతనన్ రక్షకుని నామంబుపై నిల్పి;**
**అంతనంతయు నిశ్చల శూన్యమయ్యె; ముక్తయయ్యె నామె.**
**ఒక విస్తృత మోక్షంబు, ఒక విస్తారప్రశాంతభూమి ఆగమించె.**

సావిత్రి ఇప్పుడు కొన్ని ఆదర్శాలు ఇంద్రియాలను శాసించే ఒక ప్రపంచాన్ని, సమురాయ్ ఆదర్శమును పోలిన దానిని, ప్రవేశించింది. ఇది కూడ ఊపిరిసల్పనివ్వనిదే కాగలదు :

*Its fiery towers of dream built on the winds,*
*Its sinkings towards the darkness and the abyss,*
*Its honey of tenderness, its sharp wine of hate,*
*Its changes of sun and cloud, of laughter and tears,*
*Its bottomless danger-pits and swallowing gulfs,*
*Its fear and joy and ecstasy and despair,*
*Its occult wizardries, its simple lines*
*And great communions and uplifting moves,*
*Its faith in heaven, its intercourse with hell.*

**వాయునిర్మిత తత్స్వప్నాగ్నిక్షౌమముల్,**
**తదంధకారాగాధాంతర్లీనతల్,**
**తన్మృదులతామధువు, తత్తీక్ష్ణద్వేషద్రాక్షాసవంబు,**
**తద్రవిమేఘ, తద్హాసాశ్రుపరివర్తనల్,**
**తదగాధాపద్గర్తల్, గ్రసదఖాతముల్,**
**తద్భయహర్షానందాతిరేక నైరాశ్యముల్,**
**తద్గూఢమాయల్, తత్సరళరేఖల్,**

**తన్మహాసంగమముల్, ఉద్ధరత్త్వక్రియల్,**
**తత్స్వర్లోకవిశ్వాసమున్, నరకసంపర్కమున్.**

ఇది మానవుని వీరయుగం, మహాభారత దృశ్యభూమి. అందు ధర్మప్రవర్తకులున్నారు, అధర్మక్రియాలాలసులున్నారు, అందరికందరు అహంకారులు, భీరువులను ఏహ్యాభావంతో చూచేవారే. దీనిని భాగశః మెచ్చగలము. కాని జీవితమిక్కడ శుద్ధసత్యముపై వృద్ధి కాలేదు. సంకోచాలు, అర్ధసత్యాలు, ఆత్మాభాసాలు ఉన్నవి. శ్రీ అరవిందుల రచనను చదువుతూ, మహాభారతపాత్రలు, భీష్మాశ్వత్థామల వంటి వారిని తల్చుకోకుండా ఉండలేము. అది ఛిద్రపరాక్రమం, లోపభూయిష్టవీరం, నింద్యజీవనశైలి. ఇక్కడ, "సత్యమనిమేషమై చూచు, వేష్టిత నేత్రయై కార్యాచరణంబు జేయు" (Truth stares and does her works with bandaged eyes.) ఈ వైభవమున వర్ణశోభను చూచి ఆకర్షితురాలు కాక, సావిత్రి ముందుకు సాగినప్పుడు, ఆమె తర్కశాసితమైన ప్రదేశాన్ని చేరుకుంటుంది. అది క్రమబద్ధమైనదే కాని అనాత్మకం. ఈ స్వయం సంతుష్ట ప్రపంచం నుండి కూడ, తన ఆత్మనన్వేషిస్తూ, దూరంగా సాగిపోతుంది.

తన అంతరాంతరాత్మను కనుగొనే మార్గంలో ఆమె "విచిత్రదేవతాస్త్రీలను, గాఢపల్వలితైంద్రజాలిక నేత్రాలవారి" (Strange goddesses with deep-pooled magical eyes.) ని కలుసుకుంటుంది. ఆమె పిలుస్తుంది :

O happy company of luminous gods,
Reveal, who know, the road that I must tread, -
For surely that bright quarter is your home, -
To find the birthplace of the occult fire
And the deep mansion of my secret soul.

**ఓ కాంతిమద్దేవతానందసహచరులారా,**
**నేనేగ వలసిన మార్గము నెఱిగినవారు చెప్పండి,-**
**ఏలన తత్కాంతిమద్దేశము నిశ్చయముగ మీ గృహము, -**
**తద్గూఢాగ్నిజన్మస్థలంబు**
**మద్రహస్యాత్మసౌధంబు జేర.**

వారిలో నొకరు, తామామె ఆత్మ నుండియే వెలువడినామని ఇట్లా అంటుంది: "మేము తజ్జ్యోతింగమమైన నీ సంకల్పము సర్వమానవ సంకల్పము" (We are thy will and all men's will towards Light.) మానవుని సంకల్పశక్తియే విశ్వాసంతో పురోగమింప

జేసి, సాఫల్యసాధనకు సాయమవుతుంది. సావిత్రి ముందుకు సాగితే, ఆమె అన్వేషించేది తప్పక లభిస్తుంది. తన ఆత్మనుండి వచ్చిన శక్తులను ఆమె కలిసినప్పుడు, అది అలాగే అవుతుంది :

A few bright forms emerged from unknown depths
And looked at her with calm immortal eyes.

**అజ్ఞాతాగాధములనుండి కొన్ని దీప్తాకారముల్ వెడలివచ్చె,**
**ప్రశాంతామర్త్యనేత్రాలతో చూచె నామెన్.**

* * *

## 4వ సర్గ - ఆత్మశక్తిత్రయము

సావిత్రి ఏకాగ్రధ్యానంలో నిమగ్నమయింది. తన అంతర్వ్యక్తిలో ఉన్నతస్థరాలను ఒక్కటొక్కటిగా దాటుకుంటూ, చివరకు తన ఆత్మప్రవేశస్థానాన్ని చేరుకున్నది. వ్యక్తి ఆత్మ ఒక శక్తి, బహుముఖం. శ్రీ అరవిందులు మానవుని ఆత్మకు గల ప్రధానముఖత్రయాన్ని ప్రదర్శించినారు : బాధ (జాలి), బలం (క్రియ, వేగం), ప్రకాశం (ఆనందం, శాంతి).

సావిత్రి తన మనస్సులోని అంతరాంతరదేశాలలో పైపైకి సాగుతూండగా ఆమెను మొదట ఒక స్త్రీ, "వివర్ణకాంతిమద్వస్త్రం" (a pale lustrous robe) ధరించినామె, కలుసుకుంటుంది.

A rugged and ragged soil was her bare seat,
Beneath her feet a sharp and wounding stone.
A divine pity on the peaks of the world,
A spirit touched by the grief of all that lives,
She looked out for and saw from inner mind
This questionable world of outward things,
Of false appearances and plausible shapes,
This dubious cosmos stretched in the ignorant Void,
The pangs of earth, the toil and speed of the stars
And the difficult birth and dolorous end of life.

**విషమ జీర్ణభూమి ఆమె అనాచ్ఛాదితాసనంబు,**
**ఆమె పాదములక్రింద నొక తీవ్రవ్రణకారి శిల.**
**ప్రపంచ శిఖరాలపై నొక దివ్యానుకంప,**

**సమస్త జీవ బాధాదష్టమౌ ఆత్మయొకటి,**
**ఆమె తన అంతర్మనస్సు నుండి దూరమున చూచె**
**ఈ విశంక్యబాహ్యవస్తుప్రపంచమును,**
**మిథ్యాకార సత్యాభాసరూపములన్,**
**ఈ అజ్ఞానశూన్యవ్యాప్త సందిగ్ధార్థ విశ్వమున్,**
**ధరణీ వేదనలన్, తారకాశ్రమవేగములన్**
**ఆయాసాసాదితజననంబును, శోకాకులజీవనాంతమున్.**

ఇది సాకార మాతృప్రేమాచిత్రమే, కరుణ, తఱచు మానవజాతిని ముట్టడించు దుశ్చారము నెదిరించలేని అసహాయత రూపమే. ఈ దుఃఖాల తల్లి తాను నిజంగా సావిత్రి ఆత్మననీ, ఎందుకంటే, తల్లి వేదన, ఉత్కంఠ, జాలి, ఆశ లేకుండ మానవజాతికి ఉనికి లేదనీ సావిత్రికి చెబుతుంది. ఆ మాతృమూర్తి చెప్పటం పూర్తవుతూండగానే, దుఃఖిత మానవుడు అగాధాల నుండి "నా యాతన జూచి ఆనందించుటకే దేవుడీ భూమిని సృష్టించినాడు" అంటూ, మానవజాతికి భవిష్యత్తు లేదంటూ, ఆక్రోశిస్తాడు. సావిత్రి ఆ దుఃఖాల తల్లితో, ఆమె కారణంగానే మానవుని ఆరోహణం ఉన్నతోన్నత దేశాల దిక్కుగా సాగుతూన్నదనీన్నీ, తాను మానవుని సహాయం కోసం వాని ప్రయాణంలో బలపూరణను సాధించి తిరిగి వస్తాననీ, నమ్మబలుకుతుంది.

సావిత్రిపైకి కదిలిపోగా, ఆమె శక్తిమాతను కలుసుకుంటుంది. ఆమె దుర్గాదేవి మూర్తియే. సావిత్రితో, తానంటుంది, మానవుడు తన లక్ష్యాన్ని చేరుకునేందుకే తాను వానిని బాధలపాలు చేస్తూన్నాను, అని. అంతలో మానవునిలోని రాక్షసుడు ఆమెను విరోధిస్తూ, గెలుస్తూన్నది మానవునిలోని దయ్యమేననీ ఒకనాడు అది దేవునికూడా అధిగమిస్తుందనీ, అంటాడు. సావిత్రి వారికి చెబుతుంది, బలం అవసరమే అయినా, అది అనుకంపతో సంయోగం చెందవలెననీ, ఎట్లాగైనా ఈ రెండు శక్తులూ మానవుని ఉజ్జ్వల భవిష్యత్తును సాధించటానికి చాలవనీను. మానవుడు అతిమానవతను సాధించవలెనంటే వాని ఆత్మకు అన్యమైన శక్తుల ఆవశ్యకతకూడా ఉన్నది.

ఇప్పుడు సావిత్రి జ్యోతిర్మాతను కలుసుకుంటుంది. ఇక్కడంతా హర్షమూ మహాప్రశాంతి ఉన్నది. ఈ మాతృమూర్తి మానవుని స్వప్నాలతో, దర్శనాలతో, సద్గుణాలతో, ఆదర్శాలతోనూ ప్రోత్సాహపరుస్తుంది. ఈమెను మేధావి మానవుడు, తన లక్ష్యాన్ని స్పష్టంగా చెప్పలేకున్నా, తార్కికతయే సమస్తం, అంటూ వ్యతిరేకిస్తాడు. ఆతని వాదసారం యేమంటే, భవిష్యత్ సంభవాలను గురించి మానవుడు కంటూన్న కలలన్నీ కేవలం కలలే తప్ప

మరేమీ కావు, అన్నది. అందుచేత, ఏది యెట్లా ఉన్నదో, దాన్ని అట్లాగే వదలివెయ్యటం సర్వోత్తమం, కాలచక్రభ్రమణంలో మానవుని విధిలిఖితమేదో, దాన్ని అట్లాగే అనుభవించటం సముచితం :

*Human I am, human let me remain*
*Till in the Inconscient I fall dumb and sleep.*
*A high insanity, a chimaera is this...*
*To think that God lives hidden in the clay*
*And that eternal Truth can dwell in Time,*
*And call to her to save our self and world.*

**మానవుండ నేను, మానవుడై యుండనిమ్ము**
**అజ్ఞాతమున నేను మూగవోయి నిద్రించు దనుక.**
**ఒక ఉన్నతోన్మాదమిది, అభూతకల్పన...**
**మృత్తికాగుప్త దేవుడున్, కాలగతశాశ్వతసత్యమున్**
**కలవు కలవని భావించుచుంట,**
**మా ఆత్మలన్ ప్రపంచంబు కావు కావు మని ఆమెను పిల్చుచుంట.**

కాని ఈ తామసిక నిర్లక్ష్యము అపరాధము! తర్కబుద్ధి మాత్రమే, ఎల్లవేళల వస్తుస్థితులూ, గణాంకాలూ, వీనిలో మునిగిపోయి, శాస్త్రీయ ప్రమాణాల వెంటబడుతూన్నట్లయితే, తానేమీ శ్రమార్హమైన దానిని సాధించలేదు. ఈ విధంగా శ్రీ అరవిందులు ఆత్మకు గల ప్రతిశక్తిని అనుకంప, బలం, శాంతి, వీనిని పూర్వపక్ష – ప్రతిపక్ష యుగళంగా ప్రదర్శిస్తారు. ఈ తీరుగా సమస్యను ఇంకా ఇంకా లోతుగా పరిశీలించే అవకాశాన్ని కల్గిస్తారు. దుఃఖాల తల్లికీ, శక్తిమాతకూ పూర్వం తాను విశ్వసనీయంగా చెప్పినట్లే, ఇప్పుడు సావిత్రి ఈ జ్యోతిర్మాతతో మానవజాతి కామె ఆవశ్యకత చాలా ఉన్నదని నమ్మబలుకుతుంది :

*Because thou art, the soul draws near to God;*
*Because thou art, love grows in spite of hate*
*And knowledge walks unslain in the pit of Night.*
*But not by showering heaven's golden rain*
*Upon the intellect's hard and rocky soil*
*Can the tree of Paradise flower on earthly ground*
*And the bird of Paradise sit upon life's boughs*
*And the winds of Paradise visit mortal air.*

**నీవున్న కతన, ఈ యాత్మ దేవుని దిక్కు పరిక్రమించు,**
**నీవున్న కతన, ద్వేషంబు నెదుర ప్రేమ వృద్ధిగాంచు,**
**జ్ఞానము నిశాగర్తయం దోటువడక సాగు.**
**కాని ఆకాశసౌవర్ణవర్షమున్ మేధావి కఠినశిలాస్థలి**
**వర్షించినంత పుడమిపై స్వర్లోక వృక్షంబు పుష్పించజాలదు,**
**స్వర్గవిహంగము జీవితశాఖోపవిష్ట కాదు,**
**స్వర్గసమీరముల్ మర్త్య వాయువున్ స్పృశింపరావు.**

సత్యమిట్లా ఉండగా, సాధారణంగా ఈషదంధుడైన మానవుడు ఆమె ప్రసాదించిన వరాలను అలక్ష్యము చేసి, ద్వేషాన్నెదుర్కొనటంలో ప్రేమకున్న విలువను గ్రహించకున్నాడు. దీని అర్థం యేమంటే, మానవుని ఆత్మ తన శక్తులన్నింటినీ సమీకరించలేదని మాత్రమే. దాని బలం ప్రధానంగా ముందుకొచ్చినప్పుడు, అది ప్రేమానుకంపల అవసరాన్ని మర్చిపోతూన్నది. అది అనుకంపాపూర్ణమైనప్పుడు, బాధలోనున్నవారిని రక్షించటానికి అశక్తమైపోతూన్నది. మానవుని స్వప్నాలవైపు ప్రోత్సహించినప్పుడు, ఆ స్వప్నాలు సాకారం అయ్యేట్లు చెయ్యటానికి తగిన సంకల్పబలం లోపిస్తూన్నది. కనుక దీని నంతటినీ సమీకరించి ఏకం చేసి మానవుడు తన పరిమితులను అధిగమించేట్లు చేయగల అఖండశక్తిరహస్యం ఎందులో ఉన్నది? ఇది సాధ్యమే అని సావిత్రి దృఢవిశ్వాసంతో ఉన్నది. కనుక ఆమె తన ఆధ్యాత్మిక సాహసంలో ముందుకు సాగిపోతుంది, జ్యోతిర్మాతతో ఇట్లా నమ్మబలికి :

*One day I will return, His hand in mine,*
*And thou shalt see the face of the Absolute.*
*Then shall the holy marriage be achieved,*
*Then shall the divine family be born.*
*There shall be light and peace in all the worlds.*

**నా చేతిలో వాని చేయిబట్టి, మరలి వత్తు నొకనాడు,**
**చూచెదవీ వప్రమేయుని ముఖంబు నాడు.**
**సఫలమగు నప్డు పవిత్ర వివాహంబు,**
**జన్మించునప్డు దివ్యకుటుంబంబు**
**లోకములందెల్ల కాంతి శాంతియు నిండు.**

❊ ❊ ❊

## 5వ సర్గ - ఆత్మదర్శనం

సుదీర్ఘమైన తాత్త్విక కావ్యాలను మహాకావ్యాలంత నిడివిలో వ్రాసే రచయితలు, పాఠకుల ఆసక్తి సడలకుండా నిలపటం కష్టసాధ్యంగా తెలుసుకుంటారు. ఆ కారణంగానే వారు తమ కథలను అత్యధికంగా క్రియాశీలకంగా రూపొందిస్తారు. డాంటే రచించిన డివైన్ కామెడి (Divine Comedy) వెంటనే మనసుకు వస్తుంది. ఈ కావ్యానికి వెన్నెముక సెయింట్ థామస్ ఆక్వినస్ (St. Thomas Aquinas) యొక్క క్రైస్తవ అధ్యాత్మజ్ఞానం (Theosophy) అయినప్పటికిన్నీ, ఆ కావ్యంలోని నరకం (Hell), అఘమర్షణం (Purgatory), స్వర్గం (Paradise) అనే మూడు భాగాలలో జరిగే సంఘటనలు కావలసినంత రంగురంగులుగా ఉండేట్లు జాగ్రత్తపడినాడు. శ్రీ అరవిందులు తమ మహాకావ్యంలో అట్లాంటి బాహ్యసంఘటనలేవీ ప్రవేశపెట్టలేదు. ఇప్పటికే విశదమైనట్లు, అశ్వపతి చేపట్టినది సారభూతంగా ధ్యానయోగం. కాని ఆ భావనాతరంగాలకు బాహ్యరూపాన్నివ్వటం ద్వారా, అశ్వపతి ధ్యానసమయంలో శ్రీ అరవిందులు కావ్యానికొక ధారాచైతన్యాన్ని కలిగించినారు. ఒక ఆలయ రథ నిర్మాణం వలె రూపొందించిన ప్రపంచసోపానచిత్రము; అంధకారంతో సహ వివిధ ప్రపంచాలలో కన్పించే ప్రజలు, ప్రార్థనలో ఉన్న అశ్వపతి చిత్రణ, ఒక స్థాయీభావాన్ని కలిగిస్తాయి, మనం ఆ యోగి భావసంచారాలను అర్థం చేసికొనే ప్రయత్నంలో ఉండగానే.

ఇదే రీతిలో సావిత్రి యోగయాత్ర కూడా ధ్యానాశ్రయమే. కాని దుఃఖాల తల్లి, శక్తిమాత, జ్యోతిర్మాత వంటి మూర్తులు ఆయా భావనా స్థితుల్లో స్థిరమయ్యేందుకు సహకరిస్తాయి. మన ఆత్మలో కరుణ, శక్తి, సౌందర్యాది అనేక హర్మ్యాలున్నాయని గుర్తించి, సావిత్రితో ముందుకు “ఆత్మీయ గుప్తగుహ” (Soul's mystic cave) కు అన్వేషిస్తూ సాగటానికి సిద్ధమవుతాము. ఆమె మొదట ఎదుర్కొనేది “దేవుని రాత్రి” (a night of God). ఇంతవరకు తనకు అనుభవంలోకి వచ్చిన జ్ఞానం, వివేకం, సత్యం, ఇట్లాంటివేమీ ఆమె చుట్టూ ఎక్కడా కనబడలేదు. ఆమె ఎక్కడ ఉన్నది? ఇక్కడ ఆమె అన్వేషణ సార్థకమని నమ్మించే విషయమేమున్నది? ఆమె ఏమిటి? ఆమె ఆత్మ యేమిటి? ఆమె సావిత్రి అను ఒక స్త్రీయా, లేక భగవంతుని విస్తారంలో తానసలు ఎక్కడా లేనే లేదా?

*As might a shadow walk in a shadowy scene,*
*A small nought passing through a mightier Nought,*
*A night of person in a bare outline*
*Crossing a fathomless impersonal Night,*
*Silent she moved, empty and absolute.*

**ఒక ఛాయాదృశ్యముననొక ఛాయ నడచురీతి,**
**ఒక మహాశూన్యమున నొక అల్పశూన్యము సాగునట్లు,**
**ఒక రాత్రి వ్యక్తి కేవల మొక రేఖయై**
**ఒక నిర్వ్యక్తికాగాధనిశిం దాటుచు,**
**కదలె నామె మౌనముగ, శూన్యముగ, స్వాధీనగా.**

ఈ అనుభవం క్షణికమైనది, అచిరకాలంలోనే ఆమె ఆ గాలిలో ఒక తియ్యదనాన్ని అనుభవిస్తుంది. ఆమె చుట్టూ ఒక ప్రకాశం యేర్పడుతుంది. ఆకాశం కాంతివంత మవుతుంది. అంతలో ఆమె తన 'రహస్యాత్మ' (secret soul) గుహను కనుగొంటుంది. శ్రీ అరవిందులు ప్రదర్శించిన చిత్రం ఊపిరి బిగబట్టేట్లు చేస్తుంది. రెండు సువర్ణసర్పాలు ద్వారంపై గల దారువును చుట్టుకొని ఉన్నాయి. ఒక పెద్ద గరుడపక్షి ఆపైన తన "జయశీలకమైన ఱెక్కల"తో (conquering wings) ఆ రహస్యాత్మకు కాపలా కాస్తూన్నట్లు కనబడుతుంది. ప్రాకార శృంగాలమీద కపోతములున్నవి. ఆ గుహలోపల విశ్వదేవతల చిత్రాలు ఱాళ్ళపై శిల్పితములై యున్నవి. అది శిల్పమైనా లేక చిత్రమైనా, ప్రతి ఒక్కటీ కూడా వాస్తవానికి ప్రతిబింబాలైన సంకేతాలేననీ, అవి భగవంతుని ఆస్తిక్యాన్ని ప్రకటిస్తూ సమర్థిస్తూన్నవనీ సావిత్రికి స్పష్టమయింది. సహజావబోధంగా బోధి ఆమెపైకి వరదగా ప్రవహిస్తుంది :

As thus she passed in that mysterious place
Through room and room, through door and rock-hewn door,
She felt herself made one with all she saw.
A sealed identity within her woke;
She knew herself the Beloved of the Supreme :
These Gods and Goddesses were he and she :
The Mother was she of Beauty and Delight,
The word in Brahma's vast creating clasp,
The world-puissance on almighty Shiva's lap, -
The Master and The Mother of all lives
Watching the worlds their twin regard had made,
And Krishna and Radha for ever entwined in bliss,
The Adorer and Adored self-lost and one.

**ఆ అద్భుతప్రదేశంలో ఆమె కక్షనుండి కక్ష కారీతి,**
**శిలాలూనద్వారము నుండి ద్వారమును దాటుచుండ,**

**తాను జూచిన వానితో నెల్ల తానైక్యమైనట్లు తోచె.**
**ఆమెలో నొక ముద్రాంకిత సారూప్యము మేల్కొనె;**
**ఎఱింగె నామె తా నా పరముని ప్రేమపాత్రురాలనని :**
**ఈ దేవీదేవతలందఱు తానున్ ఆతడే అయియుండిరి :**
**తానె సౌందర్యసంతోషమాత,**
**బ్రహ్మదౌ విస్తార సృజనగ్రాహకవచనము,**
**సర్వశక్తిమత్ శివాంకగతలోకశక్తి, -**
**సమస్త జీవపతియు మాతయున్**
**తమ దంపతీమనోయోగజనితలోకాల వీక్షించుచున్,**
**సదానంద సంయోగులౌ రాధయున్ కృష్ణుడున్,**
**భక్తుండు భగవంతుడున్ వ్యక్తతన్ మరచి యొక్కటై.**

విస్తారమైన ఈ ఏకత్వంలో, ఒక ప్రత్యేకమైన అద్వైతస్థితిలో సావిత్రి తాను సావిత్రిగానే ఉండగా తన స్వామితో ఐక్యతను గుర్తించింది. అంతా ఆనందమే. భిన్నత్వ స్పృహ తప్పుకోగానే, ఇక వ్యక్తిగతమైన చింతకూ, దుఃఖానికీ, బాధకూ స్థానమెక్కడ? ఆ పరమశక్తిని, "జ్ఞానమంతయునెవ్వాని కిరణమాత్రమొ, అట్టి సూర్యుడు" (a Sun of which all knowledge is a beam) చూచినంతనే సావిత్రిలోని అద్వైతభావము సంపూర్ణమైనది. ఈ శక్తి ఉనికి నతిక్రమించి, అంతయు "నిరాకారము, శుద్ధము, అనాచ్ఛాదితము" (formless and pure and bare).

ఇప్పుడామె సులభంగా తనకు కనిపించిన ఒక సొరంగ మార్గాన సాగిపోతుంది. అక్కడ ఆమె ఒక జ్వాలాప్రకాశాలున్న కక్షకు చేరుకుంటుంది. ఇక్కడ ఆమె తన గుప్తాత్మను కలుస్తుంది, ఈ గుప్తాత్మ "మానవుని బొట్టనవ్రేలంత మాత్రమైన ఒక అస్తిత్వం." (a being no bigger than the thumb of a man). మన ధార్మిక గ్రంథాలు ఈ చిత్రాన్ని కూడా ప్రకటించినవి. **నీలతోయదమధ్యస్థా, విద్యుల్లేఖేవభాస్వరా!** ఇది "అవిస్తారితామర్త్య వ్యక్తి" (the unwounded and immortal self). దీనితో సావిత్రి ఐక్యమవుతుంది. ఈ సందర్భంలో శ్రీ అరవిందులు, సావిత్రి శరీరంలో మూలాధారంలో ఒక "ఉజ్జ్వలసర్పం" (a flaming serpent) వలె లేచి, చక్రాలన్నీ దాటి సహస్రారంలోని పరాశక్తిని కలుసుకోవటాన్ని లక్షించే కుండలిని అద్భుతవర్ణనను చిత్రీకరిస్తారు, కుండలినీ మార్గాన్ని ప్రదర్శిస్తారు :

In the flower of the head, in the flower of Matter's base,
In each divine stronghold and Nature - knot

*It held together the mystic stream which joins*
*The viewless summits with the unseen depths,*
*The string of forts that make the frail defence*
*Safe-guarding us against the enormous world,*
*Our lines of self-expression in its Vast.*

**శిరః పద్మాన, పదార్థపీఠపద్మాన,**
**ప్రతియొక్క దివ్యదుర్గాన, ప్రకృతీగ్రంథిలో**
**గుప్త స్రవంతి నది జోడించి పట్టె, అదియు చేరును**
**కనరాని లోతుల గనరాని శిఖరాగ్రములన్,**
**దుర్బలరక్షకదుర్గపరంపర విశాలప్రపంచమునుండి**
**మనల కాపాడుచుండ, తద్విస్తారమున మనవౌ**
**భావప్రకటన పంక్తులు.**

ఇప్పుడు శక్తి అధోముఖంగా ప్రవహిస్తుంది, సావిత్రి సర్వాంగాలనూ సుసంపన్నం చేస్తుంది. దీనితో, మానవుని భవిష్యత్తు కభయం లభించింది. ఎందుకంటే, తానింక ఒక మర్త్యశరీరం కాదు, అమృతాత్మనివాసమైన శరీరం. ఈ అమృతదీప్తి అంతర్గతమై మృత్యువును భస్మీభూతమొనరించునంత శక్తి గలది! “ఒక మానవుని పరిపూర్ణత ప్రపంచమును రక్షించ గలదు” (*One man's perfection still can save the world*). అన్న అభయంతో సావిత్రి యోగంలో ఈ దర్శనం సంపన్నమవుతుంది.

❊ ❊ ❊

## 6వ సర్గ – నిర్వాణము, సర్వ నిషేధి సంపూర్ణతా

సహస్రారంనుండి అమృతపు జల్లులు కురవటంతో, సావిత్రి అంతరంగ బహిరంగాలు రెండిటా ఒక క్రొత్త వెలుగు వ్యాపించింది. అయినప్పటికిన్నీ, ఇంత మాత్రమే చాలదు. యోగంలో తొలి అడుగులు విజయవంతంగా పూర్తయినాయి, కాని ఇంకా చేయవలసింది చాలా ఉన్నది. ఈ మహాపరివర్తనానికి సహకారిగా ఒక ప్రభాయుతమైన శరీరం కావలసియున్నది.

ఆ పరమశక్తియొక్క అమృతం పొందిన సావిత్రి ఆత్మకు ఇప్పుడొక విశ్వావగాహన కలిగింది. తాను క్షేమమన్న భావం కలిగింది. పూర్వం వలెనే ఆశ్రమంలో తన జీవితాన్ని సాగిస్తుంది. సావిత్రీ సత్యవంతుల సాంసారిక సుఖజీవనం చూడముచ్చటవుతుంది :

*This bright perfection of her inner state*
*Poured overflowing into her outward scene,*
*Made beautiful dull common natural things*
*And action wonderful and time divine.*
*Even the smallest meanest work became*
*A sweet or glad and glorious sacrament,*
*An offering to the self of the great world*
*Or a service to the one in each and all.*

**ఆమె ఆంతర్యపూర్ణత్వస్థితిప్రభ**
**ఆమె బాహ్యజీవనమున్ పరిప్లావితమొనర్చె :**
**సాధారణప్రాకృతికజడవస్తువుల్ సుందరములయ్యె**
**కార్యకలాపములద్భుతముల్ కాలము దివ్యమయ్యె.**
**అల్పతమాధమాధమక్రియయైన నయ్యె**
**ఒక సామోదప్రతిభాసంస్కారమధురంబు,**
**మహాప్రపంచవ్యక్తి కొక నివేదనంబు**
**కాదేన్ సర్వాత్మకుండగు కేవలున కొక సేవ.**

ఇది ఇట్లుండ, ఒకరోజామె నేదో శూన్యత ఆవహించినట్లు తోచింది. అది ఆమె భావనలనుండియే ఉద్భవించి, ఆమెను సవాలు చేసింది : "నేను మృత్యువును, తమోభీకర జీవమాతను." (*I am Death and the dark terrible Mother of life.*) విశ్వంతో తాను మమేకమైన భావన తనకు కలిగినప్పటికిన్నీ, ఆమె ఒక "శూన్యనిత్యత్వం" లో (*blank Eternal*) అంతరించ వలసిందే! మృత్యువు అంత సునిశ్చితం. హఠాత్తుగా ఆమె నీరసించి, దుర్బలమైనట్లు తోస్తుంది. కాని యోగంలో ఆమె ప్రారంభక కార్యాలు వ్యర్థం కావు. ఆమె అంతరంగంలో కాంతిసైనికులు ఉత్ఫుల్లమై, ఆ నిషేధక భావాన్ని అవాక్కు చేస్తారు. అదే సమయంలో, ఆమె ఒక మహత్తరమైన భూమిక నిర్వహించవలసి యున్నదని వారామెకు గుర్తుచేస్తారు, ఆమె తన వ్యక్తిగత దుఃఖానికి పరిమితం కాకూడదనిన్నీ హెచ్చరిస్తారు. లోక బాధాసమస్తాన్ని ఆమె స్వీకరించవలసియున్నది. ప్రపంచానికి మృత్యువు నుండి బాధనుండి విముక్తిని కలిగించగోరే ఆ యోగిని అతిమానుష వ్యక్తిత్వాన్ని శ్రీ అరవిందులు చక్కగా వర్ణించినారు :

*His soul must be wider than the Universe*
*And feel eternity as its very stuff,*
*Rejecting the moment's personality*

*Know itself older than the birth of Time,*
*Creation an incident in its consciousness,*
*Arcturus and Belphegor grains of fire*
*Circling in a corner of its boundless self,*
*The world's destruction a small transient storm*
*In the calm infinity it has become.*

**వాని ఆత్మ విశ్వమునకన్న విశాలతరము కావలయు**
**నిత్యత్వమున్ దాని సత్యసారముగ భావించవలయు,**
**క్షణిక వ్యక్తిత్వము న్నిరాకరించి**
**కాలమునకంటె దా సనాతనమన్ ఎఱుక బొందవలయు,**
**సృష్టి తన చేతనయం దొక ఘటన,**
**ఆర్క్టురస్, బెల్ఫెగొర్ అగ్నికణములు**
**తన అసీమితవ్యక్తిలో నొక మూల సుడి దిరుగుచుండు,**
**లోకనాశ మొక చిన్న క్షణికమౌ ఝంఝానిలంబుగా**
**శాంతమౌ అనంతత్వమున వరలు.**

ఈ క్రొత్త పాత్రను నిర్వహించటానికి సావిత్రి సిద్ధమయింది. తన ధ్యానంలో, మనస్సు పూర్తిగా నిశ్శబ్దంగా ఉండవలసిన స్థితిని ఆమె కల్పిస్తుంది. భావాలు జొరబడనివ్వక తనను తాను, తానెవరో వేరే వ్యక్తి అయినట్లు, పరిశీలించగలుగుతుంది. బహువిధ దర్శనాలు కలుగుతాయి. భావమూలాలను చేరుకో గలుగుతుందామె :

*In our unseen subtle body thought is born*
*Or there it enters from the cosmic field.*
*Oft from her soul stepped out a naked thought*
*Luminous with mysteried lips and wonderful eyes;*
*Or from her heart emerged some burning face*
*And looked for life and love and passionate truth,*
*Aspired to heaven or embraced the world*
*Or let the fancy life a fleeting moon...*

**కనరాని సూక్ష్మదేహంలో జనియించు భావము,**
**కాదేని, విశ్వక్షేత్రమునుండి అది చొచ్చుకొని వచ్చు.**
**ఆమె ఆత్మనుండి తఱచుగా వెల్వడు ననాచ్ఛాదితభావ మొకటి**
**అద్భుతోష్ఠములతో కనులతో వెలుగులీను;**
**కాకున్న తన హృదయమునుండి యేదేనొక జ్వలన్ముఖము**

**జనించి, జీవముక్తై, ప్రేమకై, తీవ్రసత్యమునకై చూచు,**
**గగనమునకెగురు, లేక లోకమున్ కౌగిలించు**
**కాకున్న కల్పనన్ క్షణభంగుర చంద్రునట్లు వహించు...**

ఇప్పుడు సావిత్రి సులభంగా చూడలేని దేదీలేదు. ఆమె దృష్టి అంత వేగవంతము, దివ్యము, దోషరహితము. సాధారణ నేత్రానికి కనరాని దిప్పుడు ఆమె ఆధ్యాత్మిక నేత్రానికి కనబడుతూన్నది.

She felt the movements crossing unknown minds;
The past's events occurred before her eyes.
The great world's thoughts were part of her own thought,
The feelings dumb for ever and unshared,
The ideas that never found an utterance.

**అజ్ఞాత మనస్సుల చరించు క్షణాల నామె గ్రహించె;**
**గతఘటనలామె కట్టెదుట గననాయె.**
**మహాప్రపంచభావన లామె భావాన భాగమాయె,**
**ఏనాడు పెదవిదాటని, ఎవ్వరెఱుగని చింతనల్,**
**ఏనాడు భాషాకృతి దాల్చని భావాలు.**

సావిత్రి అన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించి, మానవుని మనస్సొక అతిబృహద్యంత్రమని గుర్తించింది. ఐనప్పటికిని, భూమిపై దాని మనికి సంక్షిప్తము, శరీరమరణంతో దాని క్రియాశీలత ఆగిపోతుంది. కాని మూలభావాలు సజీవంగా ఉండి, శతాబ్దాల తరబడి మానుషమనస్సు ద్వారా సృష్టిని సుసంపన్నం చేస్తూంటాయి.

He listens for Inspiration's postman knock
And takes delivery of the priceless gift
A little spoilt by the receiver mind
Or mixed with the manufacture of his brain;
When least defaced, then is it most divine.

**భావావేశ వార్తావహుని పిలుపుకై చెవులు టిక్కించునతడు**
**అయ్యమూల్య బహుమతిం గ్రహించు నతనినుండి**
**అది గృహీతృమనంబుచే అల్పనష్టంబు గాంచినది**
**కాదేని స్వమేధోత్పాదనలతో సమ్మిళితమైనది;**
**అల్పిష్ఠవినష్టమైనప్పుడది అధికాధికదివ్యమై చనున్.**

సావిత్రి తన మానుషమనః పరిమితులకు దూరంగా నుండటానికి “భగవంతుని కాలరహిత ప్రసన్నతకు” (to God's timeless calm) తనను దానంకితము చేయటానికీ దృఢంగా ప్రయత్నం చేసింది. ఇప్పుడామెలో నిర్వికార శాంతి పూర్ణమయింది. కాని, ఈ ప్రసన్నత ప్రళయమునకై నిరీక్షణ అనవచ్చునా? అట్లా కాలేదు! ఈ లౌకిక జీవితం ఒక వ్యతికరప్రసన్నత కాదు, ఒక సృజనాత్మకమైన ఆస్తిక్యానందం. అందుకే మనం ఆశతో భవిష్యత్తుకై నిరీక్షించటం :

*Even now her splendid being might flame back*
*Out of the silence and the nullity,*
*A gleaming portion of the All-Wonderful.*
*A power of some all-affirming Absolute,*
*A shining mirror of the eternal Truth*
*To show to the One-in-all its manifest face,*
*To the souls of men their deep identity.*

**ఇప్పుడైన నామె భాసురవ్యక్తి మరల జ్వలించవచ్చు**
**ఈ నీరవతనుండి, ఈ అభావము నుండి,**
**సర్వాశ్చర్యపూర్ణముదౌ నొక దీప్తిమద్భాగము.**
**ఏదేనొక సర్వ ప్రమాణీకరణపూర్ణుని యొక శక్తి,**
**నిత్యసత్యంపు ప్రకాశమానాదర్శము**
**సర్వాత్మకేవలునకు తద్వ్యక్తాననము జూపుకొరకు,**
**మానుషాత్మలకు తద్గాఢ వ్యక్తిత్వముం జూపు కొరకు.**

* * *

## 7వ సర్గ – విశ్వాత్మ విశ్వచేతనల దర్శనం

సావిత్రిని ఇప్పుడున్న స్థితిలో (49 సర్గలు, 12 కాండలలోనికి విభక్తం) పునర్విచారణ చేసే సమయంలో శ్రీ అరవిందులు సప్తమ కాండ ఏడవ సర్గకు పేరు పెట్టలేదు. నేను సావిత్రి విషయంగా, మా తండ్రిగారైన ప్రొ॥ కె.ఆర్.శ్రీనివాస అయ్యంగార్ మార్గనిర్దేశంలో, సిద్ధాంతవ్యాసం వ్రాయనారంభించినప్పుడు, నా పరీక్షాధికారులను ఈ మహాకావ్యం, అప్పటికింకా అది పాశ్చాత్య ప్రపంచానికి తెలిసినది కాకపోవటం వలన, వ్యాకులపరచవచ్చునని భావించటం జరిగింది. అర్ధశతాబ్ది క్రిందట పరిశోధనాసిద్ధాంత వ్యాసాలను ఇంగ్లాండ్‌లోని పండితులకు పరిశీలనార్థం సమర్పించే ఆచారం ఉండేది.

ఆంగ్లసాహిత్య విద్యార్థి ఎవరైనా పరిశోధనార్థం ఆంగ్లసాహిత్యసంబంధమైన విషయాన్ని ఎంచుకునేవారు. సావిత్రిని చదవటం నాకదే మొదటిసారి కావటం వలన, మా నాన్నగారు నా సిద్ధాంతవ్యాసంలో భాగంగా ప్రతి సర్గ సంగ్రహం ఉండాలని నిర్ణయించినారు. ఇది ఉత్తేజకమైన, ఇష్టమైన పని. ఎందుకంటే, శ్రీ అరవిందులు సర్గలకు విషయ సంగతమై, ఆ సర్గలోని విషయాల గాఢావగాహనకు అవకాశం కల్పించే విధమైన పేర్లు పెట్టినారు. నేను ఈ సర్గను వ్రాయవచ్చినప్పుడు, దాని నామాంకస్థానాన్ని శూన్యంగా వదలటానికీ నాకు గుండె నిబ్బరం చాల లేదు. ఎందుకంటే, ఈ సర్గ సావిత్రి విశ్వచేతనను పొందే విషయాన్ని వర్ణిస్తుంది. కొంతసేపు ఆలోచనామౌనంలో గడిచిన తర్వాత మా నాన్నగారు నా పరిశోధనావ్యాసంలోని ఈ విభాగానికి "భగవంతుని జపాకుసుమం" (Rose of God) అని శ్రీ అరవిందులు తమ వేరొక పద్యకృతికి పెట్టిన పేరునే ఎంచుకున్నారు. అటు తరువాత సావిత్రి క్రొత్త ముద్రణలో శ్రీ అరవిందాశ్రమ ప్రకాశనం వారు, ఇప్పుడున్న ఈ నామకరణం చేసినారు.

సావిత్రి ధ్యానాచరణలు, ఈ యోగకాండ విషయంగా ఉన్నవి. ఇవి ఆమె అరణ్యజీవనంలోని నిత్యకృత్యాలకు భంగం కలిగించేవిగా లేవు. మిగత వారికి సంబంధించినంతవరకు ఆమె "అదే పూర్ణసావిత్రి". ఆమె ఎక్కువ మాట్లాడదు కాని మాట్లాడినప్పుడు ఆ అరణ్యంలోని మునుల మన్నను పొందినది. ఒకనాడు ఆమె నిద్రిస్తూన్న సత్యవంతుని ప్రక్కన కూర్చుని ఉన్నప్పుడు, ఈ ప్రపంచం అసత్యం కాదనిన్నీ. ఇది శూన్యంలో కలిసిపోవటానికి సృష్టింపబడలేదనిన్నీ, ఆమెలో ఒక వాణి నమ్మబలుకుతుంది. సమస్తమూ సత్యమనీ, ఈ సత్యం తన ఆత్మ, సమస్తాత్మ, ఒక దివ్యసంయోగంలో అనీ ఆమె గ్రహిస్తుంది :

*It was her self, it was the self of all,*
*It was the reality of existing things,*
*It was the consciousness of all that lived*
*And felt and saw; it was Timelessness and Time,*
*It was the bliss of formlessness and form.*
*It was all Love and the one Beloved's arms,*
*It was sight and thought in one all-seeing Mind,*
*It was joy of Being on the peaks of God.*

**అది యామె ఆత్మ, అది సర్వాత్మ,**
**అది మనికి గల వస్తుసత్యమగును,**
**జీవించి, భావించి, చూడగలవానికెల్ల అది చేతన;**

**అది కాలరహితము, కాలమున్, సాకారనిరాకారతల**
**ఆనందమది, అది యంతయు ప్రేమ,**
**ఏకైక ప్రేమిక బాహువుల్,**
**అది దృష్టి, భావంబు సర్వసాక్షి మనోమాత్రమందు,**
**అది సత్తాసంతోషము భగవత్ శిఖరాగ్రములన్.**

జీవితం అంటే చావును గురించి దుఃఖించటం కాదు. భూమ్మీద జీవించటంలోని ఆనందాన్ని గుర్తించాలి! సావిత్రి వలె సర్వగ్రహణ దృష్టి గలవారు మృత్యువు చరమం కాదనీ, పరిణామ ప్రణాళికలో అది శాశ్వతమూ కాదని తెలుసుకుంటారు. ఈ సృష్టి “ఏకైకమైన బృహద్వాస్తవికత” (one single immense reality) కాలమూ అట్లాగే ఒకే ఒక అతుకులు లేని విస్తరణ. ఈ సర్వవ్యాపి వాస్తవికత నిజానికి ఆస్తిక్యానందంతో స్పందిస్తుంది. ఈ సత్యాన్ని శ్రీ అరవిందులు తమ మహాగ్రంథం, దివ్యజీవనం లో (The Life Divine) సవివరంగా వ్యాఖ్యానించినారు. ఈ పుస్తకం నుండి, ఈ పరిస్థితిలో సావిత్రి మనఃస్థితి ఎట్లా ఉన్నదో, మనకు అవగతమవుతుంది :

“ఎందుకంటే, ఈ విశ్వచేతనలో మనస్సు, జీవితమూ కూడా మధ్యస్థులే, ఎంతమాత్రమూ, సాధారణ అహంకారి మనస్తత్వంలో కనిపించినట్లుగా, విభజన కారకాలు కావు; ఆ అజ్ఞేయమైన సత్యంలోని అవిశంక్య, నిషేధార్థకసూత్రాల మధ్య ఒక కృత్రిమమైన విప్రతిపత్తిని ఉద్దీపింపజేసేవి కావు. విశ్వచేతన నందుకున్న మనస్సు, ఏక కాలంలో ఐక్యతాసత్యాన్నీ బహుళత్వసత్యాన్నీ పారస్పరికతా సూత్రాన్వయంతో, సంఘర్షణలను దివ్య సమన్వయసూత్రంతో పరిష్కరించగల జ్ఞానంతో సందీప్తమవుతుంది; సంతుష్టితో, అది భగవంతునికీ జీవితానికీ మధ్య మనం ఉద్దేశించిన పరమైక్యతకు సంధానకర్తగా వ్యవహరించేందుకు అంగీకరిస్తుంది.”

అటువంటి వ్యక్తి ఒక మహాత్ముడు; వాసుదేవస్సర్వమితి, అని గీతలో చెప్పినట్లు, సర్వము పరమాత్మయే, అన్న సత్యమెఱిగినవాడు. ఇప్పుడు సావిత్రి, సమస్తాన్నీ ఆ పరమాత్మగా దర్శిస్తూన్నది కనుక, ఇట్టి మహాత్మయైనది :

Her spirit saw the world as living God;
It saw the one and knew that all was He.

**ఆమె ఆత్మ ప్రపంచమును జీవద్భగవంతునిగ జూచె;**
**అది ఆ కేవలుని జూచె, నంత సమస్తమాతడేయని తెలిసె.**

భగవంతుడు కానిదేదీ లేదు, తాను సైతము. కనుక ఎవరైన జీవమును మరణము

నుండి వేర్పఱచుటెట్లు? శరీరమును ఆత్మ నుండి వేర్పఱచుటెట్లు? సృష్టి ఒక అనివార్య శూన్యము దిశగా కదలుట లేదు. ఈ జీవితంలో మరణోన్ముఖమైనప్పుడు, అందఱికీ కలిగే సాధారణమైన భావం కదా! మనకు ఇది ఒక తిరుగులేని పరిస్థితిగా తోస్తుంది. ఎందుకంటే, వ్యక్తి ఒక అజ్ఞాత, శూన్య, అంధకారంలోకి అడుగు పెడుతున్నాడు మరి. కాని శ్రీ అరవిందులు స్పష్టంగా అంటారు :

The unknown is not the Unknowable, it need not remain
the unknown for us, unless we choose Ignorance or persist
in our first limitations.

**"అజ్ఞాతం అజ్ఞేయం కాదు, మనకది అజ్ఞాతంగా ఉండిపోనక్కర్లేదు,**
**మనం అజ్ఞానాన్ని వరిస్తే తప్ప, లేక అది పరిమితులనే అనుసరిస్తే తప్ప."**

సావిత్రి అజ్ఞానానికి బద్ధురాలై ఉండటానికి అంగీకరించలేదు. తీవ్రమైన ధ్యానం, మరణం సర్వం కాదనీ, అది అంతం కాదనీ, ఆమెకు తెలియజెప్పింది. భగవంతునితో తన అభేదత్వాన్ని ఆమె గ్రహించింది. వాసుదేవుడు సర్వమైతే, ఆ సర్వం నుండి నేను బహిష్కృతుడను కాను! శ్రీ అరవిందు లీ సర్గను సమాప్తం చేస్తూ, సావిత్రి విశ్వచేతననూ, ఆమె విశ్వమయ దివ్యత్వంతో తన అభేదాన్ని కనుగొన్న విధాన్నీ, అద్భుతంగా స్వాగతిస్తారు:

What seemed herself was an image of the Whole.
She was a subconscient life of tree and flower,
The outbreak of the honied buds of spring ;
She burned in the passion and splendour of the rose,
She was the red heart of the passion-flower,
The dream - white of the lotus in its pool.

**తానుగా తోచినది సాకార సమస్తత్వమగును.**
**తాను వృక్షపుష్పాల అజ్ఞాతచేతనా జీవమగును,**
**వసంత సుధాముకుళా స్ఫోటము తాను :**
**జపాకుసుమమనోవృత్తివైభవములందు జ్వలించినది,**
**తీవ్ర భావనాకుసుమహృదయరాగంబు తాను,**
**సరః స్థిత పద్మగత స్వప్న శ్వేతంబు తాను.**

తానొక సువర్ణాధిరోహిణియై మానవుని ఆత్మ భగవంతుని చెంతకారోపించటానికి సహకారిగా వచ్చినది. ఈ స్థితిని పొంది, ఆమె సాక్షాత్ మహాసరస్వతీదేవి, శుంభ-నిశుంభ వధకై, దేవీమాహాత్మ్యములో విజృంభించిన రీతియైనది :

*From this she rose where Time and Space were not;*
*The superconscient was her native air,*
*Infinity was her movement's natural space;*
*Eternity looked out from her on Time.*

**ఇటనుండి యామె కాలదేశములు లేని తావులకుద్గమించె;**
**అతిచేతన ఆమె మూలరూపమౌను,**
**ఆనంత్యమామె సంచార సహజసీమ,**
**నిత్యత్వ మామె నుండి కాలంబు నాలోకించు.**

❊ ❊ ❊

## 8వ కాండ - మరణకాండ

## 3వ సర్గ - అరణ్యంలో మరణం

ఇంతవరకు స్థిరంగా, కాండ తర్వాత కాండ, సర్గ తర్వాత సర్గ, సాగుతూ వచ్చాము. అష్టమకాండలో తటాలున ఒక కుదుపు యేర్పడింది. ఈ కాండ ప్రారంభంలో కథను ప్రథమ కాండ రెండవ సర్గనుండి కొనసాగించవలసియున్నది. శ్రీ అరవిందులీ కాండను మూడు సర్గలుగా భావించినారు కాని మూడవ సర్గ ఒక్కటి మాత్రమే "ఒక పూర్వప్రతి నుండి, అక్కడక్కడ పునా రచించి" పూర్తిచేయగలిగినారు. ఇంతకు ముందే మనం చెప్పికొన్నట్లు, వ్యాసుని రచనలో సావిత్రి ఆచరించిన త్రిరాత్రవ్రతం శ్రీ అరవిందులు రచించిన యోగకాండలో ఎట్లా పరివర్తనం చెందినదో, సావిత్రి ధ్యానయోగంతో ఆమెకెట్లా తన రహస్యాత్మను గురించి, విశ్వచేతనను గురించి, చివరగా, అతిచేతన లేక అధిచేతనను గురించి, సాకారజ్ఞానం లభించిందో గమనించినాము.

మన ముందున్న ఈ మూడవ సర్గలో శ్రీ అరవిందులు వ్యాసుని ఉపాఖ్యానంలోని కీలకమైన ప్రాధాన్యం గల యే విషయాన్నీ, సావిత్రీ సత్యవంతులా విధి నిర్ణీతమైన రోజున అరణ్యానికి వెళ్ళటం, సత్యవంతుని మరణం, వీటికి సంబంధించిన విషయాలేమీ తీసివేయలేదు. కనుక అష్టమ కాండ మొదటి రెండు సర్గలలో వారేమి చెప్పాలనుకున్నారు? శ్రీ అరవిందులు బహుశః మరణాగమనాన్ని తాత్త్విక, ఆధ్యాత్మిక పరిభాషలో పరిచయం చేయదలచినారేమో. ఈ విషయాన్ని గూర్చి ఊహ చేయటం వ్యర్థం.

ప్రథమ కాండ మొదటి రెండు సర్గలలో, సత్యవంతుడు మరణించవలసిన రోజున, సావిత్రి ఉదయాన ఎట్లా ఆశ్రమంలో నిద్ర మేల్కొన్నదో, ఆ వివరాలు చూచాము. ఈ సర్గ ఆరంభంలో మళ్ళీ అదే సమయానికి వెనక్కి వెళ్తున్నాము. శ్రీ అరవిందులు సావిత్రి ప్రారంభాన్ని గుర్తు చేసికొంటూన్నారు :

*Now it was here in this great golden dawn.*
*By her still sleeping husband lain she gazed*
*Into her past as one about to die*
*Looks back upon the sunlit fields of life*
*Where he too ran and sported with the rest*
*Lifting his head above the huge dark stream*
*Into whose depths he must for ever plunge.*
*All she had been and done she lived again.*

**ఇట నీ మహత్ సువర్ణ సూర్యోదయాన**
**నిద్రితభర్త ప్రక్కన పరుండి ఆమె చూచె**
**తన గతమ్ములోనికి మృత్యుముఖమున నున్నవాడు**
**తన జీవితములోని ఉజ్జ్వల క్షేత్రాల జూచినట్లు**
**ఏడ తాను పర్విడి క్రీడించెనో ఎల్లరజేరి,**
**విశాలాంధకారసరిత్తుపైకెత్తి శిరము**
**ఏ యగాధములలో తా మునుంగవలెనొ.**
**తానెద్దియైయుండె నేమిచేసె నద్దాని జీవించె మరల.**

భారతీయురాలైన ఒక భార్యకు ప్రతిరూపంగా, అర్చారూపంలో తాను దర్శించే దివ్యమూర్తిలో ప్రగాఢ విశ్వాసంతో, శ్రీ అరవిందుల సావిత్రి మొదట దివ్యమాతకు నమస్కరిస్తుంది. ఆమె అక్షరసత్యంగా ఒక భయంకర యుద్ధాన్ని ఎదుర్కోబోతున్నది కనుక, శ్రీ అరవిందులు ఈ అర్చామూర్తికి దుర్గరూపాన్ని సంతరించినారు.

*Then silently she rose and, service done,*
*Bowed down to the great goddess simply carved*
*By Satyavan upon a forest stone.*
*What prayer she breathed her soul and Durga knew.*
*Perhaps she felt in the dim forest huge*
*The infinite Mother watching over her child,*
*Perhaps the shrouded Voice spoke some still word.*

**అంత మౌనముగ లేచెనామె, సేవ గావించి,**
**సత్యవంతుడయ్యటవీశిలపై జెక్కిన**
**దేవతామూర్తి కొయ్యన అవనతయై మ్రొక్కె.**
**ఆమె పలికిన ప్రార్థన లేమొ తదాత్మ ఎఱుగు, దర్గ ఎఱుగు.**
**బహుశః ఆ మసక వెల్గుల కారడవిలో నామె భావించె**
**అయ్యనంతమాతను, తన వత్సపై చూపు నిల్పి చూడ,**
**బహుశః తదాచ్ఛాదిత వాణి ఏదేనొక దృఢ వాక్కు బల్కె.**

ఎందుకంటే, దుర్గ యుద్ధంలో విజయాన్నిస్తుందని అందరికి తెలిసిన విషయమే కదా. కురుక్షేత్రయుద్ధారంభంలో, కృష్ణుడు గీతను ఉపదేశించచక పూర్వమే, ఆతడు దుర్గామాతను ప్రార్థించుమని అర్జునునకు చెబుతాడు. అర్జునుడు రథం దిగి, చేతులు

జోడించి నమస్కరిస్తూ పదమూడు శ్లోకాలలో ఒక మహిమాన్వితమైన దుర్గాస్తోత్రం చేస్తాడు:

**నమస్తే సిద్ధసేనాని ఆర్యే మందరవాసిని ।**
**కుమారి కాళి కాపాలి కపిలే కృష్ణపింగళే ॥**

శ్రీ అరవిందులకు దుర్గను ప్రార్థించటంలో చాల విశ్వాసమున్నది, (విరాటపర్వంలో కూడ ఒకటున్నది), అది కాక తాను స్వయంగా బెంగాలీలో ఒక దుర్గా స్తోత్రం వ్రాసినారు. ఈ మౌన ప్రార్థనతో సావిత్రికి కూడా విజయం సునిశ్చితమయింది. అంతట సావిత్రి తన అత్తగారివద్దకు వెళ్ళి, తాను సత్యవంతునితో కూడా అడవికి వెళ్ళటానికి అంగీకారాన్ని కోరుతుంది. ఆ పెద్ద ముత్తయిదువ ఆ దంపతులను ఆశీర్వదించి పంపగా వారు ఆ అరణ్యంలో చెట్టాపట్టాలు వేసికొని సంతోషంగా సంచరిస్తారు.

సత్యవంతు డానందంగా మాట్లాడుతూంటాడు. ఎందుకంటే, తనతో కలిసి సావిత్రి అడవికి రావటం ఇదే మొదటిసారి. అడవిలోని రకరకాల వృక్షాలను, పక్షులను చూపించి చెబుతూంటాడు. అంతసేపూ, ఏ క్షణాని కా క్షణం అతడు మాట్లాడే ఆఖరు మాట అదేనేమో అన్న చింతతో ఉంటుంది సావిత్రి. సత్యవంతుడు పనిలోకి దిగి, చెట్టును నరకటం మొదలుపెట్టి, త్వరగా అలిసిపోతాడు. అతడు తన భార్యతో, తాను శరీరంలో ఏదో బాధతో సదమదమవుతూన్నాననీ, కొంతసేపు విశ్రమిస్తాననీ అంటాడు. ఆమె కూర్చుని, అతని తలను ఒడిలో ఉంచుకుంటుంది, అతనికి సుఖంగా నిద్రపట్టాలని. బాధను భరించలేక అతను ఆమె పేరును గట్టిగా పిలుస్తాడు, ఆమె ఆతనిని ముద్దిడటానికి వంగుతుంది :

And even as her pallid lips pressed his,
His failed, losing last sweetness of response;
His cheek pressed down her golden arm. She sought
His mouth still with her living mouth, as if
She could persuade his soul back with her kiss;
Then grew aware they were no more alone.
Something had come there conscious, vast and dire.
Near her she felt a silent shade immense
Chilling the noon with darkness for its back.

**ఆమె పేలవమైన పెదవు లాతని పెదవుల నద్దునంతలో**
**కడపటి తియ్యందనపు ప్రతిస్పందన కాతని పెదవులాడవు;**
**వాని చెక్కిలి యామె సువర్ణ బాహువు నొత్తిపట్టె. ఐన**

**ఆమె పెదవులాతని పెదవులం దడపజొొచ్చె, తన ముద్దుతో**
**వాని ఆత్మను మరలి రాగ బ్రతిమాలుచున్నయట్లు;**
**అప్పుడెఱింగె నామె తా మట నేకాంతమున లేమని,**
**ఏదియో చైతన్యవర్ధీకర విస్తార మటకు వచ్చె.**
**నికటంబున నొక బృహన్మూకచ్ఛాయ దోచె**
**తత్ పృష్టంబున నంధకారంబుదాల్చి, మధ్యాహ్నంబు చల్లనాయె.**

దిక్కులన్నిట నిరానంద నిశ్శబ్ద మావహించింది. జంతువులు, పక్షులు సైతం నీరవములైనవి. పుడమి నిప్పుడొక అనామక భయవిషాదాలావహించినవి. ఏమి జరుగబోతూన్నది? ఏమి జరుగుతూన్నది? విశ్వపరిణామ నాటకానికిది చరమాంకమా? ఇంతవరకు అనుభవించిన జీవితమంతా ఒక మిథ్యాస్వప్నమా? చూచినది, తాకినది, ఆనందించినది సర్వమూ భ్రాంతియేనా? మరణభయమెంత సత్యమో ఇప్పుడొక రెండు పంక్తులలో చెప్పబడింది :

*She knew that visible Death was standing there*
*And Satyavan had passed from her embrace.*

**దృశ్యమానమృత్యువచట నిల్చెనని యెఱిగెనామె**
**అంత సత్యవంతుడామె కౌగిలి వీడి చనియె.**

❊ ❊ ❊

## 9వ కాండ - నిత్యనిశీధి కాండ

## 1వ సర్గ - కాల శూన్యము దిక్కుగా

శ్రీ అరవిందులు వ్యాసుని ఉపాఖ్యానాన్ని గాఢంగా అనుసరిస్తూనే, ఈ కథలోని యముని ప్రత్యక్షాన్ని గురించి చెప్పేవిషయంలో ఒక ముఖ్యమైన మార్పు చేసినారు. వ్యాసుని ఉపాఖ్యానంలో యముడు ధర్మరాజు, అనుగ్రహం గల దేవత. వాని చేతిలోని పాశం నిస్సంశయంగా భయంకరమైనదే, కాని ఆతడు దివ్యుడనీ, సూర్యుని వలె కాంతిమంతుడనీ, **ఆదిత్య తేజసం,** వర్ణించినాడు. వారి సంవాదం నిజానికి చాలా ఉదాత్తంగా, అనుగ్రహకారకంగా ఉంటుంది. యముడు సావిత్రి సంభాషణలోని వివేకానికి అంతకంతకు అధికాధికంగా సంతోషించి ఆమెకు వరాలు ప్రసాదిస్తాడు. చివరకు సత్యవంతుని ప్రాణాన్ని ఆమెకు తిరిగి ఇచ్చే సమయంలో, ఆతడా దంపతులను చిరాయు ర్భాగ్యాలతో దీవిస్తాడు. ఈ వైఖరిని శ్రీవిష్ణుపురాణం, శ్రీ గరుడపురాణం కూడ సమర్థించినవి. మహాభారతంలోనే విదురుని న్యాయశాస్త్రజ్ఞునిగా, జ్ఞానమూర్తిగా, యముని పుత్రునిగా చెప్పటం మన మెఱిగినదే.

శ్రీ అరవిందుల యముని చిత్రణ ఇందుకు చాలా భిన్నంగా ఉంటుంది. పరమాత్ముని రెండు ఆకృతులను, మృత్యుమోహరూపంగా, జీవజ్ఞాన రూపంగా వేర్వేరు వ్యక్తులుగా ప్రదర్శించినారు. మనం గందరగోళంలో పడకుండా ఉండటానికి, శ్రీ అరవిందులసలు 'యముడు' అన్న పేరునే ఉపయోగించలేదు. మొదట పరమాత్మ మృత్యుమోహరూపం, సత్యవంతుని ప్రాణాన్ని తీసుకువెళ్ళుతూ, సావిత్రితో వాగ్వాదానికి దిగుతూ, "ప్రపంచాత్మ" (the soul of the world) సత్యవంతుని పాశముక్తిని చెయ్యటానికి తిరస్కరిస్తూ, దర్శనమిస్తుంది. ఈ సర్గలో సావిత్రి మృత్యువును వెంబడిస్తూ కనిపిస్తుంది: ఆతడు సత్యవంతుని ప్రాణాన్ని తీసుకు వెళుతూన్నాడు కదా.

ఆమె సత్యవంతుని శరీరాన్ని గట్టిగా పట్టుకోగానే, ఆజ్ఞాచక్రం విప్పారుతుంది:

The veil is torn, the thinker is no more :
Only the spirit sees and all is known.
Then a calm Power seated above our brows
Is seen, unshaken by our thoughts and deeds,
Its stillness bears the voices of the world...

A Force descended trailing endless lights;
Linking Time's seconds to infinity,
Illimitably it girt the earth and her :
It sank into her soul and she was changed.

**ఛిన్నమాయె నాచ్ఛాదనంబు, తాత్త్వికుండిక లేదు :**
**ఆత్మ మాత్రమె చూచు, సర్వమవగతంబగు.**
**అంత భ్రువులపై నొక ప్రశాంత శక్తి అధిష్ఠించి**
**మన చింతలచే చేతలచే చలించక కన్పించు,**
**తన్నిశ్చలత వహించు ప్రపంచస్వరముల...**
**ఒక శక్తి అనంతకాంతుల మార్గాన నవతరించె;**
**కాలిక క్షణముల ననంతమునకు జోడించుచు**
**అపరిమితయై భూమిని ఆమెను చుట్టివేసె :**
**అది యామె ఆత్మలో నొదిగిపోయె, ఆమె మారిపోయె.**

సావిత్రి మెల్లగా సత్యవంతుని నేలపై నుంచి, వాని వంక చూచి, అంతట "వాతాయనము నుండి తేరిన వృక్షంబు పగిది" (*like a tree recovering from a wind*), ఆమె ఆ అజ్ఞాత వ్యక్తితో యుద్ధానికి సిద్ధమవుతుంది :

*Something stood there, unearthly, sombre, grand,*
*A limitless denial of all being*
*That wore the terror and wonder of a shape.*
*In its appalling eyes the tenebrous Form*
*Bore the deep pity of destroying gods;*
*A sorrowful irony curved the dreadful lips*
*That speak the word of doom. Eternal Night*
*In the dire beauty of an immortal face*
*Pitying arose...*

**అభౌతికము, మలినము, మహోన్నతమునైనదేదో నిల్చెనట**
**సాకారభీకరాశ్చర్యమౌ నొక అసీమత సత్తాసర్వనిషేధము.**
**తదాకారభీకరనేత్రాలు**
**వినాశకదేవతాగాఢానుకంపను వహించె;**
**ఒక దుఃఖపూర్ణ వ్యంగ్యోక్తి వక్రించె**
**ప్రాణాంతక వాణి విన్పించు తద్భయంకరోష్ఠములన్;**
**శాశ్వతనిశీథి తద్దారుణ సుందరదివ్యాననమున**
**కారుణికమై ఉద్భవించె...**

శ్రీ అరవిందులు మృత్యువు ఆకారం "వాస్తవికమైన శూన్యము" (*nothingness made real*) అంటారు. ఇప్పుడు ఆ స్త్రీయున్ను మృత్యువున్ను వెన్ను జూపకుండ

ఎదురెదురుగా నిల్చినారు. అమేయకాలానుభవకంఠాలు మృతుని వదలివేయుమని ఎలుగెత్తుతాయి, కాసేపు యేడ్చి, మర్చిపో, జీవనవిధికి మరలు మంటూన్నాయి. నిజానికి భూమ్మీద మానవజీవితం అటువంటిదే కదా, ఒక నీటి బుడగకంటె ఎక్కువేమీ కాదు! కాని ఆమె ఆ సలహాను పాటించలేదు, సత్యవంతుడు మరణించినాడన్న విషయాన్ని అంగీకరించలేదు, అనుదినమూ ఉదయాన గత సంవత్సరమంతా దినచర్యకై నిద్రలేచినట్లే, ఆమె లేచి నిల్చున్నది. నేడు కూడ ఆమెకు పాలించదగిన విధియొకటున్నది. అదే మృత్యువుతో పోరాడి విజయాన్ని సాధించటం.

*She rose and stood and gathered in lonely strength,*
*Like one who drops his mantle for a race*
*And waits the signal, motionlessly swift.*

**ఆమె లేచి సమీకృతశక్తితో ఏకాకియై నిల్చినది,**
**పరుగుపందెమునకై పై పటము జార్చిన వానివోలె,**
**సంకేతమునకునై నిశ్చల వేగాన నిరీక్షసేయు.**

ఆమె నిటారుగా నిలువుగా, మృత్యువు క్రిందకు వంగి, సత్యవంతుని జీవాన్ని సంగ్రహించినది. "వేరొక కాంతిమత్ సత్యవంతుడు" (Another luminous Satyavan) నేలపై నున్న శరీరము నుండి బయల్పడి ముందుకు కదలగా, మృత్యువు వెనుక నడచినాడు. సావిత్రి మృత్యువు ననుసరించినది. ఇదంతా పూర్తిగా నిశ్శబ్దంగా జరిగింది. కొంతసేపు వారు నడుస్తూన్నారు, భూమికి దగ్గరగా ఉన్నట్లు కనిపించినారు. కాని అచిరకాలంలోనే వారు జీవతలాన్ని దాటి పోతారు. సత్యవంతుడున్నూ మృత్యువున్నూ ఆమె దృష్టిపథం నుండి అదృశ్యులవుతారేమో అని సావిత్రి చింతించినది. కనుక, ఆమె ఆత్మ, "ఒక స్వర్ణాగ్ని పిండమువలె ఱెక్కవిదళించి" (outwinging like a mass of golden fire) సత్యవంతుని వంకకు ఎగురుతుంది, తన శరీరాన్ని భూమ్మీదనే విడిచి. ఆమె ఇప్పుడు మర్త్యసావిత్రికంటె అధికురాలు. ఎందుకంటే, ఆమె సంకల్పశక్తిస్వరూపంగా మారిపోయింది.

వారిప్పుడు వృక్షాలులేని నిర్జీవ ప్రపంచాలలో కదులుతూన్నారు. సత్యవంతుడు తన "అద్భుతనేత్రాల"తో సావిత్రి వంక చూస్తాడు. కాని మృత్యువు ఆమెతో కఠినంగా ఇట్లా అంటుంది :

*O mortal, turn back to thy transient kind;*
*Aspire not to accompany Death to his home,*
*As if thy breath could live where Time must die...*

**ఓ మర్త్యజీవీ, మరలి నీ అశాశ్వతులవద్దకేగుము;**
**మృత్యువును వాని ఇంటి దనుక వెంబడించగోరకుము,**
**కాలమే మరణించు తావున నీ శ్వాస నిల్వబోదు...**

కాలపరిమితికి తప్పక లోనైయుండే మానవుల అశాశ్వత ప్రేమలను గురించి దేవతలు పట్టించుకోరు. ఆమె ఈ దారుణ సీమలలోనికి అడుగిడకుండ తిరిగి వెళ్ళిపోవటం మంచిది. కాని సావిత్రి మృత్యువుకు సమాధానం చెప్పదు, ముందుకు కదుల్తుంది, సత్యవంతునిపై నుండి దృష్టిని మరల్చదు. మౌనబలవత్ సంకల్పశిల్ప మామె,

Against midnight's dumb abysses piled in front
A columned shaft of fire and light she rose.

**ఎదుట కుప్పలువోసిన నిశీథనీరవాగాధముల వంక**
**ఒక అగ్నికీలాస్తంభజ్యోతిగా నామె ఎదిగె.**

❊ ❊ ❊

## 2వ సర్గ – నిరంతర నిశీథిలో పయనం అంధకారవాణి

ఆ భయంకర ప్రయాణం ఆ ముగ్గురినీ "నిశాశీతలభీకరాంచలము" (Chill dreadful edge of Night) నకు చేరుస్తుంది. అక్కడ ఆకాశం కూడా "ఒక బిభీషికా మేఘావృతఫాలము" (a cloudy brow of menace) వలె ఉన్నది. ఎటు చూచినా పూర్ణ నిశ్శబ్దం. మృత్యువు సత్యవంతుని ఆత్మను తీసికొని పోతూన్నది. కనుక సావిత్రి కిది నిజమైన పరీక్ష. మూర్తీభూత శూన్యంలోని కామె ప్రవేశించటానికి సాహసిస్తుందా? అట్లయితే, ఆమెకు, తన ఆలోచించి మార్గదర్శనం చేయగల మనస్సుతో సహా, యే లౌకిక సహాయమూ అందదు. శ్రీ అరవిందులు ఆ పరిస్థితి ఎంత భయంకరమో చెప్పటానికి ఉపయోగించిన పదచిత్రం గుర్తుంచుకోదగినది :

A curtain of unpenetrable dread,
The darkness hung around her cage of sense
As, when the trees have turned to blotted shades
And the last friendly glimmer fades away,
Around a bullock in the forest tied
By hunters closes in no empty night.

**అచ్ఛేద్య భీయవనిక యొకటి,**
**అయ్యంధకారమామె జ్ఞానేంద్రియ పంజరము చుట్టు నుండె**
**విపినాన నొక వృషభంబు చుట్టు**
**వృక్షముల్ నీడల మచ్చులైన వేళ**
**కడపటి మైత్రీకాంతి మాయునపుడు**
**మృగయావినోదులు గట్టినది మిథ్యారాత్రిలో ముగియనట్లు.**

కాని సావిత్రి ఓటమి నంగీకరించదు, ఆమె సంకల్పశక్తి ఆశను పునఃప్రేరేపిస్తుంది. ఆమె ఆత్మ ఆ బాధను అధిగమించగలదు, చుట్టూ సంతోషాన్నిసైతం వెదుకగలదు, సత్యవంతుని అడుగులు ఆమె చేతనకు వినబడుతూన్నవి.

మృత్యువుకిది క్రొత్త అనుభవం. అతడు వెంటనే తన సీమలోనికి ప్రవేశించరాదని సావిత్రిని హెచ్చరిస్తాడు. ఐనా అతని మాటలు భ్రాంతిని కలిగించేటంత వినమ్రంగా ఉన్నాయి. ఆమె సుదీర్ఘబాధాజీవనమైన భూలోకానికి సత్యవంతునెందుకు తీసికొని పోవాలి? భూమి, అనిత్యం అసుఖం లోకమ్! కాని ఆమె ఉత్తిచేతులతో తిరిగి పోరాదు. ఎందుకంటే, ఆమె నిర్ణయం అతని మెప్పును పొందినది. కనుక అతడు ఆమె ఉత్తమ ప్రేమను శ్లాఘిస్తూ కొన్ని బహుమతు లివ్వదలచినాడు. కాని సావిత్రి స్థిరతర చిత్తం గలది. ఆమె మృత్యువే అంత్యమని అంగీకరించదు. ఆమె అతనిని "శుద్ధ అబద్ధం" (black lie) అంటుంది. సత్యవంతుని జీవాన్ని అనుసరించటం మానదు. ఇంతలో సత్యవంతుడు తన జీవితంలో ఏమి కోరుకున్నాడో దానిని ప్రసాదించటం ద్వారా మృత్యువు, కావాలనుకుంటే, తనను తాను సంతోషపరచుకోవచ్చు. సత్యవంతుడు ద్యుమత్సేనుని కంటిచూపు, రాజ్యము తిరిగి ఆతడు పొందవలెనని కోరుకున్నాడు కనుక మృత్యువా రెండిటిని సులభంగానే ప్రసాదించినాడు.

ఇంతసేపూ సావిత్రి సాగిపోతూనే ఉన్నది వారి వెంట. మృత్యువు చేసిన నివారకోపదేశాల కామె దృఢంగా సమాధానమిస్తుంది : "నా సంకల్పము గూడ నొక శాసనము, నా శక్తి యొక దైవతము. నా మర్త్యత్వమున నే నమర్త్యనగుదు" (*My will too is a law, my strength a god. I am immortal in my mortality*) ఆమె భయపడదు, కంపించదు, కన్నీరు గార్చదు మృత్యుసమ్ముఖమునందు! మృత్యువు మృత్యువే చరమని చెబుతూండగా, ఆ చీకటి తావులలో వారు సాగుతూనే ఉన్నారు. మృత్యువే నిజమైన దేవుడు, పరముడు! ఒకసారి మృత్యుసామ్రాజ్యములోని కదుగిడిన తరువాత, ఇంక సావిత్రి లేదు, సత్యవంతుడు లేదు. ఆమె చేయగలిగినదంతా తిరిగి వెళ్ళి, తాను భావించిన

అమరత్వాన్ని గట్టిగా భావించవచ్చు. సావిత్రి సమాధానం, సంకటపరిస్థితుల్లో ధరించదగిన ధైర్యానికి చిహ్నం :

*O Death, who reasonest, I reason not,*
*Reason that scans and breaks, but cannot build*
*Or builds in vain because she doubts her work.*
*I am, I love, I see, I act, I will.*

**హే మృత్యో, తర్కింతువీవు, నేను తర్కింప,**
**తర్కము విశ్లేషించి ఛిన్నము జేయు, నిర్మించలేదు**
**కాదేని నిర్మించు నిరర్థకంబుగా, ఏలన శంకించు**
**తన కర్మంబును దానె.**
**నే జీవింతు, ప్రేమింతు, చూతు, స్పందింతు, సంకల్పింతు.**

మృత్యువిప్పుడు మాట మార్చి, సావిత్రితో పూర్ణ, దోషరహిత జ్ఞానం అవసరమంటుంది. ప్రేమ అశాశ్వతం. ఇది తెలియటం వివేకం. కాని సావిత్రి ఈ వైఖరిని కూడ నిరాకరిస్తుంది. ప్రేమానుభవం లేనే లేకుండ జ్ఞానాన్ని గురించి మాట్లాడటమే అర్థరహితం కదా? కేవల జ్ఞానం తృణ సమానం! నిజానికి ఎవరికైనా అంతర్యామి విశ్వాత్మను బోధించేది ప్రేమ మాత్రమే, ఎవరైనా పరమేశ్వరుని చేరటానికి వారథిని నిర్మించటానికి కారణం ప్రేమయే. జ్ఞానం చాలా చాలా విస్తారమైనది, కాని ప్రేమమయమైన హృదయం ఆ జ్ఞానాన్నంతా క్షణంలో పొందుతుంది. తానేమో తనకు ప్రేమయే తెలియజెప్పింది, సత్యవంతునితో సహజీవనం తనకు తనదైన సత్యప్రకృతిని భావించే శక్తినిచ్చింది, తాను భూమిపై జన్మించటానికి గల కారణాన్ని తెలియజేసింది.

*Love in me knows the truth all changings mask.*
*I know that knowledge is a vast embrace :*
*I know that every being is myself,*
*In every heart is hidden the myriad One.*
*I know the calm Transcendent bears the world,*
*The veiled inhabitant, the silent Lord :*
*I feel his secret act, his intimate fire;*
*I hear the murmur of the cosmic Voice.*
*I know my coming was a wave from God.*

**సర్వపరివర్తనఛద్మసత్యమున్ నాలోని ప్రేమ యెఱుగు.**
**జ్ఞానమొక విస్తార పరిష్వంగమని యే నెఱుగుదు :**

**సమస్త ప్రాణులున్నేనని యెఱుగుదు,**
**సర్వహృదయాలలో దాగియున్నా దయ్యయుతకేవలుండు**
**ప్రశాంత సర్వాతిశాయి లోకము వహించుటెఱుగుదు,**
**తదాచ్ఛాదితాంతర్యామి, తదవాక్ప్రభుని :**
**తద్రహస్యకార్యమున్ తద్హృదయంగమాగ్నిననుభవింతు;**
**తద్విశ్వవాణీ మర్మరధ్వనిన్ విందు నేను.**
**నా రాక యొక దైవీతరంగమని యెఱుగుదు.**

మృత్యువుసైతం కొద్దిసేపు అవాక్కయింది ఒక కేవల మర్త్యజీవి ప్రదర్శించిన అంతటి అభేద్యసంకల్పాన్ని ఎందుర్కొన్నప్పుడు. అదేమీ ఆశ్చర్యకరం కాదు. కాని మర్త్యమైనది శరీరమే. ఆ శరీరంలో నివసించే దివ్యుడు దాన్ని అమర్త్యం చేస్తాడు. ఆ ఆత్మ బాణాలకు తెగదు, అగ్నికి దహనమూ కాదు! సావిత్రి వానితో సర్వాంతర్యామియై మానవుడు మానవజాతిని ప్రేమించటానికి కారణభూతుడైన ఆ పరమాత్మయే నిజానికి "మరణావగుంఠనం" (veiled by death)తో ఇక్కడకు వచ్చినాడు. మానవుడు ఓడిపోలేదు, మరణాన్ని కేవలం మేలి ముసుగుగా ధరించినాడు. ఆ పరమాత్మ మానవునకు మరణాన్ని జయించటానికి మేధస్సును, హృదయాన్నీ బహుమతులుగా ఇచ్చినాడు. అవును, ఈ రెండూ అవసరమే : విజ్ఞానమూ, ప్రేమా అన్నవి మరణం అనబడే, భూమీ సంతతికి ఊపిరాడకుండా చేసే, ఈ దుఃస్వప్నాన్ని నిర్మూలించటానికి అవసరమే.

మృత్యువు తన స్థానం అభేద్యమనుకుంటుంది. ఆతడు ఆమె మాటలు ఒక బాలిక మాట్లాడే అమాయకపు మాటలు అని భావించి మౌనంగా ఉండిపోతుంది. శ్రీ అరవిందులు ఒక కావ్యభాగంలో రుద్రాంశను చక్కగా భావిస్తారు :

He stood in silence and in darkness wrapped,
A figure motionless, a shadow vague,
Girt with the terrors of his secret sword.
Half-seen in clouds appeared a sombre face;
Night's dusk tiara was his matted hair,
The ashes of the pyre his forehead's sign.

**ఆతడు మౌనముగా అంధకారాచ్ఛాదితుడై నిల్చె,**
**ఒక నిశ్చల చిత్రము, ఒక అస్పష్టచ్ఛాయ,**
**తన రహస్యఖడ్గభయాలతో పరివృతుడై.**
**ఒక మలినప్రభాయుతముఖంబు**

**మేఘాలలో సగము కన్పించె;**
**వాని జటాజూటము నిశాంధకారమకుటంబు,**
**చితాభస్మంబు వాని ఫాలంపు చిహ్నము.**

కాని ఆ మూర్తిని చూచి సావిత్రి భయపడదు. సత్యవంతుని యందు తనకున్న ఉత్తమ ప్రేమ ఆయుధంగా, ఆమె "తన్మూకనిరాశావిస్తారములలో" (through the dumb unhoping vasts) వారి ననుసరించసాగింది.

❊ ❊ ❊

## 10వ కాండ - సంధ్యాద్వయకాండ

## 1వ సర్గ - ఆదర్శస్వప్నసంధ్య

శ్రీ అరవిందులు భావించిన మృత్యువు అజ్ఞానభ్రాంతినాశకుడైన అచేతన దేవత, అని ఇప్పుడు స్పష్టమయింది. వాని సావిత్రి సర్వోత్తమ, సర్వాతిరిక్త దివ్యత్వమూర్తిగా పరిణామం చెందిన మానుషప్రాణి. వారి మొదటి దశ పోరాటం అనిశ్చిత ఫలితంగా ముగిసింది. మృత్యువు సావిత్రిని భయపెట్టి భూమికి మరలించలేకపోయింది; సత్యవంతుని ప్రాణాన్ని సావిత్రి వెనుకకు తీసికొనలేకపోయింది.

రాత్రి ఒక సంధ్యాసమయానికి తావివ్వటం అన్న శ్రీ అరవిందుల భావానికి ఆధారమేమిటి? ప్రకృతియొక్క వివిధ ముఖాలు రాత్రి, పగలు, ఉదయ సంధ్య, సాయం సంధ్య అని వేదం అంటుంది. శ్రీ అరవిందుల ఉద్దేశం ప్రకారం "వేదంలో కేంద్రీయ భావం, అజ్ఞానాంధకారం నుండి సత్యం గెలవటం, సత్యం గెలుపుతో అమరత్వం గెలవటం, అన్నది." అయితే ఈ విజయం కఠోరమైనప్పటికీ స్థిరంగా సాగేది. ప్రకృతి కార్యదక్షత అట్లాంటిది. ప్రకృతిని తీవ్రంగా అస్థిరం చెయ్యటం వలన దుష్టశక్తులకే లాభం కలుగుతుంది. లంక నుండి హనుమంతుడు తనను రాముని చెంతకు తీసికొని వెళ్ళేందుకు ఈ కారణం గానే సీత అంగీకరించలేదు. ఒక తటిత్తు వలె చేసివేసే పనియైతే, ఆ విజయానికి లాభమేమిటి? ఒక చీకటి కార్యంతో మరియొక చీకటి కార్యాన్ని సాధించటమే కదా? దొంగతనంగా పరుగెత్తిపోతే, అది విజయమవుతుందా? రాముడు సైన్యంతో రావాలి, యుద్ధం చేసి గెలవాలి. ఎందుకంటే అజ్ఞానాంధకారం దుర్జేయమైనది. అంధకారం జిత్తులమారిది. దాని ప్రణాళిక తెలియదు. సావిత్రి నిరంతర అంధకారంలోనూ, ఇప్పుడు సంధ్యాద్వయం లోనూ ప్రయాణం సాగించటం వెనుక గల తర్కం ఇది.

ఈ సర్గ మొదట సావిత్రి, మృత్యువు, సత్యవంతుని ఆత్మ "ఒక శూన్యగృహం" (house of void) లో, శూన్యత్వప్రపంచంలో, ప్రయాణించటం చూస్తాము. శ్రీ అరవిందుల ఆంగ్లం సునాయాసంగా చీకటి నుండి గాఢతర తమస్సు వైపుకు కదలటాన్ని వర్ణిస్తుంది:

*In this black dream which was a house of Void,*
*A walk to Nowhere in a land of Nought,*
*Ever they drifted without aim or goal;*
*Gloom led to worse gloom, depth to an emptier depth,*
*In some positive Non-being's purposeless Vast*
*Through formless wastes dumb and unknowable.*

**శూన్యగృహమైన ఈ తమః స్వప్నంలో,**
**శూన్యసీమలో ఎటకూ కాని గమనంలో,**
**ఏ లక్ష్యమూ, గమ్యమూ లేక వారు చరించిరి;**
**అంధకారము గాఢాంధకారమునకు,**
**అగాధము శూన్యతరాగాధమునకు చేర్చి**
**ఏదేని ఒక అసందిగ్ధ నాస్తిక్యవ్యర్థవిస్తారములో**
**మూకాజ్ఞేయ నిరాకారవ్యర్థముల గడచుచు.**

ఇది భ్రాంతియుతమైన మాయయా? లేక భ్రాంతి కాని విష్ణుమాయయా "పరమాత్ముని మేలి ముసుగు?" అదే అయియుండాలి. నిశ్చలంగా నిద్రితమై ఉన్నప్పుడు అతిచేతన ఇట్లాగే ఉంటుంది. అట్లాగైతే, మరణం అంతం కాదు; అది ఒక "కుంఠన విక్రమము" (stumbling stride). ఒక జన్మ నుండి వేరొక జన్మకు కదలటానికిది అవసరం. సావిత్రికి గల మహద్విశ్వాసం "సువర్ణాగ్ని" (a golden flame) వలె రాత్రినీ శూన్యాన్నీ నిరాకరించిన తరువాత, ఆమె చుట్టూ ఉన్న చీకటి క్రమంగా తిరోధానం అవుతుంది. జ్ఞానోదయానికి శత్రువులైనవారు పారిపోతారు. శ్రీ అరవిందుల సంధ్యావర్ణనం అద్భుతం:

There is a morning of twilight of the gods;
Miraculous from Sleep their forms arise
And God's long nights are justified by dawn.
There breaks a passion and splendour of new birth
And hue-winged visions stray across the lids,
Heaven's chanting heralds waken dim-eyed space.

**దేవతలదైన ఉదయసంధ్య కలదొకండు;**
**నిద్రనుండి వారి అద్భుతాకారంబు లుదయించు**
**దేవుని దీర్ఘరాత్రుల నుదయంబు సమర్థించు.**
**నవజన్మభావోద్వేగ వైభవంబులుద్భవించు**
**కనుఱెప్పలదాటి వర్ణవీక్షాన్విత దర్శనంబు వెడలు,**
**స్వర్గాయకవైతాళికుల్ మసక కన్నుల సీమను మేలుకొల్పు.**

ఇది సావిత్రి స్వాగతించదగిన పెద్దమార్పు, ఎందుకంటే, ఆమె దిశారహితమైన అంధకారపథములతో పోరాడుతూన్నది. ఇప్పుడొక స్థిరమైన మార్పున్నది. ఆమె "ఒక అంధానందము వలన అబ్బురపడెను" (surprised by a blind joy). ఇష్టపూర్వకంగా ఆమె ఈ ప్రపంచంలో అలా అలా తేలిపోవటానికి సిద్ధమవుతుంది. ఈ ప్రపంచం, వ్యక్తి

ఆశలతో నిదానంగా దాగుడుమూతలాడుకొనే వేదభూమి ప్రభలను గుర్తుచేస్తుంది.

*A ripple of gleaming wings crossed the far sky;*
*Birds like pale - bosomed imaginations flew*
*With low disturbing voices of desire,*
*And half - heard lowings drew the listening ear,*
*As if the Sun-god's brilliant kine were there*
*Hidden in mist and passing towards the sun.*

**కాంతిమత్పక్షతరంగ మొకటి గగనంబు నాక్రమించె;**
**వివర్ణహృదయకల్పనలవోలె విహంగమములెగిరె**
**అనుచ్చాకులీకరకంఠస్వరాల కామ్యముతో,**
**అర్ధశ్రుతహంభారవములతో ఆకర్ణత్కర్ణమున్ సావధానపరచె,**
**సూర్యదేవుని కాంతిమద్గోగణంబట తుషారగుప్తంబులై**
**సూర్యుని దిక్కుగా సాగుచున్నవో యనన్.**

కాని సావిత్రి ముందుకు సాగుచుండగా, వాతావరణము స్పష్టతరమై ఆమె విశ్వాసము దృఢతరమవుతుంది. ఆసక్తికరంగా, మృత్యువక్కడ ఉండటం వలననే, ఆతని విపర్యస్త దేహకాంతి వలన, ఉన్న కాంతి మరింతగా కాంతి మత్తరమైనట్లు, ఆమె నిలువటానికి సహకరించింది :

*In this beauty as of mind made visible,*
*Dressed in its rays of wonder Satyavan*
*Before her seemed the centre of its charm,*
*Head of her loveliness of longing dreams*
*And captain of the fancies of her soul.*
*Even the dreadful majesty of Death's face*
*And its sombre sadness could not darken nor sky*
*The intangible lustre of those fleeting skies.*

**మనస్సు దృశ్యమానమైనట్లున్న ఈ సౌందర్యములో,**
**తదాశ్చర్యకాంతుల వలిపెంబు దాల్చి ఆమె ముంగిట**
**సత్యవంతుడు తదాకర్షణకేంద్రకమై తోచె,**
**ఆమె కామ్యస్వప్నసౌకుమార్యమునకు శీర్షమై**
**ఆమెదౌ ఆత్మభావనలకు దండనాయకుడై.**
**మృత్యుముఖభీకర రాజశ్రీ సైతము**

**తన్మలినప్రభాయితవిషాదముసైత మా స్రవద్గగనంబుల**
**దురాలభకాంతిని తామసితమో వినష్టమో చేయలేకుండె.**

సంపూర్ణ విశ్వాస శరణాగతుల వికాసము అటువంటిది కనుకే త్యాగరాజు, కపటమౌ మాటలేల కమ్మనైనది!, అంటాడు. విశ్వాస ప్రకాశం ఎంతటిదంటే, బాధ కూడా ఇప్పుడు "ఆనందపు కంపమాన ఉపశ్రుతి" (a trembling undertone of bliss). అదెట్లాగైన, సావిత్రి ఈ సంతోషంలో మైమరచిపోలేదు, ఆమె ఆత్మ క్రియాశూన్యం కాలేదు. ఆమె సత్త దాన్ని భరిస్తుంది, అధిగమిస్తుంది, మృత్యువు నెదుర్కొనటానికి ధైర్యంగా సాగుతుంది. ఎందుకంటే, సత్యవంతుని ప్రాణిప్రపంచానికి తిరిగి తీసుకు వెళ్ళటమే ఆమె లక్ష్యం :

*Above, her spirit in its mighty trance*
*Saw all, but lived for its transcendent task,*
*Immutable like a fixed eternal star.*

**ఆమె సత్త తచ్ఛక్తిమత్తన్మయావస్థలో, పై నుండి**
**సర్వముంజూచె, కాని తన సర్వోత్తమ కర్తవ్యముకై జీవించె,**
**నిత్యధ్రువతారవోలె అపరివర్త్యమై.**

* * *

## 2వ సర్గ – మృత్యుసువార్త – ఆదర్శనిస్సారత

సత్యవంతుని పునర్జీవితుని చేయాలన్న విషయంలో మృత్యువును వెంబడించాలని సావిత్రి ఏకమనస్కగా ఉండగా, మృత్యువు వారు ప్రయాణిస్తూన్న సంధ్యాప్రదేశం సాధనంగా ఆమెను గందరగోళంలో పడవేయాలని ప్రయత్నిస్తాడు. చూడు, ఇది భూమీమ్మీది జీవితానికి ప్రతిబింబం కదా? స్వప్నాలు, స్వాప్నిక జీవనం, అంతా ఒక కాల్పనిక విందుభోజనం, మరేం లేదు! ఆదర్శాలు, ప్రేమ, అమరత్వం, గురించి మాట్లాడటం వ్యర్థం. ఎందుకంటే, ఇవన్నీ కేవలం కల్పితాలు.

*This angel in thy body thou callst love,*
*Who shapes his wings from thy emotion's hues,*
*In a ferment of thy body has been born*
*And with the body that housed it it must die.*
*It is a passion of thy yearning cells,*
*It is flesh that calls to flesh to serve its lust;*

*It is thy mind that seeks an answering mind*
*And dreams awhile that it has found its mate;*
*It is thy life that asks a human prop*
*To uphold its weakness lonely in the world*
*Or feeds its hunger on another's life.*

**నీవు ప్రేమయని పిల్చు ఈ దేవదూత నీ శరీరమున**
**నీ భావావేశపు రంగులలో తన తెక్కల రూపుదిద్దు,**
**నీ శరీరపు ఒకానొక తాపాన పుట్టువందు,**
**తనకాశ్రయమైన కాయంబుతో దాను భ్రమందు.**
**నీ కామయమాన జీవాణుభావవికార మది,**
**మాంసము మాంసముం బిల్చు తన కామపూర్తికై;**
**నీ మనస్సొక స్పందించు మనస్సు నన్వేషించి,**
**తన సఖిన్ సఖుని గంటినని కించిత్కాలము కలగను;**
**అది నీ జీవము వేరొక మానుషాశ్రయముగోరు**
**తన దైర్బల్యము నొంటిగ లోకాన సమర్థించుకొరకు**
**కాదేని తన క్షుత్తుకు వేరొకరి జీవితమున్ మేపు.**

మృత్యువు కుతర్కాలు అనంతం. అవి, మనకు తెలిసిన వ్యక్తులు హఠాన్మరణం చెందినప్పుడు మన మనస్సులు పనిచేసే విధానాన్ని సూచిస్తాయి. అన్ని విషయాలూ నిరర్థక ప్రణాళికలుగానూ, పగటి కలలుగానూ తోస్తాయి! మాటలూ ఊహలూ, మాటలూ ఉహలూ తప్ప మరేమీ లేదు అనిపిస్తుంది! దేవుని ప్రార్థించి యేమి లాభం? అసలు దేవుడనేవాడొకడు ఉన్నాడా? ఒకవేళ దేవుడంటూ ఒక డున్నప్పటికిన్నీ, ఈ లౌకిక జీవితంలో క్షణక్షణం మారుతూ ఉండే కాలానికి కట్టుబడిన మానవుడు దేవునికి సమర్పించదగిన ఉత్తమోత్తమమైన, దేవుడు నివసింపదగిన స్థానం లేనే లేదు. అతి సామాన్య మానవుని ఆస్థకు మించిన ఉన్నతిగల దివ్యవ్యక్తుల రూపంలో, అవతారాల రూపంలో దేవుడు దిగి వచ్చినాడనటం హేతుబద్ధం కాదు. పోనీ, వారు లోకంలో ఒక శాశ్వత నివాసాన్ని పొందగలిగినారా? లేదే! ఎందుకంటే, లౌకిక మానవుడు అటువంటి వారి నందరినీ కాలక్రమేణ నిరాకరించినాడు :

*The Avatars have lived and died in vain,*
*Vain was the sage's thought, the prophet's voice;*
*In vain is seen the shining upward Way*
*Earth lies unchanged beneath the circling sun;*

She loves her fall and no omnipotence
Her mortal imperfections can erase,
Force on man's crooked ignorance Heaven's straight line
or colonise a world of death with gods.

**అవతారాలు నిరర్థకంగా జీవించి నశించినవి,**
**ఆర్షభావాలు, ప్రవక్తల వాణి, నిరర్థకాలు;**
**ప్రకాశమానోర్ధ్వపథము గాంచుట వ్యర్థము.**
**వర్తుల భ్రమితసూర్యాధోదేశాన భూమి మారకయుండు;**
**తన పతనముం దా ప్రేమించు, సర్వశక్తిమంతుడెవ్వడున్**
**లేడు తన మర్త్యదోషాల నివారింపగలవాడు,**
**మానుషవక్రాజ్ఞానముపై స్వర్లోకసారళ్యముంచగా,**
**లేక, మృత్యులోకమున్ దేవతావాసమొనరింపగా.**

మానవుడు మారడు, మార్పుకు అవసరమైన సంకల్పశక్తి వానికి లేదు. ఇక సత్యవంతుని పట్ల సావిత్రి ప్రేమ విషయానికి వస్తే, ఆ ప్రేమతో ఆమె సత్యవంతుని పునర్జీవితుని చేయాలని ప్రయత్నిస్తూంది కదా, ఈ ప్రేమ అమరమా? భౌతిక లాలసామాత్రమే అయినదానిని ఆమె అనివార్యమూ దివ్యమూ అనుకొనే తప్పు చేయటం లేదుకదా? శారీరకంగా కలిసి ఉండటం అందంగానే, ఆనందంగానే ఉంటుంది. సందేహం లేదు, ఇదంతా యౌవనంలో కదా. మరి ఇదే ప్రేమ సావిత్రికి సత్యవంతుడు వృద్ధుడైన సమయంలో కూడా ఉంటుందా? ఆమెలో కూడా ఈ భావావేశం అచిరకాలంలోనే చల్లారి పోతుంది, బూది మిగులుతుంది. ఇది కాల స్వభావం, దేనికీ వంగదు, లొంగదు. చూడగానే తిరుగులేని తర్కంగా తోచే విధంగా మృత్యువు అంటుంది, సావిత్రికి సంబంధించినంతవరకు, సత్యవంతుడు జీవించి ఉంటే, వాని పట్ల తన ప్రేమ నశించిపోయేది, అని. కనుక, సత్యవంతుని మరణం గురించి దుఃఖం ఎందుకు? కనీసం ఇప్పుడు సత్యవంతునియందామెకుగల ప్రేమ కొంతకాలం కొనసాగుతుంది, ఆ తరువాత అచిరకాలంలో ఇతరులపై ప్రేమ, ఇతర భావావేశాలూ ఆ స్థానాన్ని ఆక్రమిస్తాయి. అప్పుడామెకు అర్థమవుతుంది, చిరవైవాహికజీవితం, సత్యవంతుని కలిసి ఉండటం అన్నది అర్థరహితమైన శూన్యంలోకి సాహసయాత్ర, అని. కాలం ప్రేమను చంపివేస్తుంది :

Where once the seed of oneness had been cast
Into a semblance of spiritual ground
By a divine adventure of heavenly powers
Two strive, constant associates without joy,

*Two egos straining in a single leash,*
*Two minds divided by their jarring thoughts,*
*Two spirits disjoined, for ever separate.*
*Thus is the ideal falsified in man's world;*
*Trivial or sombre, disillusion comes,*
*Life's harsh reality stares at the soul.*

**ఏకతాబీజమెచ్చోట నొకనాడు నాటినారో**
**స్వర్లోక శక్తులొక దివ్యసాహసకృత్యమై**
**అధ్యాత్మక్షేత్రముం బోలునచ్చోట**
**సుస్థిరానంద రాహిత్య సంగతి స్పర్ధవహింత్రు,**
**చర్మైకబంధాన అహంకృతిద్వయముద్యమించి,**
**పరస్పర విరుద్ధ భావవిభక్తులై మనః ద్వయంబు,**
**విభిన్నసత్తా ద్వయంబు సదా పృథక్‌భావులై.**
**మానుషలోకాన నాదర్శమిట్లు మిథ్యాభూతమౌ;**
**స్వల్ప లేదా మలినప్రభమై, నిరస్తమోహమాగమించు,**
**జీవితపు కఠోరవాస్తవికత ఆత్మను మిట్టి చూచు.**

కాబట్టి మృత్యువు సావిత్రీ సత్యవంతులకు, అతని ప్రాణాన్ని హరించటం ద్వారా ఈ మూఢభూత చిత్రం నుండి ఈ విధంగా రక్షించి, ఉపకారం చేసిందన్నమాట! ఎంత ఔదార్యం! ఎంత అనుగ్రహం! సావిత్రి సమాధానం బలంగా మృత్యువు వాదాన్ని ఒక్క దెబ్బతో పేకముక్కలను పడగొట్టినట్లు కూల్చివేసింది.

*But I forbid thy voice to slay my soul.*
*My love is not a hunger of the heart,*
*My love is not a craving of the flesh;*
*It came to me from God, to God returns.*

**కాని నీ వాణి నా యాత్మఖండించుటొప్పబోను.**
**నా ప్రేమ హృదయైక క్షుత్తనగరాదు,**
**నా ప్రేమ మాంసప్రకోపమనగరాదు;**
**దైవదత్తమది నాకు, దైవమునకె సమర్పణంబు.**

సావిత్రి సమాధానం సూటిగా, ఏకాగ్రంగా ఉన్నది. ఆదర్శప్రేమ ఈ లోకంలో అసాధ్యం అనటం మోసపూరితమైన తర్కం. మరి, బృందావన గోపికల సంగతేమిటి? కృష్ణుడు భూలోకానికి వస్తూనే ఉంటాడు. ఆదర్శప్రేమను మరల మరల సాధ్యం చేస్తూనే

ఉంటాడు. సావిత్రికి సంబంధించినంతవరకు, కృష్ణుడు సత్యవంతుని రూపంలో వచ్చినాడు. మృత్యువు ఈ వాదాన్ని అంగీకరించక, ఆత్మవంటి భావాలకు మూలం మనస్సేనంటుంది. ఆత్మవంచన తప్ప మరేమీ కాదు! భూమ్మీద సృష్టి సమస్తం భూమిని చేరి ఖండఖండాలు కావలసినదే, మట్టిలో కలిసిపోవలసినదే. ఎందుకంటే, తాను మృత్యువు, నాశకుడు. ఈ సర్గనతడు కఠోరసమాప్తికి చేరుస్తాడు. నరకప్రాయపు మూర్ఖత్వ చిత్రం వలె బొమముడిపాటును కలిగిస్తూ :

**కాదు, నీవైన సమస్తమున్, నీ చేతలు ఒక కల కాదా?**
**నీ మనస్సును జీవితమున్ పదార్థశక్తివౌ లీలలు.**

※ ※ ※

## 3వ సర్గ - ప్రేమ మృత్యువుల సంవాదం

ఒకవేళ మృత్యువు తాను తిరుగులేని ప్రకటన చేసినట్లు ఆశిస్తే, అది తప్పని త్వరలోనే ఋజువయింది. ఈ సర్గారంభంలో సావిత్రి అతనికి పరిణామాన్ని గురించి ఒక సరళమైన పాఠం చెప్పదలచింది. జీవి అన్నది తాత్కాలికం, క్షీణత మరణం అన్నవి అనివార్యాలు. కాని, తిరస్కరించ వీలుకాని ఒక బలమైన పరిణామ చైతన్యం ఊర్ధ్వదిశగా కూడా ఉన్నది. ఇది కూడా చేతనాసాహసమే, తక్కువేమీ కాదు. ఒక మహా శూన్యం ఉన్నచోట, ఒక సత్త ఉనికిని సంపాదించి సహస్రశః వికసించింది. ఈ సృష్టిని పరిశీలించిన తరువాత, అది శూన్యం నుండి పుట్టిందని ఎట్లా అనగలం? ఈ 'ఏమీ కానిదాని'లో ఉన్న 'ఏదో అయినది' ఏమిటి? ఆ 'ఏదో అయినది' సృజనాత్మక శక్తియై ఉన్నట్లయితే, అదే వృద్ధిగా క్రియాశీలకమైనదైతే, ఇంత కంటె మహత్తరమైన ఒక భవిష్యత్తును కూడా మనం ఆశించకూడదా? సావిత్రి వాదం, న్యాయస్థానంలో ఒక న్యాయవాది వాదించేటంత పదునుగానూ సాగుతుంది :

Now through Mind's windows stares the demigod
Hidden behind the curtains of man's soul:
He has seen the Unknown, looked on Truth's veilless face;
A ray has touched him from the eternal sun;
Motionless, voiceless in foreseeing depths,
He stands awake in supernature's light
And sees a glory of arisen wings
And sees the vast descending might of God.

**మనోగవాక్షముల ద్వారా ఇప్పుడు ఈ దేవయోని చూచు**
**మానుషాత్మయవనికాభ్యంతరమున దాగి :**
**ఆతదజ్ఞాతముంజూచె, అనాచ్ఛాదిత సత్యంపు ముఖముజూచె;**
**నిత్యుడౌ సూర్యుని కాంతి కిరణమొకటి వాని దాకె;**
**అగాధముల ముందుగా భావించుటలో**
**నిశ్చలముగా నవాక్కుగా నుండి,**
**ఊర్ధ్వప్రకృతి కాంతిలో నిర్నిద్రుడై నిల్చి,**
**విప్పారిన ఱెక్కల వైభవము జూచు,**
**చూచు నవతరదృగవచ్ఛక్తి విస్తారమున్.**

విషయం ఇంత స్పష్టంగా ఉంటే, మృత్యువట్లా మాట్లాడటం ఎందుకు? అదెందుకంటే, తాను చూస్తూన్న సృష్టి ఇంకా అసంపూర్ణమైనది కనుక. పరిణామావర్తి ఇంకా ఊర్ధ్వముఖంగా సాగుతూనే ఉన్నది. అతి పెద్ద మఱ్ఱి చెట్టు ఒక అతి చిన్న విత్తనం నుండి కదా ఉద్భవించింది! కాలం కొంత పట్టవచ్చు, కాని "అత్యల్ప వీర్యకణములోని అత్యల్ప మూలకము" (little element in a little sperm) అలెగ్జాండరంతటి విజేతయో, వ్యాసునంతటి మహర్షియో కాలక్రమాన అయితీరుతాడు. దేవుడున్నాడని ఋజువు చూపమనటం ఎంత బాల్యచేష్ట? ప్రకృతి ఉనికి పురుషుని ఉనికి వెనుక ఉన్నదనటానికి చాలు :

*A glory is the gold and glimmering moon,*
*A glory is his dream of purpose sky.*
*A march of his greatness are the wheeling stars.*
*His laughter of beauty breaks out in green trees,*
*His moments of beauty triumph in a flower;*
*The blue sea's chant, the rivulet's wandering voice*
*Are murmurs falling from the Eternal's harp.*
*This world is God fulfilled in outwardness.*

**స్వర్ణప్రకాశచంద్రికాచంద్రుడొక వైభవము,**
**తన్నీలలోహిత వర్ణాకాశస్వప్నమొక వైభవము.**
**చక్రభ్రమత్తారకల్ తన్మహత్త్వాప్రస్థానమౌ.**
**పచ్చని చెట్లలో వాని సౌందర్యహాసము ధ్వనించు**
**తత్సుందరక్షణముల్ కుసుమంబున జేతలౌ;**
**నీలసముద్రఘోష, పరిభ్రమన్నద వాణియు**

**ఆ శాశ్వతుని వీణా మర్మరధ్వని స్రవంతి.**
**ఈ ప్రపంచమనగా ఫలవదీశ్వర బాహ్యాకృతి.**

క్యాథలిక్ కవి గెరార్డ్ మ్యాన్‌లె హోప్‌కిన్స్ రచించిన ప్రఖ్యాతమైన ఈ పద్యపంక్తి గుర్తొస్తుంది : "ప్రపంచం భగవద్వైభవంతో చైతన్యవంతమై ఉన్నది." (The world is charged with the grandeur of God) ఈ కాంతివంతమైన సృష్టిలో నల్లని మచ్చలున్నాయన్న విషయాన్ని సావిత్రి నిరాకరించదు. కాంతి పరిక్రమణాన్ని చీకటి శక్తులు అడ్డగించటం సత్యం. మంచి చెడులకు మధ్య నిరంతరం యుద్ధం ఉన్నది, ప్రేమ ద్వేషాల మధ్య, జీవన్మరణాల మధ్య కూడ. కంసాలి దాగరిమీద యేదైనా మంచి ఉన్నప్పుడు, ద్వేషపూరిత శక్తులు వెంటనే దానిని దారి మళ్ళిస్తాయి. భగవంతుని గూర్చిన ప్రేమభావన చూడండి! అద్భుతమైన తంత్రపద్ధతికి చెడ్డపేరు తెచ్చే వామాచార పద్ధతులందులో వచ్చి చేరినవి. అయినప్పటికి, మనస్సుకంటె ఉన్నతతరస్థరాల దిశగా ఉన్న మూలశక్తి నష్టం కాలేదు.

*A secret air of pure felicity*
*Deep like a sapphire heaven spirits breathe;*
*Our hearts and bodies feel its obscure call,*
*Our senses grope for it and touch and lose.*
*If this withdrew, the world would sink in the Void;*
*If this were not, nothing could move or live.*
*A hidden Bliss is at the root of things.*

**స్వచ్ఛానందరహః పవనమొకండు**
**ఇంద్రనీలాకాశగాధమున్ బోలె శ్వాసించు మా సత్తలున్;**
**మా హృదయంబుల్ దేహముల్ తదూరాహ్వానము నెఱుంగు,**
**మా ఇంద్రియముల్ వెదుకాడి దానిం దాకు, కోల్పోవు.**
**తన్నిష్క్రమణాన జగంబు శూన్యమున గ్రుంగు;**
**తద్రాహిత్యంబున చలించదు, జీవించ దేదియున్.**
**గుప్తానంద మొకండు కల్గు సర్వవస్తుమూలంబునన్.**

ఈ ప్రచోదనము ఆనందము, అదే పరమాత్మ స్వభావము. సృష్టించేది, మహత్తరోదయం కోసం ఆశించేది, భూతలస్వర్గంకోసం ఆశించేది, ఆ ఆనందమే. ఈ ఆంతరంగికానందమే మృత్యువిజయాన్ని నిరాకరిస్తుంది. మరణమా! గర్వించకు! ఆమె, సత్యవంతుడున్నూ తమ ప్రేమశక్తితో ఈ భూమిని స్వర్గంగా మార్చటానికి వచ్చినవారు.

*For love is the bright link twist earth and heaven,*
*Love is the far transcendent's angel here;*
*Love is man's lien on the Absolute.*

**ఏలన, ప్రేమ భూమ్యాకాశముల మధ్య కాంతిమత్సంధ్య,**
**ప్రేమ ఇహమున దూరస్థసర్వాతిశాయి దూత;**
**ప్రేమ పరమాత్మపై మానవుని స్వత్వమగును.**

అదియొక ప్రభావశాలియైన కావ్యఖండం, నిడివి ఎక్కువే కాని ప్రతిపంక్తిలోనూ సాధకునికి బలవర్ధకమైనది. అదెట్లాగైనా, ఇంతమాత్రాన మృత్యువు ఓటమిని అంగీకరించేందుకు సిద్ధంగా లేదు. మరొక్కసారి మృత్యువు సావిత్రిని నిందిస్తుంది, భవిష్యత్తును గురించి ఒక ఊహాప్రపంచాన్ని నిర్మించినందుకు. ఇదంతా అర్థరహితమైన గూఢారాధన! ఎంత చెప్పినా మానవుడు మానుషమైనవాడే, మృత్యువుకూ జీర్ణత్వానికీ లొంగవలసిందే. సావిత్రి కూడా అంతే. ఆమె మర్త్యమాత్రురాలే. కాని ఆమె ఆ వాదానికి ఝటితి స్పందిస్తుంది :

*Yes, I am human. Yet shall man by me*
*Since in humanity waits his hour the God,*
*Trample thee down to reach the immortal heights,*
*Transcending grief and pain and fate and death.*

**అవును, మానుష నేను. ఐన నా మూలమున,**
**దైవము మానవతలోన నిరీక్షించు గాన కాలపరిపాకమునకై,**
**అమర్త్యోన్నతులందుటకై నిన్ కాలఱాచు,**
**దుఃఖబాధల, విధి మరణాల నధిగమించు.**

మానవుడు పదార్థనిర్మాణమనీ, పదార్థము క్షరమనీ, ఎన్నటికీ సత్తతో సమానం కాలేదనీ, మృత్యువు అరచి చెబుతుంది. మృత్యువుకంటె తన హృదయం బలమైనదని సావిత్రి అనగా, ఆతడు ఈ సవాలు చేస్తాడు : "నీ బలము చూపు..." కాని వానికిపుడు స్పష్టమవుతుంది, ఆమె బలంగా ప్రారంభాన్ని సుముఖం చేసుకున్నదని. ఎందుకంటే, వారు ముందుకు ఆ సంధ్యాసీమలో సాగుతూండగా, ఆమె ఇప్పుడు నాయకత్వం వహిస్తూన్నదని తెలసుకుంటాడతడు :

*All still compelled went gliding on unchanged,*
*Still was the order of these worlds reversed :*
*The mortal led, the god and spirit obeyed*

*And she behind was leader of their march*
*And they in front were followers of her will.*

**సర్వమప్పటికిన్ నిర్బంధగతి నపరివర్తితమై సాగె,**
**అప్పటికిన్ ఈ ప్రపంచక్రమము విపర్యస్తమై చనెన్ :**
**తన్మర్త్య నేతృత్వమున్ వహించె, వెంట సాగిరి దేవుడు జీవుడున్**
**వెనుక నడచుచు నామె ఆ ప్రస్థానయిక యయ్యే**
**ముందేగుచున్ వారామె సంకల్పమనుసరింప.**

* * *

## 4వ సర్గ - భౌతిక సత్యత్వ స్వప్న సంధ్య

నిత్యమూ జీవితంలో అత్యుత్తమమైనవి ఉగ్రవాదులు, అధికారకాములూ అయినవారి వలన మృత్యువుకూ నాశనానికీ గురియవుతూండటం తెలిసిన మానవులం కనుక మృత్యుదేవత వాదాన్ని అర్థం చేసికొనటం మనకేమంత కష్టం కాదు. కాని మచ్చలేని సావిత్రి విశ్వాసదీప్తి, సంకల్పశక్తి మాత్రం మనల్ని వివశుల్ని చేస్తుంది. మృత్యుదేవత, మనం జీవితంలో యథార్థంగా భావించేదంతా సృష్టిలోని ఆదర్శంగా మనం ఊహించుకునే దాని ఛాయ మాత్రమే, అని వాదించింది. అయినప్పటికి, సత్యవంతునితో సహా ప్రాణిలోకానికి తిరిగి వెళ్ళాలన్న సావిత్రి దృఢనిశ్చయాన్ని చెదరగొట్టటం వానికి సాధ్యం కాలేదు.

జీవితం "ఆదర్శసంధ్య" అన్న విషయాన్ని సావిత్రి అంగీకరించనట్లయితే, మృత్యుదేవత ఇప్పుడు "యాథార్థ్యసంధ్య"ను గురించి మాట్లాడ నారంభించినాడు. అధోముఖంగా వారు సాగుతూంటే, వాతావరణమంతా నిరాశావైఫల్యవ్యాఘాతాలతో నిండి ఉన్నది, చర్వితచర్వణం వంటి నిరర్థక సాఫల్యాల నైరాశ్యం నిండి ఉన్నది. ఈ పరిస్థితి ఆధారంగా సావిత్రి నిబ్బరాన్ని దెబ్బతీయవలెనని మృత్యుదేవత ప్రయత్నిస్తుంది. ఎందుకంటే, ఆమె భూమిపై దివ్యజీవితాన్ని కోరుకుంటూన్నది :

*Forgetting love, forgetting Satyavan,*
*Annul thyself in his immobile peace.*
*O soul, drown in his still beatitude.*
*For thou must die to thyself to reach God's heights:*
*I, Death, am the gate of immortality.*

**ప్రేమను మరచి, సత్యవంతుని మరచి,**
**నిను నీవు వాని నిశ్చల శాంతిలో నిరస్తమొనర్చుకొనుము.**
**ఓ ఆత్మా, వాని నిశ్చలనిఃశ్రేయసమున మున్గుము.**
**ఏలన, దైవోన్నతిం జేరగా నీకొరకే**
**మరణించక తప్పదీవు :**
**మృత్యువున్నేను, అమర్త్యత్వద్వారమేను.**

దేవుడు సృష్టించిన ఈ ప్రపంచము "తప్పుగా పలుకబడి, తప్పుగా వ్రాయబడిన ఒక భాష" (a language mispronounced and misspelt) అయి యుండవచ్చునని సావిత్రి మృత్యుదేవతతో అంటుంది. అయినప్పటికి, దాని సత్యత్వాన్ని ఎవ్వరూ కాదనలేరు. అది మిథ్య కాదు. ఓర్పుతో ఆమె, మృత్యువుకూడా దేవుని ఉనికిని నిరాకరించలేదనీ, ఎందుకంటే, పరిణామ నిర్మితియొక్క వాస్తవికత అందరికీ అవగతమయ్యేదేననీ, మృత్యువుకు వివరిస్తుంది. సృష్టి ఇంత దూరం ప్రయాణించిందంటే, అది ఇంకా ముందుకు సాగి మరణాన్ని కూడా జయించకుండా ఆపగలిగినదెవరు?

*If in the meaningless Void creation rose,*
*If from a bodiless Force Matter was born,*
*If Life could climb in the unconscious tree,*
*Its green delight break into emerald leaves*
*And its laughter of beauty blossom in the flower,*
*If sense could wake in tissue, nerve and cell*
*And thought seize the grey matter of the brain,*
*And soul peep from its secrecy through the flesh,*
*How shall the nameless Light not leap on men,*
*And unknown powers emerge from Nature's sleep?*

**అర్థరహితశూన్యాన సృష్టి ఉదయించెనేని,**
**దేహరహితశక్తి నుండి ద్రవ్యము జన్మించెనేని,**
**అచేతనావృక్షమున జీవమధిరోహించెనేని,**
**తద్ధరిత హర్ష మాకుపచ్చలై వెల్లివిరిసి**
**తత్ సౌందర్యహాస మా సుమాన విరిసెనేని,**
**జాలమజ్జాకణంబులలో ఇంద్రియము మేల్కాంచెనేని,**
**మస్తిష్కధూసరద్రవ్యమును భావనబంధించెనేని,**
**తద్రహస్సీమనుండి ఆత్మ మాంసద్వారాన తొంగి చూచెనేని,**

**తన్నామరహితజ్యోతి మానవుల నావహించకుండుటెట్లు,**
**అజ్ఞాతశక్తులా ప్రకృతీనిద్ర నుండి బయల్వెడలకుండుటెట్లు?**

ఒక్క క్షణం మృత్యుదేవత నిరుత్తరుడైనాడు కాని వెంటనే తన వాదాన్ని మళ్ళీ వినిపించినాడు. మానవుడిప్పుడున్న స్థితిలో సావిత్రి శ్రమకూ త్యాగానికీ యోగ్యుడు కాడు. పరమాత్ముడు మానవజాతిపై విధించిన శాసనాన్ని ఆమె ఎందకు భంగపరచవలె? అటువంటి తిరుగుబాటు చర్య సంబంధించిన వారందరకు నాశహేతువు కాగలదు.

*Use not thy strength like the wild Titan souls!*
*Touch not the seated lines, the ancient laws,*
*Respect the calm of great established things.*

**మచ్చిక నెఱుగని రాక్షసాత్మలటు**
**వినియోగించకు నీ బలమున్!**
**ప్రాచీనధర్మాల సుప్రతిష్ఠిత సూత్రస్పర్శసేయకుమా,**
**సుస్థాపితవస్తు మహాప్రశాంతిని గౌరవించుమా.**

సావిత్రి పదునుగా, పరమాత్ముని శాసనానికి విరుద్ధంగా ఈ భంగక్రియ సాగియుంటే, పరిణామమనేది అసలుండేదే కాదు, అంటుంది. మానవుడు "అప్రాణి వస్తువుల బంధించు స్థిరత" (dull fixity that binds inanimate Things.)కు బద్ధుడు కాడు. మృత్యువు చివరియత్నం చేస్తాడు. మానవునకు అమరత్వాభిలాష ఉండవచ్చును. కాని సత్యమేమంటే, ఆతడిప్పటికీ కొంత మనోబలంగల జంతువే. "సజీవసత్యశరీరము" (living body of truth) ఎక్కడున్నది? అది సావిత్రిలో ఉన్నదా?

*Or if she dwells within thy mortal heart,*
*Show me the body of the living Truth*
*Or draw for me the outline of her face*
*That I too may obey and worship her.*
*Then will I give thee back thy Satyavan.*
*But here are only facts and steel-bound Law.*
*This truth I know that Satyavan is dead*
*And even thy sweetness cannot lure him back.*

**లేక ఆయమ నీ మర్త్యహృదయాన కొలువున్నచో,**
**తత్ సజీవసత్యశరీరముం జూపు నాకు**
**కాదేని తన్ముఖరేఖనైన చిత్రించి చూపు నాకై**

**నేనుసైతమామెను విధేయత నర్చింతు నపుడు.**
**అపుడేను నీ సత్యవంతుని మగుడ నీకిచ్చివేతు.**
**కాని ఇటనున్నవి వాస్తవముల్, అయోబద్ధ శాసనమ్ము.**
**ఏ నెఱుగుదు నీ సత్యము సత్యవంతుడు మడిసె నని,**
**నీ మాధుర్యమైన వాని మరలింప నశక్తమని.**

సావిత్రి ఈ ప్రకటనను దానికి తగినట్లే తిరస్కారభావంతో గ్రహించి మృత్యుదేవతకు, ఆతడు పరమాత్ముని ప్రకాశానికి కేవలం నల్లని నీడ అని, నమ్మబలుకుతుంది. సుదీర్ఘకావ్యఖండంలో శ్రీ అరవిందులు, విశ్వాసప్రాముఖ్యాన్నీ భూలోక దైవీకరణ నిశ్చయత్వాన్నీ, అణుశః వివరిస్తారు. మరణంసైతం (మృత్యువుసైతం) పరమాత్ముని అంశయే, ఈ సమగ్ర జ్ఞానం మృత్యువు నధిగమించే సహాయాన్ని అందిస్తుంది. మృత్యుదేవత ఒక సవాలు చేసినాడు. సావిత్రి యొక దుర్బల మర్త్య, అయినప్పటికి ఆమె, మానవుడు నవలోకాన్ని ఆవిష్కరించగల బలకోశాలను అతనిలో కలిగి ఉన్నాడని, అంటుంది. ఇదంతా మాటల గారడీయేనా, లేక ఆమె తన శక్తిని ప్రదర్శించగలదా? :

**కాని కాలమున్ మరణము జయించు శక్తి నీకేద?**

ఇంక సావిత్రి మాటాడదు. కార్యాచరణకు సమయం వచ్చింది. సాంప్రదాయికమైన చిత్రణ జోలికి బోక, శ్రీ అరవిందులు సావిత్రిని ఒక సత్యజ్యోతిప్రభగా ఒక అద్భుతమైన విశ్వరూపస్తోత్రంలో ప్రదర్శించినారు. ఆ రాజకుమారి, సత్యవంతుని యౌవనవతియైన భార్య, "అనంతత్వములోన నయ్యల్ప దేహి" (The little figure in infinity) ఇప్పుడు ఒక అవతారంగా దర్శింపబడింది.

Her forehead's span vaulted the Omniscient's gaze,
Her eyes were two stars that watched the Universe.
The power that from her being's summit reigned,
The presence chambered in lotus secrecy,
Came down and held the centre in her brow
Where the mind's Lord in his control-room sits;
There throned on concentration's native seat
He opens that third mysterious eye in man...

**తత్ఫాలవైశాల్య మా సర్వజ్ఞు దృష్టిని వల్గితమొనర్చె,**
**ఆమె నేత్రాలు విశ్వసాక్షీభూతతారాద్వయంబయ్యె.**
**ఆమె సత్తాశిఖరము నుండి పాలించు ఆ శక్తి,**

**పద్మగుప్తిలోన విశ్రమించు ఆ సన్నిధి,**
**అవతరించి తద్భ్రూకేంద్రక మధిష్ఠించె**
**ఏడ మస్తిష్కప్రభుండుపవిష్టుడౌ వశీకరకక్షలోన;**
**ఏకాగ్రతా స్వీయాసనాన అచట సింహాసనస్థుడై**
**మానవునిలోని ఆ గుప్తతృతీయనేత్రముం దెరిపించు...**

ఈ శక్తిమత్ప్రభ సమక్షంలో, నిశ్శబ్దంలో బంధింపబడిన మృత్యుదేవత తేరుకొనక మునుపే, ఆతడు మ్రింగివేయబడినాడు. తన ఓటమినంగీకరించి, ఆతడు శూన్యంలోనికి పారిపోతాడు. “అంతట సత్యవంతుడు సావిత్రియు నొంటి నిల్చిరి.” (*And Satyavan and Savitri were alone.*)

❊ ❊ ❊

## 11వ కాండ - శాశ్వతాహస్కాండ

## 1వ సర్గ - నిత్యాహ్నము : ఆత్మవరణము, పరమోత్కర్ష

"ఆనందగగనాలనుండి ఒక అద్భుత సూర్యుండు తొంగిచూచె" (A marvellous sun looked down from ecstasy's skies.) అంటూ ఈ సర్గారంభం. ఒక్కుమ్మడి అన్నిబాధలు, భగ్నాశలు, అశక్తతలు, మరణము, అన్నీ మన హృదయం నుండి పారిపోతాయి. అయినప్పటికీ, సత్యవంతుడు సావిత్రి, వీరిద్దరినీ విడదీస్తూ ఇంకా ఒక పలుచని తెర ఉన్నది. కాని ఈ మహాకార్యానికి ముగింపు ఇంకా జరుగలేదు. సత్యవంతుడు సజీవంగా నిద్రలేచి, వారిద్దరూ కలిసి భూమికి తిరిగి వెళ్ళిపోతారన్నట్లు కాదు.

ఈ సర్గలోనే శ్రీ అరవిందులు ఈ సంఘర్షణలోని అతిముఖ్యభాగాన్ని పొందుపరచినారు. వ్యక్తికి తనతో తనకు తప్పని ఒక సంఘర్షణ, చిట్టచివరి ప్రలోభాన్ని అధిగమించటం, అన్నవి ఇంకా ముందున్నవి. సావిత్రి తానొక దీప్తిమంతమైన, పవిత్రమైన, శ్రేయస్కరమైన వాతావరణంలో ఉన్నానని గ్రహిస్తుంది. శ్రీ అరవిందులు, పదార్థము-సత్త రెండున్నూ ఒక సంపూర్ణమైన సంయోగంలో ఉన్న ఆదర్శప్రపంచాన్ని వర్ణిస్తారు.

*Then on what seemed one crown of the ascent*
*Where finite and the infinite are one,*
*Immune she beheld the strong immortal's seats*
*Who live for a celestial joy and rule,*
*The middle regions of the unfading Ray.*

**ఆరోహణామకుట సదృశమైన అద్దానిపై నపుడు**
**ఎచ్చోట పరిచ్ఛేద్యాపరిచ్ఛేద్యము లొక్కటౌనో**
**అట నామె ఆముక్తయై చూచె బలవదమర్త్య స్థానములను,**
**వారొక దివ్యానందముకై జీవించు**
**అయ్యక్షీణకిరణుని మధ్యస్థసీమల నేలువారు.**

ఈ ప్రపంచం ఎంత సంపూర్ణదివ్యత్వంతో ఉన్నదంటే, తనకు ప్రతిద్వంద్విగా ఉన్న మృత్యుదేవత కూడా ఇప్పుడొక "రహోవైభవం" (a secret splendour) గా రూపాంతరం చెందినాడు. ఈ "నామరహితనామంపు గుప్తి" (mystery of a nameless Name) ఒక చతుర్ముఖ సత్తగా, విరాట్ (శిల్పి), హిరణ్యగర్భుడు (చింతకుడు), చైతన్య ఘనుడు (స్రష్ట), ఆనందము (సర్వశక్తిమచ్ఛాంతి), అనువానిగా గుర్తింపబడినాడు. ఈ ప్రస్తుత రూపాంతరంలో మృత్యుదేవత సావిత్రి దృష్టి కెక్కినపుడు "ఆత్మ ఆత్మను జూచె సమానత్వమున, సదవగాహనన్" (Soul sees soul in equality and understanding)

ఇప్పుడామె ఒక వాణిని వింటుంది. శాశ్వతంగా ఇక్కడే ఉండిపోయి, తన సంఘర్షణల ఫలాల ననుభవించటం వివేకం కాదా? శాశ్వతంగా ఒక మార్పులేని దేవత కావటం!

*Ascend, O soul, into thy blissful home.*
*Here in the playground of the eternal Child*
*Or in domains the wise Immortal tread*
*Roam with thy comrade splendour under skies*
*Spiritual lit by an unsetting sun,*
*As godheads live who care not for the world*
*And share not in the toil of Nature's powers :*
*Absorbed in their self-ecstasy they dwell.*

**అధిరోహతు హే ఆత్మన్! త్వదానందపూర్ణగృహమ్ములోనికిన్.**
**నిత్యబాలక్రీడా స్థలిలో, వివేకి దేవతల్ నడచు**
**సీమలలో తిరుగాడుము నీ వైభవమిత్రునితో**
**అనస్తంగమత్సూర్యసందీప్తమౌ ఆధ్యాత్మికాకాశ తలమునన్,**
**దేవతలేరీతి లోకచింతలేక,**
**ప్రకృతి శక్తుల పరిశ్రమన్ పంచికొనక :**
**ఆత్మానందమగ్నులైయుందు, రట్లె జీవించుమా.**

వెంటనే ఆమె ఆ ఆలోచనను నిరాకరిస్తుంది. శాశ్వత రాత్రినామె నిరాకరించింది; అట్లే ఆమె శాశ్వతాహస్సును గూడ నిరాకరించింది. స్వర్గంలో ఒక దేవతగా స్థానాన్ని పొందటం ఆకర్షకం కాదు. ఎందుకంటే, అప్పుడీ సత్తకు సాహసం లోపిస్తుంది. ఏదేమైనా, తన బిడ్డల నామె వదలివేయునా?

*Earth is the chosen place of mightiest souls;*
*Earth is the heroic spirit's battlefield,*
*The forge where the Archmason shapes his works.*
*Thy servitudes on earth are greater, King,*
*Than all the glorious liberties of heaven.*

**బలవత్తమ ఆత్మలకీ భూమి వరభూమి;**
**వీరసత్తాయుద్ధభూమి యీ భూమి,**
**ప్రధానలేపకుని కార్యరంగభూమి ఈ భూమి.**
**స్వర్లోకస్వేచ్ఛావైభవసర్వస్వమునకంటె**
**భూలోకదాస్యముల్ మహత్తరము లో రాజన్!**

ముందు రాత్రియై, ఇప్పుడు దివమైన దైవము, మృత్యువు జీవము రెండు తానైనవాడు, సావిత్రి ప్రలోభపడనందుకున్ను, భూమిని దైవీకరించే క్లిష్టమైన కార్యమెంత మహద్విషయమో తెలిసి విరమించినందుకున్ను సంతోషించినాడు. సత్తానంత్యములకు పైకెగయుమని ఆతడామెను ప్రబోధించినాడు. ఆమె అనువర్తించినది. మరల ఆమెను, భూజీవనము శాశ్వతస్వర్గావాసముల మధ్య ఒకటి ఎంచుకొమ్మన్నాడు. ఆమెకు ఎంచుకొనే అవకాశం నాలుగుసార్లు లభించింది, నాలుగుసార్లూ ఆమె భూమిపై జీవనాన్నే ఎంచుకున్నది. శాశ్వతమైన అహస్కాలమున జీవితమును కాదని ఆమె ఆ ప్రభుని శాంతి, ఏకత, శక్తి, ఆనందములను కోరుకున్నది. పరమేశ్వరు డామెనెంతగానో ఆశీర్వదించి, ఆమె చేస్తూన్న ఈ పరిశ్రమలో, మహోన్నత కృషిలో, దివ్యజీవనాన్ని భూమిపై వెలయింప జేయుటలో తాను సంపూర్ణంగా ఆమెను సమర్థిస్తూన్నానంటాడు.

*Descend to life with him thy heart desires.*
*O Satyavan, O luminous Savitri,*
*I sent you forth of old beneath the stars*
*A dual power of God in an ignorant world,*
*In a hedged creation shut from limitless self,*
*Bringing down God to the insentient globe,*
*Lifting earth beings to immortality.*

**నీ హృదయము కోరినవానితో నవతరించుము జీవమై.**
**ఓ సత్యవాన్, ఏ దీప్తిమతీ సావిత్రీ!**
**పూర్వము మిము నే నంపితి తారల క్రిందికి,**
**అజ్ఞానమయలోకమున దేవుని శక్తియామలముగ,**
**అనంతాత్మకు దూరమైన ఒక పరిమిత సృష్టికి,**
**అచేతన గోళమునకు దేవునవతరింపజేయ,**
**భూతలవాసులన్ అమరత్వమున కుద్ధరించి.**

"భూలోకవిధినుద్ధరింప" కార్యోన్ముఖయైన దివ్యశక్తి కావలె సావిత్రి. ఆ దివ్యశక్త్యాత్మయై సత్యవంతుడు రాత్రి నుండి "కాలరాహిత్య అత్యుత్తమ కాంతి దిశగా అధిరోహించవలె." మృత్యువు అంతమై, అజ్ఞానము మరణించు" నొక కాలము మున్ముందు వచ్చితీరుతుంది. అది జరిగే ముందు, సత్యబీజావాపము భూమిపై జరిగి, పరిణామము సరియైన దిక్కుగా సాగవలసి యున్నది. మనస్సు నతిక్రమించే కాలం కూడా రానున్నది:

*The spirit shall look out through Matter's gaze*
*And Matter shall reveal The Spirit's face.*

*Then man and superman shall be at one*
*And all the earth become a single life.*

**పదార్థపు చూపులో నుండి చూచు నాత్మ,**
**పదార్థమున గల్గు నాత్మదర్శనంబు.**
**మానవుండు నతిమానవుండు నొకటిగాగ**
**పుడమి యంతయు నొకే జీవనంబగున్.**

పరమాత్మ వాణి, "ఈ భూతల జీవనంబగు దివ్యజీవనంబు" (*this earthly life become the life divine*) అన్న వరదానంతో అంతర్హితమవుతుంది. ఇప్పుడు సావిత్రి ఆత్మ భూమికి దిగివస్తుంది, తనతో "వసంతహృదయాన దాగిన పుష్పమువలెన్" (*like a flower hidden in the heart of spring*) సత్యవంతుని ఆత్మను కూడ తీసికొని.

*A power leaned down, a happiness found its home.*
*Over wide earth brooded the infinite bliss.*

**ఒక శక్తి వినమితమైనది, స్వగృహముజేరె నొక హర్షము.**
**విశాల భూతలముపై అనంతానందము సన్నివిష్టమాయె.**

❊ ❊ ❊

## 12వ కాండ - ఉపసంహారము

## భూమికి పునరాగమనము

అంతరంగంలోకి సాగిన మహాప్రయాణమది. సత్యవంతుడూ సావిత్రీ, "అరణ్యంలో మరణం" అన్న సర్గ చివరలో ఉన్నట్లే, ఇంకా అడవిలోనే ఉన్నారు. సత్యవంతుడింకా గాఢనిద్రలోనే ఉండగా, సావిత్రి తన ప్రగాఢ సమాధి నుండి బహిర్ముఖురాలై, తన చుట్టూ చూస్తుంది :

Lain on the earth-mother's calm inconscinet breast
She saw the green-clad branches lean above
Guarding her sleep with their enchanted life,
And overhead a blue-winged ecstasy
Fluttered from bough to bough with high-pitched call.
Into the magic secrecy of the woods
Peering through an emerald lattice - window of leaves,
In indolent skies reclined, the thinning day
Turned to its slow fall into evening's peace.

**ధాత్రీమాతృప్రశాంతాచేతన హృదయముపై పరుండిన**
**హరితవస్త్రాలంకృతశాఖలు తనపైకి వంగియుండ జూచె**
**తమ మంత్రముగ్ధజీవముతో తన నిద్రకు రక్షసేయుచు,**
**తలపై నొక నీలపక్షసహిత హర్షాతిరేకము**
**కొమ్మనుండి కొమ్మకు దుమికె తారశ్రుతిం బిల్చుచున్.**
**తద్వనమాయాజాలరహస్యములోనికి**
**ఒక పచ్చల పత్రాల వాతాయనమునుండి తొంగి చూచి,**
**అలసాకాశమున విశ్రమించి, పల్చనౌ పగటి వెల్గు**
**సాయంశాంతిలోనికి మెల్లగా గ్రుంకె.**

సాయంకాలం అయింది. ఆమె సత్యవంతుని తాకింది. సంఘర్షణ సమాప్తమయిందని ఆమెకు తెలుసు. విజయాన్ని సాధించినట్లు తెలుసు. ఒక కొంతసేపు ఆమె ఆ శాంతినీ ఆనందాన్నీ అనుభవిస్తూ సగం మెలకువ కలిగియున్నది. అంతట సత్యవంతుని ప్రేమతో కౌగిలించికొన్నది. ఆతడు కనులు తెఱచి ఆమె కన్నులలోనికి చూచినాడు. అంతా చెప్పలేని సంతోషం, ఒక గుప్తమైన ఆధ్యాత్మిక సంయోగం. ఆతడు కూడా తానెఱిగిన సావిత్రిలో ఒక అనుగ్రహకారకమైన మార్పును గుర్తించినాడు. ఆమె

అదే సావిత్రియేనా? తన భార్యయేనా? ఆతడు ఆశ్చర్యచకితుడవుతాడు. వాని మాటలు ఈ కాండ విశేషాన్నంతా, సావిత్రి సంఘర్షణా విజయాల విషయాన్నంతా సమీకరించి చెబుతూన్నాయి :

Whence hast thou brought me captive back, love-chained,
To thee and sunlight's walls, O golden beam
And casket of all sweetness, Savitri,
Godhead and woman, moonlight of my soul?
For surely I have travelled in strange worlds
By thee companioned, a pursuing spirit,
Together we have disdained the gates of night.
I have turned away from the celestial's joy
And heaven's insufficient without thee.

**ప్రేమతో బంధించి నన్నెట నుండి గొనితెచ్చినావు**
**నీకున్ సూర్యరశ్మిభిత్తికలకున్ బందీగ, సావిత్రీ!**
**ఓ బంగారు కిరణమా, మాధుర్యసర్వస్వమంజూషమా,**
**వనితవౌ ఓ దేవతా, నా ఆత్మచంద్రికా!**
**నీవు తోడైరాగ సత్తవై వెన్నాడి**
**చిత్రలోకాలలో తిరుగాడితిం గదా నిశ్చయముగ,**
**ఇర్వురముంగూడి నిశీథిద్వారముల నవజ్ఞజేసి.**
**దివ్యానందము న్నేను తిరస్కరించినాడ**
**స్వర్లోకమసంపూర్ణమాయె నీవు లేకున్న కతన.**

తమను నశింపజేయటానికి, మరణమే చరమమనీ శూన్యమే సత్యమనీ అంటూ విక్రమించిన రాత్రి భయంకర స్వరూపాన్ని అతడు చూచినాడు. లేక, కలగన్నాడా? ఏమో! సావిత్రి సమాధానం యోగ్యమైనది, నిశ్చయాత్మకం : "మన ఎడబాటు స్వప్నము; మనము కలిసి ఉన్నాము, జీవించియున్నాము, ఓ సత్యవాన్" (Our parting was the dream; We are together, we live O Satyavan!) సంతోషంగా, ఒకరి సమక్షంలో ఒకరు క్షేమభావంతో, చెట్టాపట్టాల్ వేసికొని, వారు లేచి, ఆశ్రమానికి తిరిగి వెళ్ళేందుకు సిద్ధమవుతారు. అయినప్పటికి, స్వప్నం కంటే అధికంగా మరేదో ఈ పచ్చని అటవీభూమిపై ఉన్నదని సత్యవంతుడు గ్రహిస్తాడు. ఆమె అప్పటి సావిత్రిగానే ఉన్నప్పటికిన్నీ, తన ప్రియభార్య పూర్తిగా మారిపోయినట్లు తోస్తూన్నది. ఆమె ఇప్పుడొక దేవతగా, "మానవుల ఆరాధనకు అందనంత ఉన్నతురాలు, మహాత్మురాలు"గా (too high and great for

mortal worship) అతనికి భావన కలుగుతూ ఉన్నది. అది అద్భుతమైన మార్పు కాని ఆమె తనకొక ప్రియభార్యగానే ఉండటం తనకిష్టం. సమాధానంగా సావిత్రి అతని పాదాలంటి నమస్కరించి, తానెప్పుడూ సత్యవంతుని సావిత్రినే నని అంటుంది :

*A heavenly queen consenting to his will,*
*She clasped his feet, by her enshrining hair*
*Enveloped in a velvet cloak of love,*
*And answered softly like a murmuring lute;*
*All now is changed, yet all is still the same.*
*Lo, we have looked upon the face of God,*
*Our life has opened with divinity.*

**వాని మనీషనొప్పి దివ్యరాజ్ఞీలలామ**
**ప్రేమమృదులాలక ప్రావార సుప్రతిష్ఠితుడౌ**
**వాని పాదముల్ బట్టి వల్లకీ లలితమర్మరధ్వనిన్**
**వాని కనియెనిట్లు : "ఇపుడంతయు మారిపోయె,**
**ఐన నంతయు యథాపూర్వమున్నయది.**
**మనము పరమాత్ము ముఖాముఖి దర్శించినాము,**
**మన జీవితము దివ్యత్వప్రఫుల్లమాయె, చూడు.**

మర్త్యలోకానందమేదియు వారికి నిషిద్ధం కాదు. ఐనను దైవసంకల్ప సాఫల్య సాధనకు వారు సమతౌల్యంతో ఉన్నారు. ఇద్దరు కలసి "మానుషాత్మను నడిపింపగలరు సత్యము దైవమున్ లక్షించి" (lead man's soul towards truth and God) వారు.

ముసిరే చీకట్లో వారు గృహోన్ముఖులు కాగా, వారి కొక పెద్ద గుంపు, ధనవంతుల దుస్తులు ధరించి, యోద్ధలూ, ఋషులూ, స్త్రీలూ, సందడి చేసుకుంటూ ఎదురుగా వస్తారు. వారిలో ప్రతియొక్కరూ సావిత్రీ సత్యవంతుల కోసం వెదుకుతూ వచ్చినవారే. వారిలో అందరికంటే ముందుగా సత్యవంతుని తల్లి వారిని చూస్తుంది. ద్యుమత్సేనుడు ఇప్పుడు అంధుడు కాడు. మళ్ళీ సాల్వదేశపు రాజైనాడు. ఆతడా అందమైన జంటతో ఇట్లా అంటాడు:

*What danger kept thee for the darkening woods?*
*Or how could pleasure in her ways forget*
*That useless orbs without thee are my eyes*
*Which only for thy sake rejoice at light?*
*Not like thyself was this done, Savitri,*
*Who ledst not back thy husband to our arms,*
*Knowing with him besides me only is taste*
*In food and for his touch evening and morn*
*I live content with my remaining days.*

**అంధకారాయితవనంబులం దాపదావిష్టులై**
**యుంటిరా? లేక సుఖావహమార్గము మిమ్ము**
**నా నేత్రానందము న్నాకు దూరస్థులం జేసెనా?**
**మీకై గాదె నే నీ కన్నులం గాంతి నించుటల్?**
**నీవు నీరీతి వర్తింతువో సావిత్రీ, నీ భర్తన్**
**మా చెంతకుంజేర్చగా బోక? ఎఱుగవే ఆతండు**
**సహపంక్తి లేనిచో రుచ్యముగాదని మా కన్నమున్?**
**ఉదయాస్తంబులన్ తత్స్పర్శ యున్నంత**
**శేష దివంబులు జీవింతు నే సంతృప్తిమై.**

సత్యవంతుడు నవ్వి, తిరిగి రావటంలో ఆలస్యానికి నిజంగా సావిత్రిదే బాధ్యత అనీ, ఎందుకంటే, ఆమే కదా తనను భూమ్మీదికి తిరిగి తెచ్చింది అనీ, అంటాడు. వారి కాశ్చర్యం కలుగుతుంది. ఋషులామెనడుగుతారు. ఆమె ఒక్క ముక్కలో, "ప్రేమనూ ఏకతనూ అనుభవించటమే జీవించటం" అని తాను తెలుసుకున్నానని చెబుతుంది. ఇంతకు మించి చెప్పగల మాటలున్నాయా? మృత్యుదేవతతోనూ దేవునితోనూ సమర్థవంతంగా తన వాదాన్ని వినిపించి, ఇప్పుడామె, తన స్వభావాని కనుగుణంగా, మౌనం వహిస్తుంది. శ్రీ అరవిందులు తమ మహాకావ్యాన్ని 'లక్షణ ప్రత్యూషము' అన్న సర్గతో ప్రారంభించినారు. ఇప్పుడు, సావిత్రీ సత్యవంతులు సాళ్వ రాజ్యానికి చెట్టాపట్టాల్ వేసికొని తిరిగి వెళ్ళే సమయంలో, శ్రీ అరవిందులు మరియొక ప్రత్యూష వర్ణనతో, మనకు అభయంగా మానవజాతికి సర్వతః శుభం, అంటూ ముగిస్తారు:

Night, splendid with the moon dreaming in heaven
In silver peace, possessed her luminous reign,
She brooded through her stillness on a thought
Deep-guarded by her mystic folds of light,
And in her bosom nursed a greater dawn.

**ఆకాశంలో, రాజతశాంతిలో, చంద్రుని కలల**
**వైభవంతో, రాత్రి తన కాంతిమత్వాలన సాగించినది.**
**నిశ్చలంగా తాను తన గుప్తదీప్తిపుటములచే**
**రక్షింపబడుచు పొదిగిన దొక భావమున్,**
**ఆమె హృదయాన మహత్తర ప్రత్యూషమొకటి వృద్ధియయ్యె.**

❊ ❊ ❊